

సాహిత్య కార్యశాలను లాంఛనంగా ప్రారంభిస్తున్న నాగార్జున విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య కె.వియన్నారావు.
ప్రారంభోపన్యాసం చేస్తున్న శాసనమండలి సభ్యులు కె.యస్. లక్ష్మణరావు

**సాహితీస్రవంతి కృష్ణా జిల్లా కమిటీ ఆధ్వర్యంలో విజయవాడలో సెప్టెంబర్ 30, అక్టోబర్ 1న జరిగిన సాహిత్య కార్యశాల దృశ్యాలు**



ప్రారంభ సభలో ప్రసంగిస్తున్న గోళ్ళ నారాయణరావు, అద్దేపల్లి రామమోహనరావు, ఓల్గా, కె. ఆనందాచారి, మేడిపల్లి రవికుమార్, కె. సత్యరంజన్



నాటక సదస్సులో అధ్యక్షోపన్యాసం చేస్తున్న ఎస్. వెంకట్రావు



వైయస్. కృష్ణేశ్వరరావు　దేవేంద్ర　అదృష్టదీపక్



కొత్తపల్లి రవిబాబు



సి. ఉమామహేశ్వరరావు



బాల సాహిత్యం సదస్సులో అధ్యక్షోపన్యాసం చేస్తున్న నండూరి రాజగోపాల్



రెడ్డి రాఘవయ్య　అరిబండి ప్రసాదరావు　సత్యాజీ



అలపర్తి వెంకట సుబ్బారావు



రావెళ్ళ శ్రీనివాసరావు

PRSVM02A142

సాహిత్య ప్రస్థానం
సంపుటి : 11 అక్టోబర్ 2012 సంచిక : 10

# సరళీకృత గరళం

**చే**దుమాత్రపై తీపి పూతలా ప్రభుత్వం వినాశకరమైన విధానాలను విస్తృత స్థాయి ప్రచారంతో ముందుకు తెస్తున్నది. శరీరానికి మేలుచేసే మాత్ర అయితే ఫరవాలేదు గాని నష్టదాయకమైన విధానాలను ఆకర్షణీయంగా చూపించి దేశంపై రుద్దే ఆలోచన సరైంది కాదు. ఉదాహరణకు ఇప్పుడు చిల్లర వ్యాపారంలో విదేశీ పెట్టుబడులను ఆహ్వానించాలన్న నిర్ణయం అలాంటిదే. వ్యవసాయం తర్వాత అత్యధికులకు జీవనోపాధి కలిగిస్తున్న చిల్లర రంగం విదేశీ తిమింగళాలకు అప్పగిస్తే కలిగే దుష్ఫలితాలు ఇప్పటికే చాలా దేశాలు చవిచూశాయి. ఈ రంగంలో ప్రపంచ దిగ్గజం లాంటి వాల్‌మార్ట్ స్వదేశమైన అమెరికాలోనే అగ్రహాన్ని చవి చూసి తాళాలు వేసుకుంటున్నది. కాని మన పాలకులు మాత్రం దాని వల్ల కలిగే మేళ్లను భూతద్దంలో చూపించి చిల్లర బతుకులు ఛిద్రం చేసేందుకు సిద్ధమైనారు. దీనిపై కేంద్ర పాలక కూటమిలోనే భిన్నాభిప్రాయాలు వ్యక్తమైనా ఖాతరు చేయకుండా విదేశీ సంస్థల మెప్పు కోసం పాకులాడుతున్నారు. కొందరు మేధావులు ఆర్థిక వేత్తలు కూడా లోతుపాతులు పరిశీలించకుండా దీనివల్ల వ్యవసాయానికి చాలా మేలు జరుగుతుందని భ్రమలు గొల్పుతున్నారు. చిన్న సన్నకారు రైతులు అత్యధికంగా వుండే ఈ దేశ పరిస్థితులలో కార్పొరేట్ సేద్యం ప్రధానమైన అమెరికా ఐరోపా అనుభవాలు వర్తించవన్నది అసలు విషయం. ఇదొక్కటే గాక సరళీకరణ పేరిట సాగిస్తున్న గరళీకరణ విధానాలు మరోసారి తీవ్రమవుతున్నట్టు అనేక నిర్ణయాలు హెచ్చరిస్తున్నాయి. ప్రైవేటు వాణిజ్యం, విదేశీ పెట్టుబడులను అనుమతించనే రాదని ఎవరూ చెప్పరు గాని మన దేశ స్వాతంత్రానికి స్వీయాభివృద్ధికి చేటు రాకుండా చూసుకోవలసిన బాధ్యత మాత్రం ప్రతి ఒక్కరిపై వుంది.

బొమ్మలు : శివాజీ, వెంకటేష్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొరప్రసాద్
వల్లభాపురం జనార్దన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి
కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com

కథ

# బంధాలు




తమ్మెర రాధిక
9440626702


నగరం మేలుకోక ముందే సుహా తయ్యారైపోయింది ఆఫీసుకు. పిల్లల గురించి భర్తకు ఇచ్చే సూచనలన్నీ అయిపోయాయి. కుర్చీ మీద వేసిన కోటు వేసుకుని బైటికొచ్చి, సాయికి బై చెప్తూ లిఫ్ట్‌లో క్రిందికి వచ్చేసింది. సాయి తలుపేసుకుని హాల్లోనే పిల్లల మధ్య పడుకుని దుప్పటి కప్పుకోబోతున్నాడు, ఇంతలో ఫోన్ మోగింది.

"హలో" అన్నాడు సాయి.

"సాయీ... క్యాబ్ డ్రైవర్ మారినట్టున్నాడు. ఒక్కసారి వచ్చి మాట్లాడిపో. నేనింకా క్యాబ్ దగ్గరికి వెళ్ళలేదు." క్రింది నుంచి సుహా మాట్లాడింది. సాయి లేచి క్రిందికొచ్చాడు. ఇంకా తెల్లవారలేదు. అయిదు కావడానికి పది నిమిషాలుంది.

"ఫరూక్ ఏడి?" డ్రైవర్ని అడిగాడు సాయి.

"ఫరూక్‌ను స్టోర్స్ డిపార్ట్‌మెంటుకు వేసారు. నన్ను మేనేజర్ సాబ్ పొమ్మన్నారు. నా పేరు రుద్ర." అన్నాడతను.

"ఆఫీసు వాళ్ళు అందరి ఫోన్ నంబర్లు ఇచ్చారా?"

"ఆఁ.. సార్.. ఇదిగోండి ఈ నంబర్లు పికప్ చేసుకు రమ్మన్నారు. బండి కూడా మాడమ్ వాళ్ళు రోజూ ఎక్కేదే కదా!" అన్నాడు రుద్ర. సాయి అన్నీ కన్‌ఫమ్ చేసుకున్నాక సుహాకు సైగ చేసాడు ఫర్లేదు వెళ్ళమని.

ఆమె వెళ్ళిపోయాక గ్యాస్ మీద పాలూ, కుక్కర్‌లో ఆలుగడ్డలూ, క్యారెట్లూ పెట్టి పొయ్యి వెలిగించి బ్రష్ చేసుకుని టీ త్రాగాడు. బాబుని లేపి స్కూలుకి తయ్యారు కమ్మన్నాడు. వాడు లేచి మళ్ళా పడుకోవడం చూసి బలవంతానా బాత్రూంలో నిలబెట్టాడు కోప్పడి. పాపకు రెండ్రోజుల్నించీ జ్వరం వస్తోందని సాయి సెలవులోనే వున్నాడు. ఇవ్వాళ దాన్ని కూడా జాగ్రత్తగా బళ్ళో దింపి ఆయాకు చెప్పాలి. మందులూ అవీ టైముకు వెయ్యమని అనుకున్నాడు బియ్యం కడిగి పొయ్యి మీద పెడ్తూ. జ్వరంతో అలసిపోయిన పాప మొహం నిద్దట్లో కందిపోయి వుంది. అది చూసి సాయి మనసు దిగులుపడింది.

తాము యిద్దరు కాక కాస్త పెద్దవాళ్ళెవరైనా ఇంట్లో వుంటే ఎంత బాగుండేదీ? పాప ప్రక్కన కూర్చుని ఆరోగ్యం చూసుకుంటే ఇలాంటప్పుడు ఎంత నిశ్చింతగా వుండేది. తన చిన్నప్పుడు జ్వరం వస్తే శొంఠి పొడి నేతిలో కల్పి వేడన్నం పెట్టేది బామ్మ! అది గుర్తొచ్చిందతనికి. తామిద్దరూ సాఫ్ట్‌వేర్ ఉద్యోగాల్లో వుండటం వల్ల బంధువులు కూడా ఎవరూ రెండ్రోజులు తమ ఇంట్లో వుండలేని పరిస్థితులు.

పిల్లలిద్దర్నీ కుర్చీల్లో కూర్చోమని చెప్పి పాలగ్లాసులు తెచ్చాడు. వాళ్ళు పాలు తాగాక తండ్రికి ఫోన్ చేసాడు సాయి. "నాన్నా ఓ రెండు మూడు నెల్లు హైదరాబాద్ వచ్చి వుండు." అన్నాడు సాయి.

"........"

"అక్కడ ఎప్పుడూ వుండే పన్లేలే నాన్నా... పిల్లల్ని కాస్త దగ్గరుండి చూసుకుందువు."

"...."

"ఆఁ... అవును జ్వరాలు వస్తే ఆయాల మీద వదిలెయ్యాల్సి వస్తోంది."

"...."

"పండగలు ఎవరైనా పిల్లల మధ్యలో చేసుకోవాలనుకుంటారు. నువ్వేంటీ అవి అయిపోయాక వస్తానంటావ్?" ఆశ్చర్యంగా అడిగాడు సాయి.

"...."

"ఇది కూడా నీ యిల్లే నాన్నా ! నువ్వెప్పుడూ అలా అనుకోవద్దు."

"...."

"ఎవరైనా ఏమయినా అంటే నేను చూసుకుంటాను సరా?"

"....'

"పిల్లలూ మీ తాతయ్య... మాట్లాడండి." వాళ్ళకు ఫోన్ ఇచ్చి, సైగ చేసాడు తాతయ్యను ఇక్కడికి రమ్మనమనండి అని. పిల్లలు నవ్వారు.

మూడు గంటలకు ఆఫీసు నుంచి వచ్చిన సుహా స్కూల్ నుంచి పిల్లల్ని తీసుకొచ్చి టీ.వీ చూస్తూ కూర్చుంది.

"అమ్మా డాడీ పొద్దున్న తాతకు ఫోన్ చేసాడు." అన్నాడు బాబు. "ఏమనీ?" ఆశ్చర్యపోయింది సుహా, పిల్లలు ప్రత్యేకంగా తనకు చెప్పడం చూసి.

"ఇక్కడికి తాతని తొందరగా రమ్మనమని చెప్పాడు. ఎందుకంటే మాకు జొరాలు వస్తున్నాయట. మమ్మల్ని చూసుకోవడానికి రమ్మన్నాడు డాడీ." పాప చేతులు తిప్పుతూ అంది.



"తగ్గిపోయాయిగా జొరాలు... ఇప్పుడెందుకట ఆయన రాక! డాడీకి ఏం పన్లేదు... పోయిన సారి వచ్చినప్పుడు మనం వేరే యింట్లో వున్నాం చూడు... అప్పుడు వద్దంటే బజారు పన్లు అన్ని చెయ్యడం, మీటింగులకు పోయి అర్థరాత్రి రావడం... అందుకే కదూ ఆయన్ను ఆటో గుద్దుతే కాలు విరిగి నాలుగు నెలలు మంచం మీ్మద వుంది..." సుహా విసుగు వాళ్లకు అర్థం కాకపోయినా తాత వస్తున్నాడన్న సంతోషకర వార్త, అమ్మ చిరాకు పడటం అన్నది కోపం కలిగిస్తున్నది.

"నువ్వేం అనగూడదు తాతని." కండీషన్‌గా అంది పాప.

"నేనేం అన్నానే ఆయన్నీ! పైగా అడ్డమయిన చాకిరీ నాపైనే గదా!" ఆశ్చర్యపోయింది సుహా.

"మీ తాతని తిట్టానని చెప్పాడా డాడీ ! ఒక్క చోట కుదురుగా వుండడనేగా నాకు ఆయన్తో ప్రోబ్లెం." అంది ఫ్రిజ్జు దగ్గరికెళ్ళి కూరగాయల బుట్ట తెస్తూ.

"నువ్వే ప్రాబ్లెం తెస్తున్నావు తాతకి. ఇక్కడి కొస్తే తాతకి సరిగా గాలి రాదట, ఇంటికి ఎవ్వర్నీ రానివ్వవుట. వంట బాగా వుండాలిట. అన్నీ డాడీతో చెప్తున్నాడులే." ఫిర్యాదుగా అంది తల్లి వెనకాలే ఫ్రిజ్జు దగ్గరికి వెళ్ళి. ఆ పిల్ల మొహంలో అమ్మ తాతను రానివ్వదేమో అన్న భయం స్పష్టంగా కనపడుతోంది.

"ఇవన్నీ డాడీ నాతో ఒక్కసారి కూడా అన్లేదు. రానీ చెప్తా..." సుహా అక్కసుపడింది.

రాత్రి తొమ్మిదింటికి సాయి వచ్చేసరికే పిల్లలు పడుకున్నారు. టేబుల్ మీద కంచంలో మౌనంగా వడ్డిస్తున్న సుహాని చూసి –

"ఒంట్లో బాగ లేదా? డల్‌గా వున్నావు?" అడిగాడు సాయి.

"నీ పద్దతే బాగలేదు. మీ నాన్న వస్తున్నట్టు నాకెందుకు చెప్పలేదూ?" కోపంగా అడిగింది.

"పొద్దున్నేగా నాన్నకు ఫోన్ చేసిందీ? రేపు ప్రయాణం అవుతానన్నాడు. అయినా ఇప్పుడవన్నీ ఎందుకు పోయి పడుకో." పెరుగు వేసుకుంటూ అన్నాడు.

"ఆయన ఇప్పుడెందుకిక్కడికీ? పండగా పబ్బమా! ఆఫీసు పనీ, ఇంటిపనీ, పిల్లల పనీ, ఇప్పుడాయనవస్తే ఆయన పనీ నా వల్ల కాదీ చెత్తంతా నేనో మనిషినే." అంది విసురుగా.

"అవన్నీ నేను చూసుకుంటాను. ఆఫీసుకెళ్ళొచ్చెయి అంతే. ఇహపోయి పడుకో." కంచం సింకులో వేసి చేతులు కడుక్కుంటూ చెప్పాడు సాయి.

"ఏం చూసుకుంటావ్? నీ దార్న నువ్వు పోతే... ఆ ముసలాడు నాకు తప్పదు... పోయిన సారి కాలు విరిగితే ఎన్నాళ్ళు చేసాను?" సుహా గొంతులో పంతం చూసి –

"మైండ్ సరిగా లేదా? ముసలాడూ గిసలాడూ అని ఏం మాట్లాడుతున్నావ్? ఆయన ఆడతోడు లేకుండా ఆ పల్లెటూళ్ళో ఎన్నాళ్ళుంటాడు? కష్టమైనా నిష్టురమైనా నాతోనే వుంటాడు." సుహాని కఠినంగా హెచ్చరించాడు సాయి.

"అంటే అన్నీ ప్లాన్ ప్రకారమే చేస్తున్నావన్నమాట." అంది కోపంగా.

"ఇష్ట ప్రకారం చేస్తున్నా." నిర్లక్ష్యంగా జవాబిచ్చి పిల్లల మధ్యలోకి వెళ్ళి పడుకున్నాడు.

సుహాలో కసీ, కోపం, అసహ్యం, అలవికాని బాధా ఏకకాలంలో ఉక్కిరిబిక్కిరి చేసాయి. కళ్ళల్లో నీళ్ళు దునుకుతుంటే విసురుగా బెడ్‌రూంలోకి వెళ్ళిపోయింది.

కాంతారావు వచ్చిన రోజు ఇంట్లో భార్యా భర్తలిద్దరూ మర్యాద ముసుగులు వేసుకున్నారు. సుహా టీ కలిపి యిద్దరికీ ట్రేలో తీసుకొచ్చింది, లోలోపల విసుక్కుంటూ. మామూలుగా అయితే సాయి టీ వంట గదిలోకి వచ్చి తీసుకునే వాడు, ఇవ్వాళ తండ్రి పక్కనే కూర్చుని పేపర్ చూస్తున్నాడు. పిల్లలిద్దరూ తాతని ఒదలడం లేదు. అదంతా చూస్తోంటే తనే ఒంటరి దయినట్టుగా బాధపడింది సుహా.

మధ్యాన్నం ఆఫీసు అయిపోతుంది సుహాకు. మూడింటి కల్లా ఇంట్లో వుంటుంది. వస్తూ వస్తూ కూరగాయలు తెచ్చింది. సాయంకాలం కూరలు ముందేసుకుని కవర్లలో నింపుతుంటే

అటుగా వచ్చిన కాంతారావు –

"ఇవ్వాళ కాకరకాయ కూరలో పులుసు ప్లస్ పులుపూ రెండూ ఎక్కువైనాయే అమ్మాయ్. అలాక్కాదు చేసేది, పులుసుతో పాటు కొంచెం బెల్లం ముక్క పడేస్తే బావుంటుంది." అన్నాడు.

తను చేసిన కూరకలా వంక బెట్టడం ఆమె కిష్టం లేకపోయింది.

"తీపి మా కిష్టం వుండదు." అంది మాట విరిచినట్టుగా.

"సాయి చిన్నప్పుడు ఇష్టంగా తినేవాడు వాళ్ళమ్మ చేస్తే."

"చిన్నప్పటి సాయి కాదుగా... రుచులు మారడంలా."

"ఇవ్వాళ నేను చేస్తాను వుండు... ఎంత కమ్మగా వుండాలో కూర." "ఏంటీ మళ్ళా కాకరకాయ పులుసా వద్దులెండి పిల్లలకు వినుగు" అంటూ బీన్స్ ముందు వేసుకుని తరగడం మొదలుపెట్టింది. కాంతారావు నిస్సహాయంగా వుండిపోయాడు కోడలి మాటలకు.

భార్య పోయిందగ్గర్నించీ కాంతారావుకు పల్లెటూళ్ళో ఒంటరిగా వండుకు తినడం అలవాటు అయ్యింది. ఇంటి వెనుక పెరడులో రకరకాల కాయకూరలు పండిస్తాడు. ఎరువులు వెయ్యని కూరలు ఎంతో రుచిగా వండుకుంటాడు, తనింటికి వచ్చే ఊళ్ళోని బంధువులకూ, చుట్టు ప్రక్కల వాళ్ళకీ, పొలం పన్లు చేస్తే జీతగాళ్ళకు తన పాక శాస్త్రంలోని కిటుకులు చెప్తూ వండిన పదార్థాలు పెడుతుంటాడు. కానీ ఇక్కడ బీ.పీ లనీ, షుగర్‌లనీ ఉప్పులూ, కారాలూ తక్కువ వేసి కోడలు చప్పిడి కూరలు వండటం అతనికి జిహ్వకు ఆనడం లేదు.



బీన్సూ, కూరమిరపా, ముల్లంగీ ఇలాంటివి పల్లెల్లో దొరకడం చాలా అరుదు. బస్తీల్లో పుష్కలంగా దొరుకుతాయి. కాంతారావు వచ్చిందగ్గర్నించీ చూస్తున్నాడు, కోడలు బీన్స్‌లో పచ్చి కొబ్బరి వేసి వండుతుంది. సాంబారు పెడ్తే దాంట్లో ముల్లంగి ముక్కలు వేస్తుంది. కూర మిరపలో శనగపిండి పడేసి ఉడకేస్తే ఆయనకు భోజనం లోపలికి పోవడం లేదు.

ఒకరోజున సుహా ఆఫీసుకు పోగానే సాయితో చెప్పాడు. "నేను వంట చేస్తాను నువ్వు తినేసి ఆఫీసుకు పోరా సాయి."

"నీకెందుకు నాన్నా! ఏదో చేసిందిగా నీ కోడలు తింటాలే." అన్నాడు సాయి ఇబ్బంది పడిపోతూ.

"ఏంట్రా దాని మొహం వంట ! నే చేస్తా చూడూ." తండ్రి మాటలకు నవ్వాడు సాయి. కోప్పడటానికి కూడా ఓ ఆథారిటీ వుండాలి అనుకున్నాడు.

జాడీలో వున్న ఉప్పు చింతకాయ పచ్చడిని పచ్చి మిరపకాయలు వేసి రోట్లో దంపి, ఇంగువతో తిరగమోత వేసాడు. ఫ్రిజ్జులోని కూరల కవర్లు తీసి దాంట్లో మెంతికూర తీసి తరిగి పప్పు చేసాడు. మిరియాల పొడి కొట్టి ఘాటుగా టమాటా చారు కాసాడు. పిల్లలు కంచాలు రెడీగా పెట్టుకొని కూర్చున్నారు. వాళ్ళకు తాత చేసిన ఘాటైన వంటలు చూస్తే సంబరంగా వుంది. సాయి దగ్గరుండి నెయ్యి వేసి పచ్చడీ పప్పు కలిపి పెడుతుంటే కాంతారావు తృప్తిగా చూసాడు.

"మంచి గుమ్మడి కాయ కూరలో కాస్త బెల్లం వేసి అమ్మ బాగా చేసేది కూర కదా నాన్నా!" అన్నాడు సాయి.

"అవున్రా"

"అరటి దూట కూరా, తెలకపిండి కూరా ఎప్పుడైనా తినాలని నాలిక పీకినా, సుహాకు వండటం రాదు" సాయి మాటలకు పిల్లలు విచిత్రంగా చూసారు ఇన్ని రుచులు వుంటాయా అని.

ఆఫీసు నుంచి వచ్చిన సుహాకు చెప్పేసారు పిల్లలు తాత వండిన వంటల గురించి.

"వచ్చాక గిన్నెలు మూతలు తీసి చూసింది సుహా. రాత్రికి ఇంకేం వండను. అయినా ఇలా మసాలాలూ, కారాలూ తింటుంటే మెదడు చురుగ్గా పనిచెయ్యదు. చదువులో వెనకబడి మార్కులు తక్కువ వొస్తాయి మీ యిష్టం." అయిష్టంగా మొహం పెట్టింది సుహా.

"ఏం! ఎందుకూ!" పాప ఆశ్చర్యపోయింది.

"ఏం ఏంటీ నీ మొహం, మార్కులు మంచిగా రాకపోతే అంతా నవ్వుతారు. అయినా అలాంటి తిండి తింటే జబ్బులు చేస్తాయి. దాంతో స్కూలుకు వెళ్ళలేవు. నీ యిష్టం." పిల్లల మనోభావాలు కనిపెడుతూ చెప్పింది సుహా.

పిల్లలిద్దరూ మాట్లాడలేదు. అక్కడ్నించి లేచి వెళ్ళిపోయారు. సుహా నిస్సహాయంగా మిగిలిపోయిందక్కడ.

పిల్లల్ని దగ్గర కూర్చో బెట్టుకుని ఊర్కే మాట్లాడుతున్న మామగార్ని చూస్తే అరికాలి మంట నెత్తికెక్కుతోందామెకు. ఆదివారం వస్తే చాలు ఇల్లంతా అల్లరి చిల్లరగా గెంతులు పెడ్తూ ఆగం చెయ్యడం, పెద్ద గొంతులతో మాట్లాడటం, ప్రతీ దాన్నీ క్వశ్చన్ చెయ్యడం, ఇది చెయ్యి అది చెయ్యి అని దబాయించడం చూస్తోంటే ఆమెకు తెలియకుండానే అసహనానికి లోనవుతోంది. పిల్లల్లో హుందాతనం కనబడట్లేదని సాయి ముందు వాపోయింది. పిల్లల్ని అలా హాయిగా ఒదిలేసి, ఏం చేస్తున్నారో గమనిస్తూ ఆనందపడు అని సలహా ఇచ్చాడు సాయి.

ఒకరోజు సుహా ఆఫీసు నించి వచ్చిందో లేదో అపార్ట్‌మెంటు లోని ప్రక్క వాటా ఆమె రెండు కప్పులు తెచ్చి ఇస్తూ, బాబాయి గారు గోంగూర పచ్చడీ, వడియాలూ పెట్టి ఇచ్చారు. ఆ కప్పులే ఇవి అంటూ ఇచ్చిపోయింది.

ఇంకోరోజు కాంతారావు స్నానం చేస్తుండటంతో ఎదురు వాట శంకర్రావు వచ్చి రెండు సంచులు సుహాకిచ్చి మీ మామగారు కూరగాయలు తీసుకొస్తానన్నారు అని డబ్బులు ఇచ్చి పోతుంటే తెల్లమొహం వేసింది సుహా.

రాౖనానూ మావగారి పద్ధతిని సుహా భరించలేకపోతోంది. ఇరుగు పొరుగు వారికి పచ్చళ్ళు కూరలు పంపడం, బజారుకు వెళ్ళినప్పుడు వాళ్ళకేమైనా అవసరమైతే సరుకులు తేవడం, ఆదివారాలూ సెలవురోజులు వచ్చినప్పుడు చుట్టుప్రక్కల పిల్లల్ని పోగుచేసి రకరకాల కథలు చెప్పడం, వాళ్ళు పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతుంటే సుహా భరించలేకపోయేది.

తన గురించే చెప్తూ నవ్విస్తున్నాడేమో! ఇంట్లో విషయాలు చుట్టు ప్రక్కల వాళ్ళకు చేరేస్తున్నాడేమో! తమ ఆదాయ ఖర్చులు ఎవ్వరికీ తెలియడం తన కిష్టం వుండదు. సుహాకు తన గిరిగీసుకు కూర్చున్న పీఠం కదిలిపోయినట్లు కుమిలిపోయింది.

ఆ రోజు సుహా ఆఫీసు నించి ఇంటికి వచ్చేసరికి ఇంటి నిండా సామాన్లూ సరుకులూ కూరగాయలూ బుట్టల నిండా ఇల్లంతా పరిచి వున్నాయి. ఎదురింటి పనబ్బాయీ, కాంతారావు వాటిని సదరడం చూసి –

"ఏంటీ సామానూ, కూరగాయలూ ఎందుకివన్నీ ఇప్పుడు? ఇల్లు ఇల్లులా లేదు చేపల మార్కెట్ చేసేసారు." అసహనంగా విసుక్కుంది. ఆమెకు సమాధానం చెప్పకుండా –

"బాబూ నువ్వెళ్ళు" అంటూ పనబ్బాయిని పంపేసాడు కాంతారావు.

"ఎందుకు ఎప్పుడూ ఎవరో వకర్ని మనింటికి తీసుకువస్తారూ? వాళ్ళు మంచి వాళ్ళవునో కాదో... ఇప్పుడీ సంత అంతా ఏంటి?" కోపంగా ప్రశ్నించింది మామగార్ని.

"నీకు తెలియకనే అడుగుతున్నావా? కోడలి మొహంలోకి సూటిగా చూస్తూ అడిగాడు.

"అంటే !" అదో రకంగా అంది సుహా. ఆ అనడంలో ఎంతో నిర్లక్ష్యం కనపడుతోంది.

"ఇంకో రెండు రోజుల్లో మీ అత్తగారి తద్దినం వుంది. చుట్టు ప్రక్కల వాళ్ళని భోజనాలకి రమ్మన్నాను. అన్నదానం చేద్దామని." అన్నాడు తాపీగా. ఆయనకూ అమీ తుమీ తేల్చుకోవాలనే వుంది.

"నాన్సెన్స్... భోజనాలకు పిలవడమేంటీ? ఈ ఆర్భాటం నాకిష్టం లేదు. అయినా ముక్కూ మొహం తెలియని వాళ్ళందర్నీ పిలిస్తే వాళ్ళు వస్తారా! ప్రతీ వాళ్ళూ తెల్లారిలేస్తే ఎంతో బిజీగా వుంటుంటారు, అన్నదానం చేద్దామంటే ఇదేం సత్రం కాదు." అంది విసురుగా.

కోడలులోని కోపం ఆవేశం చూసి, ఇప్పుడు మాట్లాడటం సరి కాదనుకుని "సరేమ్మా నీ యిష్టం వచ్చినట్టే కానియ్యి." అంటూ బైటికెళ్ళిపోయాడు.

సాయంకాలం సాయి రాంగానే, మమగారు తెచ్చిన కూరగాయలూ, సరుకులూ చూపిస్తూ –

"అన్నీ నువ్వు చూసుకుంటానన్నావు కదా ! ఇప్పుడు చూడు తద్దినం పేరుతో నా తద్దినం పెట్టేట్టున్నాడు మీ నాన్న." అంది సుహా కోపంగా. "సామానే కదా తెస్తా, ఎలాగూ తద్దినానికి ఇవన్నీ పడుతాయి." ఆమె ఆలోచనేంటో తెలుసుకోవాలనే ఉద్దేశంతో అన్నాడు సాయి.

"ఏంటీ పట్టేదీ వంద మందికి సరిపడా సామాను తెచ్చాడు తెల్సా!" సుహా వెటకారం చూసి –

"అవును... అందర్నీ పిలుస్తానన్నాడు నాన్న." అన్నాడు సంచీలల్లోకు సరుకులు ఎత్తుతూ.

"అంటే మీరంతా ముందుగా అనుకుని చేస్తున్నారన్నమాట ! అయినా ఇంత మందికి ఈ యింట్లో ఎట్లా చేస్తాం !" అంది పంతంగా. సాయికి ఆశ్చర్యంవేసింది ఆమె ధోరణి.

"అమ్మ తద్దినం రోజు మా వూళ్ళో అరవయి డెబ్బయి మంది భోజనం చేస్తారు. వంట మనిషిని పెట్టి చేయించడం నీకు తెలియదా!"

"ఇక్కడ కుదరదంటున్నాను. సింపుల్‌గా కాని చేద్దాం."

"అది నాన్న యిష్టం. వంట మనిషిని పెడదాం. ఆయనకు తెల్సినవాళ్ళు ఈ అపార్ట్‌మెంటులోని కొద్దిమందేగా ! సిటీలో మన బంధువుల నెవరినైనా ఆయన పిలిచాడేమో ! ఇదంతా చెయ్యాల్సిన బాధ్యత నీదీ, ఆ సంగతి అయినా తెల్సునా?" విసురుగా అన్నాడు సాయి.



"నాకు సెలవు దొరకదు. ఆఫీసు అయ్యాక మధ్యాన్నమే వస్తాను." సాయి మాటలకు నిర్లక్ష్యంగా జవాబిచ్చి వెళ్ళిందక్కడి నుండి. సాయి ఏం మాట్లాడ కుండా సామాను సర్దడంలో మునిగిపోయాడు.

"మా కోడలు ఎంత ప్రయత్నించినా దానికి సెలవు దొరకలేదండీ!" మామగారు వచ్చిన అతిధులతో చెప్పడం తద్దినం రోజు సుహా మూడు గంటలకు ఇంట్లో కోస్తూ విన్నదీ మాటలు. లోపల తద్దినం బ్రాహ్మలు భోజనం చేస్తున్నారు. మధ్య హాల్లో వంట వాళ్ళు ఇరవయి మందికి వడ్డన చేస్తున్నారు. సాయి మధ్య మధ్యలో ఎవరికేం కావాలో అడుగుతున్నాడు. అంతా చుట్టు ప్రక్కల వాళ్ళే ! మర్యాద పూర్వకంగా అందర్నీ పలకరించింది సుహా చిరునవ్వుతో.

"అమ్మాయి ఇష్టపడి తెచ్చిందీ చీర !" ముత్తైదువకు పెట్టడం కోసం తెచ్చిన చీరా తాంబూలం బ్రాహ్మలకిస్తూ చెబుతున్న మామగార్ని ఆశ్చరంగా చూసిందోసారి. తనెప్పుడు తెచ్చిందీ !

"ఈ తద్దినం ఊళ్ళో పెడదాం, మీ నలుగురూ అక్కడికే రండన్నానమ్మా అట్లా వీల్లేదు ఇక్కడి మీ పరిచయస్తుల నందరినీ పిలుద్దామని అమ్మాయి పట్టుపట్టింది. సరే దాని మాటెందుకు కాదనాలని ఊరుకున్నా." అంటున్నాడు కాంతారావు. సుహా గదిలోకి వెళ్ళి చీర మార్చుకుని వచ్చింది.

"పల్లెటూళ్ళో ఒక్కళ్లేం వుంటారు ! హాయిగా ఇక్కడే

## సెప్టెంబరు నెల పురస్కారాలు





| గుండె | అస్తమించని సూర్యుడు |
|---|---|
| కథకు.......రూ.700/- | కవితకు.......రూ.500/- |
| రచయిత : బి.వి.ఎస్. ప్రసాద్ | రచయిత : మేడవరం కాంతికుమార్ |

సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి. మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాదు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

\- ఎడిటర్

---

వుండిపోండి బాబాయిగారూ. మీరుండటం వల్ల ఎంత కలివిడితనం కన్పిస్తోందో. ఇంత మంది ఇలా కల్సి ఈ అపార్ట్‌మెంటులో ఎప్పుడూ భోజనాలు చెయ్యలేదు. అసలు మీ కోడలిగారితో మాట్లాడటం ఇదే మొదలు." అంటూ నవ్విందో ఇంటావిడ.

"లేదు లేమ్మా... ఇంటి వద్ద నాకూ వ్యవసాయం వుంది.. బంధువులూ.. ఊరి వాళ్ళు క్షణం తీరిక దొరకనివ్వరు. ఏంటంటే మా సుహా బలవంతం వల్ల ఆవిడ ఆబ్దికం ఇక్కడ పెట్టాం. ఆ పిల్ల నాకు కోడలు కాదు బిడ్డలాంటిది. నా కష్ట సుఖాలన్నీ నేను ఎక్కడున్నా విచారిస్తుంది. దాన్ని పొగడ కూడదు గానీ, సూర్యుణ్ణి దివిటీ పట్టుకు చూపడం లాంటిది అందుకే పొగడను. మా యింటి మహాలక్ష్మి" అంటూ మామగారు కళ్ళు తుడుచుకోవడం వంట గదిలోకి వెళ్తూ చూసింది సుహా.

మామగారు తనకు చురక అంటాలని అంటున్నారా? లేక నిజంగానే తను ఆయన దృష్టిలో మహాలక్ష్మేనా! అసలు తనెందుకు ఆయనను సహించలేక పోతోంది?

తన చిన్నప్పుడు ఇంట్లో తనూ, ఇద్దరక్కలూ, అన్నయ్య, బామ్మా తాతా, అమ్మా నాన్నా అప్పుడప్పుడు వచ్చేపోయే బంధువులతో ఇల్లెప్పుడు సందడిగా వుండేది. అయినా అమ్మా, బామ్మా ఎంతో సహనంగా కలివిడిగా వుండేవారు. ఒకళ్ళనొకళ్ళు విసుక్కోవడం గానీ, ఎదిరించి మాట్లాడ్డంగానీ ఎప్పుడూ లేదు. అలాంటి వాతావరణం నుంచి వచ్చిన తనెందుకు మామగార్ని సహించడం లేదూ ! ఆలోచిస్తున్న ఆమె మనసు దోషిలా అంతరాత్మ ముందు నిలబడింది.

సుహా ఆలోచనల్లో వుండగానే పిల్లలు వంటగదిలో ఒక ప్రక్కకు నాలుగు విస్తళ్ళు వేసారు. పాప గ్లాసులు పెట్టి నీళ్ళు పోస్తోంది. బాబు పచ్చడి గిన్నె కాబోలు తెచ్చి విస్తళ్ళ ముందు పెట్టి వడ్డించబోయాడు.

"అలా కాదు.. ఆగు ... కొద్ది కొద్దిగా వెయ్యాలంట తాతయ్య చెప్పలే!" అంటూ ఆ గిన్నె తను తీసుకుని చెంచాతో వేస్తోంది పాప. అక్కడున్న వాళ్ళంతా నవ్వుతున్నారు. సుహా గబగబా వచ్చి వడ్డన అందుకుంది.

వచ్చిన వాళ్ళంతా మిగిలిన కూరలూ, పచ్చళ్ళూ చిన్న గిన్నెల్లోకి సర్ది అంట్లన్నీ ఒక పక్కగా పెట్టారు.

"మీరు కూర్చోండమ్మా మేం వడ్డిస్తాంలే.. మీ కుటుంబం మొత్తం కూర్చోండి." అంటూ ఎదురు అపార్ట్‌మెంటావిడ చొరవగా సుహా చెయ్యి పట్టుకుని కూర్చోబెట్టింది విస్తరి ముందు.

"మనకు డబ్బుల్లేకా అవకాశాల్లేకా కాదు... ఆప్యాయతలు లేక ఎవరినీ పిల్చుకోక దాటించేస్తున్నాం కార్యాల్ని. కాంతారావు బాబాయి ధర్మమా అని ఇవ్వాళ సంతోషంగా వుంది ఇలా కల్సి తినడం." అందొక గృహిణి.

"వచ్చే ఆదివారం మా యింట్లో బారసాల వుంది. ఏదో ఫంక్షన్ హాల్లో చేద్దాంలే అనుకున్నాం మొదట. ఇక్కడ ఇలా చూసాక నా మనసు మారింది. మన బిల్డింగ్ పైన టెంట్ వేసి స్నేహితుల్తో, బంధువులతో సరదాగా ఫంక్షన్ చేసుకుందామనుకుంటున్నాము." అన్నాడొకాయన.

ఎవరి మనసుల్లోనూ ప్రేమా ఆప్యాయతలు నాశనమవలేదు. కాకపోతే వాటికి తగ్గ ప్రేరణ అనే నీరు లేక ఆ మొలకలు నాశనమవక వాడిపోయాయంతే ! అందరూ కల్సి కొన్ని కొన్ని కార్యక్రమాల ద్వారా కలుస్తూ వుంటే తిరిగి మనుషుల మధ్య మరియాదా గౌరవాలు పెంపొందుతాయంతే అనుకుంది సుహా అనబడే సుహాసిని. ఆమె వదనంలో హాసరేఖలు వెల్లివిరుస్తున్నాయి.

◆

## గురజాడ జాడ

- వల్లభాపురం జనార్దన
9440163687

కాలమును దాటేసి తెలిసిన
కనిన జ్ఞానము పంచిపెట్టగ
భవిత పండును పుట్టుతీపిని
రుచిని చూపితివీ

ప్రజల ఉద్యమ భాష నాదని
ప్రభుని కోసం విడువబోనని
పట్టుదలగా వ్యావహారిక
భాష వాడితివీ

భాషకేమో కొత్త సొగసులు
సాహితీనదికేమొ మెరుపులు
సంతరించుచు బాటవేసే
స్రష్టవయ్యితివీ

చిలుక పలుకు ప్రబంధసరిగమ
తొలకరించుటనాపివేసీ
పలుకు పలుకున భావములతో
వెన్న చిలికితివీ

సహజ సుందరి కొత్త సాహితీ
పలకరింపుల సొగసు చూపగ
కర్త కర్మ క్రియవు నీవై
సాగు చేసితివీ

వాడ జనములు వాడుపదములో
వాడివేడిని పిండుకొంటూ
అభ్యుదయ సాహిత్యమునకూ
అడుగు వేసితివీ

మట్టి మనిషిని కావ్యనేతగ
మలచి నిలిపిన క్రాంతదర్శీ
తెలుగు కవితకు కొత్త మకుటము
పెట్టి మురిసితివీ

పండితుల పొత్తిళ్ళపాపను
ప్రజల బిడ్డగ సాకి పెంచీ
తెలుగు తెగులుకు మందువాడిన
నీవె తెలివరివి



వందలేడుల నుండి ముడివడు
వందిమాగధ భాష గడబిడ
తెంచి భాషకు స్వేచ్ఛనిచ్చిన
నీవె తెంపరివి

మార్పు బాటకు కలము నడిపీ
మంచి ముత్తెపు సరములట్లూ
కవన సరముల గంపకెత్తిన
కవివి గురజాడా!

బతుకు నలిపిన వాస్తవాలకు
మొదటి కుర్చీవేసి మోసీ
భావి కవులకు బాలశిక్షను
రాసి చూపితివీ

రాజు బంగ్లాలందు తిరిగే
రాచఠీవుల మజాలెరిగీ
పూరి గుడిసెల మనిషి బతుకును
తెరిచి చూపితివీ.

---

## నీడల ప్రవాహం

వంగర పరమేశ్వరరావు
9440520586

తెరచాప
పైకెత్తిన నావ
ఏక్షణంలోనైనా
ఎప్పుడో ఒకప్పుడు
ఎక్కడో ఓ చోట
తలపుల తలను
వాల్చాల్సిందే !
రెండు
సంధ్యల నడుమ
రాలిన
చెమట చుక్కలు
ఆకలి అంకంలో
రూకలుగా మారి
సరుకుల సంచిలో
బంధించబడుతాయ్ !
పొదుచుకొచ్చిన
పొద్దు
కాలాన్ని కొలుస్తూ
పడమటింటిలో
సేదతీరుతుంటుంది !
ఆత్మీయ మమతల్ని
అల్లుకున్న
పొదరిల్లు
పక్షులు విడిచిపోయిన
గూడులా బోరుమంటూ
భీతితో
బిక్కచచ్చిపోతుంది !
అంతరంగ అనుభవాలు
దృశ్య మాలికలై
మది కంఠసీమను
అలంకరిస్తాయ్ !
అగాథాల లోతుల్ని
చవి చూపిన మనసు
శిఖరాగ్ర చిరునామాని
ఆశల అద్దంలో చూస్తూ
మురిసిపోతుంది !



బుడి బుడి నడకలతో
తావై సాగిన పయనం
చేతి కర్ర ఊతంతో
జ్ఞాపకాల రాశుల్ని
కొలుచుకుంటుంది !
రెక్కలు విప్పార్చుకున్న
రాగ బంధాలు
సుదూర తీరాల
చుక్కల వేట గమనంలో
నిమ్నగ్న మైలురాళ్ళను
నాటుకుంటూ
పరుగెడుతుంటాయ్ !
నీ కంట్లో కన్నై
నీ యింటి గడపపై
దీపం పెట్టిన చేతులు
ఎద పరుచుకుని
అనురాగ గుమ్మానికి
వేలాడుతుంటాయ్ !
సమీకరణాలు
విచ్ఛిన్న సూత్రంతో
చేతులు కలిపి
సాగనంపుతూ
మరో క్రీడకై
ముహూర్తాన్ని
లిఖిస్తుంటాయ్ !
దారం తెగిన
శరీర గాలిపటం
బంధ విముక్తంతో
బరువుల్ని
దించేసుకుంటుంది !
నీ ఆశయాలకు
అన్నుదన్నై నిలిచిన
స్నేహకరచాలనాలు
సెండాఫ్ సెల్యూట్‌తో
గౌరవ వందన గార్డెన్‌లో
నీ నామకరణ
శిలాఫలకంపై
ఆత్మీయాక్షరాలు
చెక్కుతుంటాయ్ !
సకల సంఘటనలకు
సాక్షీభూతమై నిలిచిన
కాలవాహిని
నిరంతర ప్రవాహాన్ని
కొనసాగిస్తూనే ఉంటుంది !



# బహుభాషా వేత్త గ్రియర్ సన్

డా. బి.వి. రమణ

మన వేమన గొప్పతనాన్ని గుర్తించిన పాశ్చాత్య పండితుల్లో జార్జ్ అబ్రహం గ్రియర్‌సన్ ఒకడు. ఆయన 1851 ఫిబ్రవరి 7న ఐర్లాండులో జన్మించాడు. సెయింట్ బి.కె స్కూల్ లోనూ బి.ఎ. ట్రినిటీ కాలేజీలోనూ చదివాడు. రాబర్టు ఎట్‌కిన్సన్ దగ్గర సంస్కృతం మీర్ జౌలద్ ఆలీ దగ్గర హిందుస్థానీ భాష నేర్చుకొన్నాడు. గ్రియర్‌సన్ 1871లో ఇండియన్ సివిల్ సర్వీసు పరీక్షల్లో ఉత్తీర్ణుడై భారతదేశం వచ్చాడు. బెంగాల్ వచ్చిన తరువాత ఆయనకు భారతదేశంలో బెంగాలీ, హిందీ భాషలే కాకుండా ఇంకా చాలా భాషలు వున్నాయని అర్థమయ్యింది. అప్పట్లో బెంగాల్‌లో క్షామం వచ్చింది. ఇక్కడి భాషలు రాకపోతే ఈ ప్రజల కష్ట సుఖాలు తెలుసుకోవడం కష్టం అని భావించాడు. ఏషియేటిక్ సొసైటీలో సభ్యుడిగా చేరాడు. తన రచనలు ప్రారంభించాడు. 1877లో దరభంగా జిల్లాకు వచ్చాడు. అక్కడ వున్న మూడేళ్లలో మైథిలీ భాషకు వ్యాకరణం వ్రాసాడు. 1885లో స్వదేశానికి వెళ్లి పెళ్ళి చేసుకొని తిరిగివచ్చాడు. బీహార్‌లో స్కూల్ ఇన్స్పెక్టరుగా పనిచేస్తూ ఏడు మాండలికాలకు వ్యాకరణం వ్రాసాడు. హిందీ సాహిత్య చరిత్రను అనేక మంది పండితులు వ్రాసారు. వీళ్ళలో ఆచార్య రామచంద్ర శుక్లా వ్రాసిన హిందీ సాహిత్యకా ఇతిహాస్ ప్రసిద్ధి చెందింది. ఆయన హిందీ విమర్శకులలో అగ్రగణ్యుడు. ఇంతటి మహాపండితుడికి సాహిత్య చరిత్ర రచనలో గ్రియర్‌సన్ మార్గదర్శకుడిగా నిలిచాడు. గ్రియర్‌సన్ 1889లో వ్రాసిన ది మాడర్న్ వెర్నాకులర్ లిటరేచర్ ఆఫ్ హిందుస్థాన్ రామచంద్రశుక్లా మార్గాన్ని సుగమం చేసింది. ఈ గ్రంథంలో గ్రియర్‌సన్ 952 మంది హిందీకవుల గురించి వ్రాసాడు. మొదటిసారిగా సాహిత్య చరిత్రను యుగాలుగా విభజించాడు.

హిందీ మహాకవి జాయసీ రచించిన పద్మావత్ వ్రాతప్రతిని పరిష్కరించి ఈ మహాకావ్యాన్ని సహృదయులకు అందించిన ఘనత గ్రియర్‌సన్‌కే దక్కుతుంది. గ్రియర్‌సన్ జాయసీ జీవితాన్ని పద్మావత్ మహాకావ్య వైభవాన్ని మొదటిసారిగా చాటిచెప్పాడు.

గ్రియర్‌సన్ అభినవ జయదేవుడుగా ప్రసిద్ధి చెందిన విద్యాపతి మిథిల ప్రాంతానికి మాత్రమే పరిమితమైన వాడుకాదనీ, బెంగాల్ హిందీ భాషా ప్రాంతాల ప్రజల అభిమాన కవి అనీ స్పష్టం చేసాడు.

విద్యాపతి పదాల గురించి గ్రియర్‌సన్ ఇలా వ్రాసాడు.

It now remains to consider the matter of vidyapati's poem. They are nearly all vaishnva hymns or Bhajans and as such belong to a class well known to students of modern Indian literature. They can not be judged by European rules. of taste, and must not be condemned too hastily as using the language of the brothel to describe the soul's yearnings after God. Now that the Aphorisms of sandilya have been given in an english dress by Mr. gowell, no one pleads ignorance of the mystries of the Indian doctrine of faith "God is love" is alike the motto of the Eastern and of the Western worlds, while the form of love proposed is essentially different. The people of a colder Wstern clime, have contented themselves with comparing the inaffable love of God to that of a father to his children, for the warmer climes of the tropics have led the seekers after truth to compare the love of worshipper for worshipped to that of the supreme Mistress Radha for

## బకరాలు

జి. నరసింహమూర్తి
8977987266

సమాజం అనాదిగా
ఆలోచన కోల్పోయింది
దాస్యభావనలో భజన చేస్తుంది
మానవ వికాసానికి గోరి కడుతుంది
చాంధసత్వకుళ్ళు కాసారంలో ముంచేస్తుంది
కులమతవర్గ రాజకీయ అగాధాల్లోకి
తోసేస్తుంది
గోమేధ అశ్వమేధ అజమేధ నరమేధ
ప్రాచీన అమానవీయ ఆచారాలు
కొత్తరంగుల్లో వచ్చిన
స్వార్థపర ప్రార్థనా కూటాలు
వీధి వీధినా బాబాల మహామాయలు
ముదిరిన పిచ్చి పాండిత్యాలకు
విచ్చలవిడి వికార వికృత యాగాలు
నమ్మించి దోచుకునే ఇంద్ర జాలాలు
రాతియుగం నుంచి సైన్సు యుగం వరకూ
సాగుతున్న అందమైన అహేతుకాలు
సంస్కృతీ సాంప్రదాయ ముసుగులో
ఖూనీలు
పేదరికాన్ని పెంచి ప్రజాధనాన్ని
మెక్కుతున్న
ఘరానా దోపిడీ రాజకీయ క్రతువులు
డిగ్రీలు నెత్తిన మోస్తూ రీజనింగ్
కోల్పోయిన మహావిద్యావంతులు
ఇంకా ఎంతకాలం గుడ్డిగా అవుతారు
సైన్సు యుగంలో ఈ మనుషులు
అశాస్త్రీయతకూ, అహేతుకాలకూ
బ...క...రా...లు ?

---

her supreme, Lord Krishna. It is true that it is hard for a western mind to grasp to idea, but let us not, therefore, hastily condemn it the glowing stanzas of Vidyapati are read by the devout hindu with as little of the baser part of human sensuous ness as the song of soloman sung by the christian priest. ప్రసిద్ధ హిందీకవి బీహారీ గొప్పతనం గురించి గ్రియర్ సన్ ఇలా వివరించాడు.

"Surdas had many successors the most famous of whom was biharilal of jaipur whose satsaiya is one of the daintiest pieces of art to any Indian language".



బ్రౌన్ వేమనను అభిమానించినట్టు గ్రియర్ సన్ హిందీ కవి తులసీ దాసును అభిమానించాడు. తులసీదాసు గురించి ఆయన ఆన్ తులసీదాస్ అనే వ్యాసం వ్రాసాడు. యూరోప్‌లో తులసీదాసుకు ప్రాచుర్యం రావడానికి గ్రియర్ సన్ చేసిన కృషి ప్రసంశనీయం. 1921 వరకూ తులసీదాసు గురించి గ్రియర్‌సన్ వ్రాసిన వ్యాసాలు రాయల్ ఏషియాటిక్ సొసైటీ జర్నల్‌లో ప్రచురించబడ్డాయి. గ్రియర్‌నన్ ఇంగ్లండులో బైబిల్ చదివేవారికన్నా ఉత్తర భారతదేశంలో రామచరిత మానస్ (తులసీరామాయణం) చదివేవారి సంఖ్య ఎక్కువ అని ప్రకటించాడు.

"I give much less than the usual estimate when I say that fully ninety millions of people base their theories of moral and religious conduct upon his (Tulsidas) writings. If we take the influence exercied by him at the present time as our rest, he is one of three or four writers of Asia ............. Over the whole Gangetic Valley his great work (The Ramayana) is better known than the bible is in England. గ్రియర్‌సన్ కాశ్మీరీ రామాయణం మీద పరిశోధనచేసాడు. పది సంవత్సరాలు కృషి చేసి 1924లో కాశ్మీరీ భాషకు నిఘంటువు తయారు చేసాడు. ఇది నాలుగు భాగాలుగా ప్రచురించబడింది.

గ్రియర్‌సన్ సంస్కృత భాషలో కూడా నిష్ణాతుడే. ఆయన వ్రాసిన ఫర్‌దర్ నోట్స్ ఆన్ కాళిదాస్ 1878లో ఏషియేటిక్ సొసైటీ జర్నల్‌లో ప్రచురించబడింది.

"లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా" గ్రియర్‌సన్ భారతీయులకు అందించిన అమూల్య కానుక ఆయన 33 సంవత్సరాలు అపూర్వమైన కృషి చేసి అనేకమంది పండితుల్ని సంప్రదించి భారతీయ భాషల్ని పరిశీలించాడు. పదవీ విరమణ చేసి స్వదేశానికి వెళ్ళిన తరువాత కూడా తన పరిశోధన కొనసాగించాడు. గ్రియర్‌సన్ భాషా శాస్త్రం గురించి చేసిన కృషి సునీత్‌కుమార్ ఛటర్జీ వంటి వారికి మార్గదర్శకమయ్యింది. లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా 11 సంపుటాలుగా వచ్చింది. వీటిలో భారతీయ భాషలు, ఉపభాషలు, మాండలికాలు, వాటి వ్యాకరణ విశేషాలు వున్నాయి. 1894లో ప్రారంభించిన ఈ పరిశోధన 1927లో పూర్తి అయ్యింది.

గ్రియర్‌సన్ వ్రాసిన ఇతర రచనలలో బీహార్ పీజెంట్స్ లైఫ్ చెప్పతగింది. ఇది బీహార్ ప్రజల జీవితానికి దర్పణం వంటిది. ఈ పుస్తకాన్ని 1885లో కలకత్తాలోని బెంగాల్ సెక్రటేరియెట్ ప్రెస్ వారు ప్రచురించారు.

అనేక భారతీయ భాషలకు అపూర్వమైన సేవ చేసిన ఈ బహుభాషావేత్త 90 సంవత్సరాలు జీవించి 1941 మార్చి 8న కీర్తిశేషుడయ్యాడు.

◆

కథ



# లిక్కరు మంటలు..


చక్రపాణి నోముల

9052011145


హైదరాబాదు మహానగరపు శివారులో మురికి కుంటలా మారిన ఒకనాటి మంచి నీటి చెరువు.. గట్టున వరసలు తీరిన రావి మర్రి మహా వృక్షాల పంచన పుట్టగొడుగుల్లా ప్లాస్టిక్ చిరుగులతో వేసుకున్న గుడిసెలు.

పడావు పడుతున్న పల్లె జీవనంలో పొట్ట గడవక, పట్నం బాట పట్టిన బక్క రైతులూ, పల్లెకూలీలు, బొమ్మరిళ్ళ లాంటి ఈ గుడిసెల్లో నివాసం ఉంటారు.

సంపన్నులను, కుబేరులను చేస్తున్న దేశ ప్రగతికి, రాళ్ళెత్తే కూలన్నల ఈ వలస వాడలూ, మురికివాడలూ, సమాజ వర్గ విభజనలో శేషంలా, ఈ దోపిడీ వ్యవస్థ విసర్జించిన వ్యర్థ పదార్థంలా, మున్సిపాలిటీ వారు పారేసిన చెత్త కుప్పల్లా ఉంటాయి.

ఉదయం ఆరు గంటల నుండి మొదలవుద్ది ఆ గుడిసెల నుంచి చీమల బారులా, పిల్లా పాపాలతో భార్యా భర్తలతో, జట్లు కట్టి, జతలుకట్టి కూలీల అడ్డాలకీ, జనారణ్యంలోకి, బ్రతుకు దెరువుకు వెళ్ళే జనాల ప్రస్థానం.

సాయంత్రం దాకా శ్రమించి నిష్క్రమించేప్పుడు మొదలవుద్ది మరో ప్రస్థానం.

"ఇయాలన్న సక్కగా ఇంటికి పోదాం, రోజంతా రెక్కలు ముక్కలు చేసుకుంటే వచ్చిన కూలి పైసలు గద్దలాగా తన్నుకపోయి మా కడుపులు మాడుస్తున్నవు, కుతి కెల దాకా తాగుతున్నవు, నామాట ఇను, తాగుడు వద్దు పోదాం పా" బ్రతిమలాడుతోంది రాములమ్మ.

"ఏందే... యేమో శాన నఖరాలు చేస్తున్నవూ, ధరలు పెరిగి, తినడానికి సరిపోతలేదు దానికి నన్నేం చెయ్యమంటవు. నా తాగుడు జోలి కొచ్చినవో బజార్ల తన్నులు తింటావు ... చల్ పో" ఒక్క తోపు తోసి వెళ్ళిపోయాడు.

"నీ తాగుడు తగలబడ మా ఉసురు పోసుకుంటున్నావు .... ఈ పైసలతో యెవరి కడుపులకు పెట్టాలే." శాపనార్థాలు పెడుతూ గుడిసెల వైపువెళుతోంది.

సర్కస్ ప్రదర్శనలిచ్చి జీవనం గడుపుతున్న మరో కుటుంబం గుడిసెల దారిలో జీవనమధనం "అమ్మా ఇయాల శాన డబ్బులే వచ్చినయి కదా, కొత్త గౌను కొనియ్యవా." తల్లిని అడుగుతోంది ముంతాజ్.

నోరు మెదపకుండా నడుస్తోంది ఫకీరా

"అమ్మా, పోయినవారం అన్నవు కొంటానని" మారాం చేస్తోంది ముంతాజ్.

'ఇంటికొచ్చే దారిలోనే మీ అయ్య తన తాగుడుకు సరిపడా తీసుకుని తమకు దేనికీ సరిపోని నాలుగు డబ్బులు విదిలించి దారి తప్పిపోయాడనీ యెట్లా అర్థం చేయించాలో ఆలోచిస్తోంది తల్లి ఫకీరా.'

"ముంతాజ్.. అబ్బాజాన్, నీ కండ్ల ముందే డబ్బులు తీసుకోని పోయిండా, అమ్మ దగ్గరా కొన్ని డబ్బులే ఉన్నాయి, తరువాత కొనిస్తది లేవే" సముదాయిస్తున్నాడు పన్నెండేళ్ల అన్న అహ్మద్.

"అబ్బాజాన్ రోజూ తాగటానికి పోతడు ఇంక నువెప్పుడూ

కొనియ్యవు, నాకు తెలుసు" ఏడుస్తోంది ముంతాజ్.

ఈ రోజు నాలుగు చోట్ల సర్కస్ ఆడాల్సి వచ్చింది, అలసిపోయి పడుకున్న పిల్లల్ని నిమురుతోంది ఫకీరా. పిల్లలు తిన్నాకా మిగిలిన నాలుగు మెతుకులతో కడుపులోకి పోసుకున్న చెంబెడు నీళ్ళు ఆవిరై, కాలుతున్న కడుపు ఆకలికి కేకలువేస్తుంటే కళ్ళు మూసుకుని విశ్వ చింతన చేస్తోంది ఫకీరా.

ఈ భూమ్మీద తాగుడు లేకుంటే ఎంత బాగుండు. రోజురోజుకు తాగుడుకు ఆగమైపోతున్న సంసారాలు ఎక్కువైతున్నై. లిక్కరు షాపుల సుట్టు పక్కలా, నడి బజార్ల, ..తమ గుడిసెలకొచ్చే దారి పొడుగునా చెట్టనక పుట్టనక, యెంత మంది కూలీనాలీ చేసుకునే జనాలు తాగి పీనుగ లోలే పడి ఉంటారో ..

తన చిన్నప్పుడు, ఊరికి ఒకటి రెండు సారా దుకాణాలు ఉండేవి ... గుడుంబా గుట్టుగా అమ్మేటోళ్ళు .. ఇప్పుడేమో జాతరల ఆంగళ్ళ లాగా, సర్కారు లిక్కరు అమ్ముకుంట తాగుబోతుల రాజ్యాన్ని చేస్తున్నారు.

"అమ్మో కొట్టకు ..అయ్యో నేను సచ్చిన.." సత్తెమ్మ గావుకేకలు గుడిసెలను కమ్ముకుంటున్నాయి..

"దొంగముండ యెక్కడ దాసిన వో చెప్పు.. మొగోన్ని నాకే యెదురుసెప్తావే, నీ తల్లి .. కుతికె పిసికి సంపుత" మొగుడు.

"అయ్యో.. రాములన్నా.. ఓ హనుమంతన్నా వీడు నన్ను సంపుతాండూ ఓ సీతక్కా నన్ను కాపాడండి" సత్తెమ్మ ఆర్తానాదాలు.

"మన రాముడూ తాగబోతయిండూ, హనుమంతూ తాగుబోతయిండే, మంచోళ్ళకు గుడ తాగుడు గత్తర తగిలిందే,

ఇంకెవరన్న తాగనోళ్ళున్నా, ఈ లుచ్ఛాముండా కొడుకుల జోలికి రారు, ఆ తాగుబోతోని నోట్లే ఉంచి, వాడడిగింది మొఖానకొట్టు, లేకుంటే నిన్ను సంపుతడు బిడ్డా" సీతక్క లోకరీతి చెప్పింది.

"నా బిడ్డకు రోగమొచ్చింది, మందులకని దాసిన .. నీ పీనిగెళ్ల మా ఉసురు పోసుకుంటున్నావు ... అమ్మా నేనేంజేతు నా బిడ్డ ఆగమైతది ఓ అమ్మో" సత్తెమ్మ శోకాలు పెడుతోంది.

"అమ్మా నాకు భయమైతుందే" సత్తెమ్మ ఏడుపులకి ఉలిక్కిపడి ఏడుస్తోంది ముంతాజ్.

"కళ్ళు మూసుకొని పడుకో బిడ్డా" ఫకీరా జోకొడుతోంది.

"అమ్మా .. సమ్మెటతో ఆ తాగుబోతోనీ తల పగులకొట్టాస్త" అహ్మద్.

"ఎంతమందినని కొడ్తవు రా, మనసుట్టూ తాగేటోళ్ళే ఎక్కువున్నరు"

"మన అబ్బాజాన్ రోజూ తాగే వస్తున్నపుడు తాగొద్దని నువ్వు చెప్పినా ఇనటం లేదు."

"తాగేటోళ్ళూ మాటలకినరురా....

అగో సైకిలు సప్పుడు, మీ అబ్బా వస్తున్నడు నోరు మూసుకుని నిద్ర, పో అవాజ్ చెయ్యకు బిడ్డా .."

"ఇంకా నిద్రపో లేదా."

ఫకీర్ దీపం బత్తి ఎక్కించింది. "అయ్యో అదేంది నీ చొక్కా అట్లా చినిగింది, ఇంత రాత్రి దాక తాగుకుంట, కొట్లాటలు చేసినవా"

"తాగలేదు.. నాకేమీ కాలే, గాంధీ సెంటరు లిక్కరు షాపుకు మందుకని పోయి., రౌడీ గాళ్ళు బాగా తాగి సేటును కొట్టబోయిన్రు. నాకు కోపమొచ్చి వాళ్ళను లేపి అవతల పడేసిన.. ఆ తోపులాటల చినిగింది, సేటు నన్ను మెచ్చుకోని షాపుమూసేదాక ఉండమన్నడు"

"సరే ... రోటీ తిను.."

సేటు తినపెట్టిండు యెంత మర్యాద చేసిండనుకున్నావు".

"సేటు మర్యాదంటే కటికోడు మేకపిల్లకు మర్యాద చేసినట్లే, ఏదో మతలాబు ఉంటది జాగర్త"

"సేటు అసువొంటోడు కాడు, ఫకీరా .. మనం రోజు బిచ్చపోల్లలాగ సర్కసులు చేసుకొంట, మంది దయా దాచ్చిన్నాల పైన బ్రతికిన కాడికి చాలు, సర్కసు బందు చేద్దాం, జీతానికి రమ్మంటాడు, నిలబడి మీసాలు తిప్పుకుంట ఉంటే చాలట, అడ్మాసు గుడ ఇచ్చిండు."



"మంది బతుకుల నాశనం పట్టించే తాగుడు షాపుల మీసాలు తిప్పుకుంటూ నిలబడే పని కంటే సర్కసులో చెమటోడుచుకుంట మనపిల్లలు కొడుతున్న పల్టీలు, కట్టెసాములు, కత్తిసాములు, నా గుండెల మీద బండరాయిని సుత్తెతో ముక్కలు చేయించుకునే మన విద్య, మర్యాదగుంటది, మెచ్చుకోని దబ్బులేస్తరు, అది బిచ్చమా, అట్లైతే సిన్మా ఆటకు ఇచ్చిన దబ్బులు కూడా బిచ్చమే అయితది. మనది తాతల నించి వస్తున్న వీర విద్య "ఫకీరా తాతల నాడు టీవీలు లేకుండే, పిల్లలు బయట ఆడుకునేటోళ్ళు, పెద్దోళ్ల ఇంటి అరుగులపై కూచోని, వచ్చే పోయేటోల్లను అరుసుకునేటోళ్ళూ, ఆదరించేటోళ్ళు. ఇప్పుడు తలుపులు మూసుకుని టీవీ గోలల ఆగమైనరు, నీ వీరవిద్యలు, బైరూపులు, సాధనాసూరులు, వీధి బాగోతులను ఎవడు కానిండు, ఆ విద్యలు, ఇకుమతులూ అంతరించి వాటి మీద బతికిన ఆ మనుషులు, కాట గలిసి పోయినరు, మనల ఆదరించేటోళ్ళు లేకుండ పోతున్నారు. "నా కెదురుచెపితే సర్కసు సామాన్లు తగలపెట్టా" బెదిరించాడు, "ఇగో అడ్మాసు పైసలు, ఇంట్ల ఖర్చులకు, రేపటినించే నేను గాంధీ సెంటరు లిక్కరు షాపుల పనికిపోత, ఇగ నిద్రపో." దీపం ఆర్పేసి, చీపులిక్కరు సీసా మూతతీసి తాగుతూ కూర్చొన్నాడు.

'భూమ్మీద తాగుడు లేకుంటే ఎంత బాగుండు ... తమ బ్రతుకులకు యేదో కీడు పొంచి ఉన్నట్లు అనిపించి నిశ్శబ్దంగా కళ్ళు మూసుకుంది ఫకీరా.' దుఃఖిస్తున్న తల్లి కన్నీటిని తుడిచాడు అహ్మద్ ... కర్రసాములు కత్తిసాముచేస్తూ, నోట్లో కిరసనాయిలు పోసుకుని మంటలూదే సాహసాలతో ఉరకలు వేసే సర్కస్ మనసుతో ఆలోచిస్తున్నాడు 'అబ్బాజాన్ తాగకుండ ఏదోచేయాలని'.

ఫకీరా పిల్లలతో సహ చెత్త గోదాములో సీసాలను పేపర్లను

వేరుచేసే పనికి కూలీకి కుదిరింది.

'నెల రోజులకే మనిషీ సగమయిండు. ఉత్త చేతులతో ఊగుకుంటూ వచ్చే స్థితికి వచ్చిండు .. 'రోజుకు మూడుసార్లు మందుపడితే గాని నిలబడ గలుగుతున్నాడట.' "నీ పనికి జోషు కావాలే" అనుకుంట సేటే మందు పోస్తాడట. జీతంల మందు పైసలు పట్టుకుంటాడట'

"ఇగో అహ్మద్ కె అబ్బా, ఒకసారి నా మాట ఇంటవా, ఆ సేటు పోసే మందుల ఏదో తేడా వున్నది, పచ్చి గుడుంబా తాగినా ఇట్ల కారు చూసుకున్న వా ఎట్లయినవో, కండలు తిరిగిన మనిషివి పీనిగోలే గుంజుకపోతున్నావు, చీటికిమాటికి కొట్టకొట్ట వస్తున్నవు, తాగుడు నీ మంచితనాన్ని గుడ మంటకల్పింది .. నీకేమన్నా అయితే మేము అన్నాయమైతము.. బతుకలేము.. ఇంట్ల ఉండు మళ్ళా నిన్ను మునుపటోలే తయారు చేసుకుంటం.. మన అహ్మద్ సర్కసు నడిపిస్తడు .. దర్జాగా తలెత్తుకోని బతుకుదాము. మాట ఇను మమ్ముల ఆగం సెయ్యకు ఆ లిక్కరు షాపుల పనికి పోకు, "ఫకీర ఏడుస్తూ బతిమలాడుతోంది.

"అబ్బాజాన్ నిన్ను చూస్తుంటే ఏడుపోస్తున్నది. ఆ లిక్కరు షాపుకు పోకు "తండ్రిని వేడుకుంటూ పిల్లలు కన్నీరు పెట్టారు.



'వారి దుఃఖానికి అడ్డు కట్టలు వేసినా ఆగని రోజు రానే వచ్చింది'

శవానికి పోస్టుమార్టం చేసి తెల్లబట్టలో కట్టకట్టి ఇచ్చారు.

'కల్తీ లిక్కరు వికటించి చచ్చిపోయాడని పేపర్లలో టీవీల్లో వార్తలు, ప్రజాసంఘాల ఆందోళనలు. 'కాదు చీపు లిక్కరు తప్పేమీ లేదు, నిషా ఆనక యేవో ట్యాబ్లెట్లు కలుపుకొని, కిక్కుకోసం తాగటం వలన చచ్చాడని' తేల్చేసి దులిపేసుకున్నారు.

సర్కారు ఆబ్కారీ చట్టాలకి మరికొన్ని హంగులను తాఖీదు చేసి, మద్యం యేరులై పారటానికి పకడ్బందీ జీవోలను జారీ చేసుకున్నది.

ప్రజాందోళనలు వార్తలు సద్దుమణిగాయి. కల్తీ చావు పాతదై మరుగునపడిపోయింది.

జమ్మి చెట్టుపైని అస్త్రాల దుమ్ము దులుపుతున్నట్టు జీవన మహా సంగ్రామానికి తమ సర్కస్ సామాగ్రిని సిద్ధం చేసుకుంటున్నాడు అహ్మద్.

సర్కస్ షోలో తండ్రి వాయించే ఢోలక్ యొక్క బిగువ దిగిన తాళ్ళను లాగి శ్రుతి చేసి, గుండె నిండిన దుఃఖంతో నరాలు పొంగుతుంటే, మెలి తిరుగుతున్న వేళ్ళతో ఢోలక్‌పై మోదుతూ, నగారా దరువులు మ్రోగిస్తున్నాడు అహ్మద్ ... 'ధాకే నాకే ధీనా ధీనా .. ధాకే నాకే ధీనా ధీనా ... ధినక్ ధినక్ ధిన. ధీనా ధినా ధినా ధీన ... ధాకే నాకే ధీనా ధినా' ఆ చప్పుళ్ళకు పోయిన మనిషిని తలుచుకుంటూ శోకాలు పడుతున్నారు తల్లీ ... బిడ్డ.'

"అయ్యో ఊరుకోండి, యేడిస్తే పోయినోడు వస్తాడే" అంటూ ఇరుగు పొరుగు వచ్చారు.

"కండలు తిరిగి మారాజు లాంగుండే టోడు, మాయదారి మందు పాడుగాను, తాగి తాగి యెంతెళ్ళం పీనిగైపోయిండో.."

"మారాజైన, మంత్రులైన, మాయదారి మందు తాగితే, మన తాగుబోతులకంటే "మారాజులూ మంత్రులూ పీనిగలెందుకైతరు., అది కారంవాళ్ళదేనా, లిక్కరు షాపులు వాళ్ళోళ్ళయేనాయే, ఇష్టరాజ్యంగ దోచుకుంట, నిగ నిగలాడుతరు."

"అధికారం గరిబోళ్ళ చేతులకు వచ్చేదాక ఇంతేలే పేదల బతుకులు."

అర్ధరాత్రి పీడకలలో కలవరింతలూ కీచురాళ్ళు ఘోషె పెడుతున్నాయి, ఆదమరచి నిద్రస్తున్న గుడిసెల్లో కలకలం...

"అయ్యో అయ్యో .. నిప్పంటిచ్చుకున్నారు.. తగలపడుతున్నారు.

'అయ్యో మన సత్తెమ్మ .. గ్యాసు నూనెపోసుకొని కాలిపోతున్నది.. అయ్యో బిడ్డా.."

"జల్దిన నీళ్ళందుకోండి చద్దర్లు తేండి ... "మంటలార్పండి ... ఆర్పండి ఆర్పండి ...

జనాల రణగొణలు నిట్టూర్పుల స్థాయికి సన్నగిల్లాయి.

విలవిల లాడిన సత్తెమ్మ హహాకారాలు నిశ్చేష్టలయ్యాయి.

యజ్ఞగుండంలో కమిరిపోయిన బలిపశువులా, మసిబారిన వెలి చూపులతో, మూలుగుతూ, పలవరిస్తోంది ... సత్తెమ్మ "ఓ అమ్మా .. ఓ అయ్యా ... నేనెంత పనిజేసుకుంటి ... తాగొద్దని ఎంత చెప్పినా ఇనలే బిడ్డ సచ్చినా బుద్ధి రాకపాయే కాల్చుకున్న. ఇప్పుడనిపిస్తున్నది .. తప్పు చేసిన ముందు తాగుడును తగులబెట్టి తరువాత నేను కాలిపోయినా బాగుండు.

అయ్యో అయ్యో దండుగ సావు చస్తున్న, అమ్మా.. అయ్యా.."

ఆటోలో సత్తెమ్మను సర్కారి దవాఖానకు తరలించారు.

తాగెటోళ్ళకు బుద్ధి రావాలని నిన్ను బలిచేసుకున్నావు బిడ్డా ..."

"అయ్యో సత్తెమ్మా యెంత పని జేస్తివే" మనపానాలు యెవరికి లెక్క నకిలీ ఇత్తనాలతో పంట పోయి మా అయ్య పురుగుల మందు తాగి సచ్చిండు .. లీడర్లు ఇస్పీచులు ఇచ్చినరు,... దొంగల కొడుకులు కల్తీ ఇత్తనాలు అమ్ముతనే ఉన్నరు, ఏ యేటి కాయేడు, దండగ సావులు చస్తనే ఉన్నరు. దొంగ ఇస్పీచులు ఇస్తనే ఉన్నరు"

"పానాలు తీసుకుంటే ఎవరికీ బుద్ధిరాదు, సర్కారు కళ్ళు తెరవదు, కనికరం లేని సర్కారు."

కనికరమా, న్యాయం కోసం పోరాటం చేసేటోళ్ళ మీదకే ఫౌజులు పంపి, జైళ్ళెపెడుతున్నారు....

"అమ్మా సత్తెమ్మ కండ్లల్ల తిరుగుతున్నది" అహ్మద్.

"అపుడే వారం గడిసిపోయే "ఫకీరా.

"ఆ రోజు చాలా మంది దగ్గర గ్యాసు, నూనే అడిగి తీసుకపోయిందట."

"అవును నన్ను కూడా అడిగి తీసుక పోయింది రా"

"అమ్మా సత్తెమ్మ కాల్చుకొని చావటం తప్పు కదా"

"మొగుడు తాగొచ్చి రోజు కాల్చుక తినెటోడు రా.. ఏగలేక మొత్తానికే కాల్చుకున్నది.. ఏమోరా.. నాకైతే.. మనం కూడా ఇట్ల బతుకడం దండగనిపిస్తున్నదిరా"

"అమ్మా" అహ్మద్.

"ఎనకటినించే ఏదో మోసం జరుగుతున్నది బిడ్డా, తరాలు మారినా మన కష్టాలు మారలే,. దొరల జమానాల, బాంచననుకుంట భయంగ బతికినం, ఎలచ్చన్లు వచ్చినప్పుడల్లా కొత్తదొరలు ఓట్ల ఉచ్చులేసుకుంట మనమీద అధికారాన్ని యేటాడి పోతున్నరు,. దగాపడ్డ, దండగ బతుకులు బతుక్కుంట, ఆగమైతున్నం, దారిసూపెటోడూ లేక సత్తెమ్మ లాగ సచ్చేటోళ్లే ఎక్కువైతున్నరు" చీకటి పడితే సత్తెమ్మ మంటల్లో కాలుతున్నట్టే, అనిపిస్తది"

"అవునురా నాక్కూడ కళ్ళు మూసినా తెరిసినా కళ్ళల్ల గ్యాసునూనే మంటలే, బిడ్డా నామాట వింటవారా..."

"అబ్బాజాన్ కీ ఖసమ్, అమ్మా చెప్పుఏంచేయాల్నో" అహ్మద్.

"ఎంత బతికినా ఈ బేకార్ బతుకులు సాధించేది యేమీ లేదురా యేమున్నదిరా మనబతుకుల్ల, మనం కూడా సత్తెమ్మలాగా గ్యాసునూనె జమ చేసుకుందాం, మనకు పెద్దక్యానునిండ కావాలెబిడ్డా" ఫకీరా.

'అహ్మద్ కళ్ళలో గ్యాసు నూనే మంటలు వెలుగుతుంటే తల పంకించాడు'

ఆరోజు అక్టోబరు 2వ తారీఖు, మహాత్ముని జన్మదినం. వెలిసిపోయిన విగ్రహానికి కొత్త రంగులద్ది తమ గాంధీ ఇజానికి జెండాలు కట్టి, రోడ్డుకిరు వైపులా మంత్రిగారి ఫోటోల, స్వాగతం పలుకుతున్న బస్తీ లీడర్ల ఫొటోల ఫ్లెక్సీలను కట్టారు.

రెండురోజులుగా, బస్తీలలో బజార్లలో ...మైకుల్లో చాటింపులు వేసి, గాంధీ జయంతి నాడు మాంసం దుకాణాలు, లిక్కరు దుకాణాలు బందు చేయించి తమ గాంధీభక్తిని చాటుకున్నారు.

లిక్కరుషాపులో పగలనకా రాత్రనకా తాగి తందనాలాడే మందుబాబులతో కళకళలాడే గాంధీసెంటరు, మందులేక బోసిపోయింది.,

మంత్రిగారు దండలేసే కార్యక్రమానికి టీవీ వాళ్ళు వస్తున్నారు, తాగుబోతులెవరైనా వాళ్ళ కెమెరా కళ్ళకు చిక్కితే దేశమంతా ప్రచారం అవుద్ది, అందుకని దొంగచాటు మందు అమ్మకాలు లేకుండా ముందు బందోబస్తులు చేయించారు.

షట్టర్లు దించి తాళాలు బిగించిన గాంధీసెంటరు లిక్కరుషాపు ముందు సర్కస్ సరంజామాల మూటలు, పెట్టుకుని కూర్చొన్నారు, ఆ మూటల్లో, లుంగీ బట్టకింద దాగిన ప్లాస్టిక్ క్యాను, క్యాను నిండా, తహతహ లాడుతున్న గ్యాసునూనే, చెంతనే ఆత్మాహుతిదళంలా ... ఫకీరా, బిడ్డ ముంతాజ్, కొడుకు అహ్మద్ కూర్చొన్నారు. పోలీసాయన వచ్చి "ఇక్కడ యెందుకున్నరు ఛలో జావ్ జావ్ పొండి ... పొండి" అని గదమాయించాడు.

"అయ్యా మేము వాడ వాడలా సర్కస్ చేసుకుంటం ... మినిస్టరు సాబు వస్తున్నాడట, ఆయన గాంధీ బొమ్మకు దండలేసినాక చప్పట్లు కొట్టిపొమ్మన్నరు.." నచ్చచెప్పింది ఫకీరా.

"పొట్లాల ఆశపెట్టి, బకరా జనాలను, బాగానే జమ జేసుకున్నారు, లీడర్లు, మజాకానా... అగో వస్తున్నాడు..." పరిగెత్తాడు పోలీసు. తలపైన తాటిపండు పడ్డ నక్కల్లా కుయ్యో కుయ్యో అంటూ సైరన్ల కూతలతో నాయకుల చాంతాడంత కాన్వాయ్ వచ్చింది." పోలీసుల, కార్యకర్తల, టీవీ కెమెరాల సందడి, లౌడు స్పీకర్లలో భట్రాజుల జైజై ధ్వానాల మధ్య, మంత్రిగారు గాంధీ విగ్రహానికి దండలు వేయటానికి పక్కనే ఉన్న అల్యూమినియమ్ నిచ్చెన స్టాండుపైకి యెక్కి నిల్చుని అందరికి చేతులు జోడించి నమస్కారం చేశారు. చప్పట్లు మోగాయి... జనాల సమీకరణ బాగు బాగు అన్నట్లు తలఊపుతూ లీడర్లను మెచ్చుకున్నారు.

కార్యకర్తలందించిన దండను విగ్రహానికి వేశారు, ఈసారి మారు మోగుతాయనుకున్న చప్పట్లకు బదులు ప్రజల కలకలం వినిపించింది. "మంటలు.. మంటలు అంటూ కేకలు పరుగులు. "అయ్యో అక్కడ లిక్కరు షాపు దగ్గర మంటలు, పరుగెట్టండి" తోపులాటలు. గన్‌మెన్లు మంత్రిగారి చుట్టూ రక్షణ వలయంలా నిలుచున్నారు. పోలీసాఫీసరు వచ్చి "మీరు కారు దగ్గరికి పదండిసార్" అన్నాడు.

"ఏందయ్యా మీ బందోబస్తు ఏం చేస్తున్నారు మీరు.. ఇంతకు ఆ లిక్కరు షాపుముందు యెవరన్న కాలేజీ పిల్లలు మళ్ళా ఆత్మాహుతి చేసుకున్నరా" అలవాటుగా మంత్రిగారు ఆరాతీశారు.

"కాదు సార్... ఆ లిక్కరు షాపుని కాల పెడుతున్నరు"

టీవీ కెమెరాలు, విలేఖర్ల పరుగులు మంత్రిగారిని వదిలేసి లిక్కరు షాపుదగ్గరికి చేరుకున్నాయి...

చిటపట లాడుతున్న శవంలా లిక్కరు షాపు భగభగ మండుతుంటే, పలపల చిట్లుతున్న సీసాలానుండి ఒలుకుతున్న మద్యం, చితిమంటలకు ఆజ్యం పోస్తున్నట్లు, మంటలు ఎగిసి మండుతున్నాయి.

తగలబడుతున్న లిక్కరు షాపు ముందు.. బిగిసిన పిడికిలిలో వెలుగుతున్న దివిటీని, దిక్సూచిలా ఎత్తి పట్టుకున్నాడు, అహ్మద్.. కుడియెడమల దగాలతో, అణగారిన ఆర్తానాదాల, మానవ బాధల ఉగ్రజీవనానుభూతికి, విస్ఫోటాలైన, క్షోద్ర ఘోషలు ఫకీరా గళం నుండి క్షిపణుల్లా వస్తున్నాయి... "ఖబడ్దార్,,, ఖబడ్దార్.. లిక్కరుషాపుకు మేమే గ్యాసు నూనె పోసి మంట పెట్టినం, మా మీద కూడా గ్యాసు నూనే పోసుకున్నం. మంచిగా వినండి, ఖబడ్దార్, మా బతుకుల నాశనం చేసుకొంట, మమ్ముల బతికుండంగనే పీనుగల్ని చేస్తున్న, మా జీవితాల్ల నిప్పులు పోస్తున్న ఈ తాగుడు, కాలి బూడిదయ్యే దాక... ఆ మంటలని ఆర్పాలని గాని, వొచ్చినరా ఇగో ఈ దివిటీతో అంటిచుకొని మేము కాలిపోతం. జరగండి దూరం, జరగండి, లిక్కరు షాపు కాలి కూలిపోయే దాకా దూరముండండి". మేము సైతం అన్నట్లు మానవహారాలై బారికేడులై పొలికేకలై పోలీసులను అడ్డుకుంటున్నారు జనం. ఎగిసి మండుతున్న లిక్కరు మంటలు, ఫకీరా, ముంతాజ్, అహ్మద్‌ల ముఖాలపై ఎర్ర ఎర్రగా రెపరెపలాడుతున్నాయి...

♦

# పద్మారావు రచనలు జీవిత నిర్వచనాలు

డా. రాచపాలెం చంద్రశేఖరరెడ్డి

జీవిత వాస్తవాలను ఆవిష్కరించే కవిత్వం కన్నా జీవితాన్ని నిర్వచించే కవిత్వం ఉన్నత స్థాయికి చెందినదై ఉంటుంది. కవులు తాత్వికులైనప్పుడే ఇలాంటి కవిత్వం రాయగలరు. సామాజిక సిద్ధాంతాలతో, సామాజిక ఉద్యమాలతో ప్రగాఢ సంబంధం ఉన్న, జీవితం పట్ల చింతనా సంస్కారం ఉన్న కవులకే ఇది సాధ్యం. కత్తి పద్మారావుగారి కవిత్వంలో జీవిత తాత్వీకరణ లక్షణం మనకు అనేక కవితల్లో కనిపిస్తుంది. బౌద్ధాన్ని, అంబేద్కరిజాన్ని తాత్వీకరణ లక్షణం మనకు అనేక కవితల్లో కనిపిస్తుంది. బౌద్ధాన్ని అంబేద్కరిజాన్ని తాత్విక నేపథ్యంగా చేసుకున్న పద్మారావుగారు సామాజిక ధోరణులు, పరిణామాలను ఆవిష్కరిస్తూ వ్యాఖ్యానిస్తూ వాటి సారాంశంగా జీవితమంటే ఏమిటో క్లుప్తంగా నిర్వచిస్తారు.

పుట్టిన ప్రతి జీవికి ఒక జీవితమున్నట్లే ప్రతి మనిషికీ ఒక జీవితముంటుంది. మనిషి మనుగడ విధానమే జీవితం. విభజిత సమాజంలో అందరి జీవితాలు ఒక్క రకంగా ఉండవు. సామాజిక వైరుధ్యాలను బట్టి, అభిరుచిలను బట్టి జీవితం రూపొందుతుంది. వ్యక్తి జీవితాన్ని సామాజిక జీవితమే నిర్ణయిస్తుంది. మనుషులు తమ జీవితాలెలా ఉండాలో నిర్ణయించుకోవడంలో సామాజిక పరిస్థితులే ప్రేరణగా ఉంటాయి. సాహిత్యం జీవితాన్ని వర్ణిస్తుంది, ఆవిష్కరిస్తుంది, వ్యాఖ్యానిస్తుంది, నిర్వచిస్తుంది. రచయితల భావజాలన్నీ బట్టి, చైతన్యాన్ననుసరించి వాళ్ళ జీవితాన్ని దర్శించి వ్యాఖ్యానించి నిర్వచిస్తారు. సాధారణంగా కవిత్వంలో సామాజిక వాస్తవికతను చిత్రించేటప్పుడు ఆర్థిక, సాంఘిక రాజకీయాలను పేర్కొని భావుకతను జోడించి వ్యాఖ్యానిస్తారు కవులు. కొందరు ఆ పరిస్థితుల ఆవిష్కరణతో తృప్తిపడకుండా తాత్వీకరిస్తారు. జీవితాన్ని సూత్రీకరిస్తారు. జీవితాన్ని నిర్వచిస్తారు. జీవిత వాస్తవాలను ఆవిష్కరించే కవిత్వం కన్నా జీవితాన్ని నిర్వచించే కవిత్వం ఉన్నత స్థాయికి చెందినదై ఉంటుంది. కవులు తాత్వికులైనప్పుడే ఇలాంటి కవిత్వం రాయగలరు. సామాజిక సిద్ధాంతాలతో, సామాజిక ఉద్యమాలతో ప్రగాఢ సంబంధం ఉన్న, జీవితం పట్ల చింతనా సంస్కారం ఉన్న కవులకే ఇది సాధ్యం. కత్తి పద్మారావుగారి కవిత్వంలో జీవిత తాత్వీకరణ లక్షణం మనకు అనేక కవితల్లో కనిపిస్తుంది. బౌద్ధాన్ని, అంబేద్కరిజాన్ని తాత్వీకరణ లక్షణం మనకు అనేక కవితల్లో కనిపిస్తుంది. బౌద్ధాన్ని అంబేద్కరిజాన్ని తాత్విక నేపథ్యంగా చేసుకున్న పద్మారావుగారు సామాజిక ధోరణులు, పరిణామాలను ఆవిష్కరిస్తూ వ్యాఖ్యానిస్తూ వాటి సారాంశంగా జీవితమంటే ఏమిటో క్లుప్తంగా నిర్వచిస్తారు. అవి పాఠకుణ్ణి పట్టి నిలిపి ఆలోచింపజేస్తాయి. జీవితతత్వం పట్ల పాఠకుని దృష్టిని మరలిస్తాయి. కొన్ని ఉదాహరణలను పరిశీలిద్దాం.

**జీవితం సందేశం కాదు, సరుకు కాదు సజీవయానం (ముళ్ళకిరీటం, పుట 4)**

పద్మారావు తన అమ్మ, పెద్దమ్మ చిన్నమ్మ తన కవిత్వ గురువులని పేర్కొన్నారు. (భూమి భాషలో నామాట, పుట : 5) సాధారణంగా కవిత్వ గురువులుగా పూర్వ కవులను చెప్పుకుంటాం. పద్మారావు తన తల్లులనే చెప్పుకున్నారు. ఈ ముగ్గురు దళిత మహిళలు. శ్రామిక మహిళలు. వాళ్ళు జీవితాన్ని గడిపేసిన వాళ్ళు కారు. జీవితాన్ని జీవించిన వాళ్ళు, జీవిత సారాన్ని పాదం ముట్టిన వాళ్ళు. భారతీయ సమాజం వర్ణ వ్యవస్థ - ఆర్థిక వైరుధ్యాలు - గ్రామీణ భారతం వాడ జీవితం దళిత మహిళల జీవితం సందేశం అన్నది పైకి బాగా కనిపిస్తుంది గాని అది భూస్వామ్యభావన. జీవితం సరుకు అన్నది పెట్టుబడిదారీ భావన. జీవితం సజీవయానం అన్నది ప్రజా భావన. ఈ 'యానం'లో సంఘర్షణ, శ్రమ, అనుభవం ఇమిడి ఉంటాయి. కవిని వాళ్ళమ్మ ఎలా పెంచిందో 'ముళ్ళ కిరీటం' కవిత చదివితే అర్థమౌతుంది. కన్నపిల్లల్ని కాన్వెంట్లలో, కార్పొరేట్ కళాశాలలో చదివించి కంప్యూటర్ ఇంజనీర్లను చేసేసి అమెరికా విమానం ఎక్కించేసి డాలర్లను లెక్క బెట్టుకునే తల్లిదండ్రులకు పద్మారావు వంటి వాళ్ళ తల్లిదండ్రులకు తాత్వికం తేడాలుంటాయి. వాళ్ళకు వీళ్ళు అర్థంకారు. బతకులో సమరం చేసే వాళ్ళకే జీవితం. జీవితాన్ని నిర్మించుకునే వాళ్ళదే జీవితం. జీవిత నిర్మాణమొక ప్రయాణం. సుదీర్ఘ ప్రయాణం, కార్పొరేట్ బతుకులకి ప్రయాణం కాదు. అది గెంతటం మాత్రమే. అక్కడ అనుభవాలుండవు, ఆశ్చర్యాలు తప్ప. నేల మీద బతికినప్పుడే జీవిత యానమవుతుంది. అది పద్మారావుకి తెలుసు. అందుకే జీవితాన్ని సజీవయానం అన్నారు. సజీవయానమంటే శ్రమతో కూడిన బతుకు అని అర్థం. శరీర కష్టం స్ఫురింపజేసే యానం.

**జీవితం ఒక పరివేదన (భూమిభాష ; పు 43)**

జీవితం ఒంటరి చర్యకాదు, సామూహిక ప్రక్రియ. అసమసమాజంలో కొందరి జీవితం వడ్డించిన విస్తరి. మరికొందరికి విస్తరే ఉండదు. మొదటి రకం వాళ్ళు జీవితాన్ని గడిపేస్తారు. రెండవ రకం వాళ్ళు జీవితాన్ని జీవిస్తారు. మొదటిరకం వాళ్ళ జీవితంలో బోలుతనముంటే, రెండో రకం వాళ్ళ జీవితంలో భోళాతన ముంటుంది. ఈ వైరుధ్యం వల్లనే రెండోరకం వాళ్ళ జీవితం ఒక పరివేదన అవుతుంది. మట్టి మనుషుల జీవితాలకు అడగడుగునా అనుభవాలుంటాయి. వాళ్ళకు జీవితం నల్లేరు బండి నడక కాదు. మొదటి రకం మనుషులు నీలుగుతారు. రెండవరకం మనుషులు నలుగుతారు. నలిగిన వాళ్ళకి జీవిత సారం గొంతులోకి, గుండెలోకి దిగుతుంది. అందుకే వీళ్ళు ఎప్పుడూ ఆనందంగా ఉంటారు. పద్మారావుగారే మనకు నిదర్శనం. పరివేదన అంటే ఏడుపు కాదు. ఇది కలిగిన వాళ్ళ లక్షణం. పరివేదన అంటే జీవితంలో ఎదురయ్యే ఆటుపోటులకు నిలిచి పారిపోకుండా నిలవటం. "చీకటిని తొలగించటమే కాది" అనే కవితను 'చీకటిని జయించాలి" అంటూ ముగించారు కవి (పైది, పు : 44) దానికి అవసరమైన కొరముట్టు పరివేదన.

**జీవితం ఒక గీతం (భూమిభాష, పు : 48)**

గ్రామీణ భారత జీవితాన్ని కాచి వడబోసిన జానపదులు మాత్రమే జీవితాన్ని ఇలా నిర్వహించగలరు. 'జీవితం ఒక పరివేదన' అన్న కవి 'జీవితం ఒక గీతం' అన్నారు. జీవితం ఒక సముద్రమని, దానిని ఈదడం సాధ్యం దాని పరాన్న భుక్కులైన వేదాంతులు మనల్ని భయపెడితే, శ్రామికతత్వాన్ని జీర్ణించుకున్న కవి జీవితాన్ని గీతంగా నిర్వచించారు. హాయిగా నిశ్చింతగా బతికి పోవడానికి ఇన్ని అవకాశాలు గలవాళ్ళు నిరంతరం పరమ ఏడుపు గొట్టు బతుకులు వెళ్ళ దీస్తున్న వ్యవస్థలో ఒక దళిత కవి జీవితాన్ని గీతంతో పోల్చడం తన జాతి జనులకు జీవితం మీద విశ్వాసం కలిగించడమే. జీవితం పట్ల ప్రేమానురాగాలను పాదుకొల్పడమే. సోమరికి జీవితం పట్ల భ్రమలుంటాయి. శ్రమ జీవికి జీవితం పట్ల విశ్వాసముంటుంది. భ్రమలున్న వాళ్ళు అదృష్టాన్ని నమ్ముకుంటారు. విశ్వాసమున్నవాళ్ళు కష్టాన్ని నమ్ముకుంటారు. ఉద్యమ కవి పద్మారావు జీవితం పట్ల చింతనాత్మకమూ, కళాత్మకమూ అయిన ధృక్పథం గలవారు. లెక్కపక్కలకు మాత్రమే పరిమితమైన వాళ్ళకు ఈ నిర్వచనం అర్థం కాదు. ఏపీ పాటలలో నిమగ్నమైన వాళ్ళకు ఈ నిర్వచనం అన్వయిస్తుంది.

**జీవితం సంకలనం**
**సంపుటికాదు**
**అది ఒక ఆత్మకథ (భూమి భాష, పు : 56)**

నిజానికి జీవితం అనుభవాల సంకలనం, పోరాటాల సంపుటి, మనిషి ప్రతిక్షణం ఇంటోనే బయటనో ఇంకొక మనిషిలోనో మనుషుల చెమటతోనో సంబంధంలో ఉంటారు. ప్రతిక్షణం ఏదో ఒక అనుభవం. మాటరూపంలోనో, చేష్టలరూపంలోనో మనం నిరంతరం అనుభవాలను లోపలికి చేర్చుకుంటూ ఉంటాం. అలా మన జీవితం ఒక సంకలనమే. ఒక సంపుటే. ఇది భౌతికార్థంలో, పద్మారావు తాత్వికార్థంలో మాట్లాడుతూ జీవితాన్ని ఒక ఆత్మకథ అన్నారు. ఒక మనిషి తన జీవితాన్ని సాఫల్యం చేసుకోవడానికి చేసే ప్రయత్నం, అందులో కలిగే అనుభవాలు స్వీయాత్మకంగా ఉంటాయి. అయినా అవి భౌతిక సమాజ ప్రేరేపితాలే. ఆత్మకథ ఎవరికి వాళ్ళు రాసుకునేది. శ్రామిక జీవికి ఉన్నంత ఆత్మకథ విశ్రాంతి జీవికి ఉండదు. ధనరాశుల పవ్వళించే వాళ్ళది జీవితమనలేం. అందులో వాళ్ళ రక్తముండదు ఇతరుల రక్తముంటుంది. ఇతరుల రక్తంతో రూపొందిన బతుక్కి ఆత్మకథ ఏముంటుంది? అది అయితే అనాత్మ కాకుంటే దురాత్మ. చెమట బిందువుల పునాది మీద నిర్మింపబడేదే జీవితం. ఇందులో సారం ఉంటుంది. లోతు ఉంటుంది. అందుకే అది ఆత్మకథ.

**జీవితం అదృశ్యపు కలకాదు**
**జీవితం జీవన వాస్తవం**
**జీవితం అంటే సుఖమో దుఃఖమో కాదు**
**ఆ ఘర్షణ నుండి తోడిన వెలుగు (భూమి భాష, పు: 82,83)**

డా. కత్తి పద్మారావు

జీవితం మిథ్యకాదు, సత్యం "అంతా మిథ్య తలచి చూచినన్" ధూర్జటి అనడం నిరాశావాదం. జీవితం యధార్థాచరణ. భౌతిక ప్రక్రియ జీవితం పట్ల ప్రతి మనిషికీ కొన్ని ఆశలు, ఆశయాలు ఉంటాయి. అవి కొందరిలో నేలను తాకుతూ ఉంటాయి. మరి కొందరికి గాలిలో ఎగురుతూ ఉంటాయి. ఊహ ఊహే. వాస్తవం కాదూ. జీవితాన్ని అనాగరిక, అవాస్తవికత, అక్రమ రూపాలలో రూపొందించుకున్న వాళ్ళను గమనిస్తూనే ఉన్నాం మనం. అవి జీవితాలు కాదు. గాలి బుడగలు, గారడీలు, స్వయం కృషి, చిత్తశుద్ధి పునాదుల మీద నిర్మింపబడిన జీవితమే వాస్తవం. జీవితం ఎవరికీ సంపూర్ణంగా సుఖమయమూ కాదు, సంపూర్ణంగా దుఃఖమయమూ కాదు. తామో, ఇతరులో కల్పించుకున్నదే, కల్పించినదీ అవుతుంది. ఎవరి జీవితంలో బాధలు ఎక్కువగా ఉంటాయో వాళ్ళను దుఃఖజీవులంటున్నాం, రెండింటి కలబోత, కలనేత వాస్తవ జీవితం. సంపూర్ణంగా దుఃఖమో, సంపూర్ణంగా సుఖమో అనుభవిస్తున్నారంటే అది వాస్తవం కాదు. ఈ రెండింటి సంఘర్షణలోంచి పైకుబికి వచ్చే సారమే జీవితం. దానినే పద్మారావు 'వెలుగు' అంటున్నారు. దానిని తోడాలి అంటున్నారు. సుఖదుఃఖాల అంతరంగాల్లోకి వెళ్లి అవి కలగడానికి కారణాలను, వాటి సామాజిక స్వభావాలను అర్థం చేసుకోవడమే వెలుగుతోడడం.

**మేలుకోవడమే కాదు**
**మేలుకొలపడమూ జీవితమే (భూమిభాష, పు: 82)**

ప్రజాశ్రేణుల మధ్య సంచరించే ఉద్యమ కవి నోటినుంచి మాత్రమే ఈ నిర్వచనం పుట్టగలదు. "మేలుకొను మీ భారత పుత్రుడు" అనడం జీవితం. "దేశమునుప్రేమించుమన్నా" అనడం జీవితం. "మాకొద్దీ

"తెల్లదొరతనం" "మాకొద్దీ నల్లదొరతనం" వచింపసిగ్గగున్" పదం ముందుకు అనగలిగిన వాళ్ళది జీవితం. మేలుకోవడం తన కోసం, వ్యక్తిగతం. మేలుకొలపడం సామూహికం, సమాజగతం. ఈ రెండూ జీవితాలే. ప్రతి వ్యక్తికీ తన చుట్టూ ఉన్న ఇతర వ్యక్తుల పట్ల, ప్రతి గుంపుకూ ఇతర గుంపుల పట్ల ఒక బాధ్యత ఉంటుంది. ఈ బాధ్యత నిర్వహించడమే మేలుకొలపడం. అదే జీవితం. మేలుకొలపడం అంటే వైతాళిక పాత్ర నిర్వహించడం. జనాన్ని కదిలించడం, వ్యక్తి చైతన్యాన్ని జాతి చైతన్యంగా, దేశ చైతన్యంగా పరిణమింప జేయడం మేలు కొలపడం. అందుకు కారకుడైన వ్యక్తి జీవితం. జీవితమంటే లాభసాటి వ్యాపారం కాదు. త్యాగమయ వ్యాపకం.

**నీవు జీవిస్తున్నావంటే అర్థం**

**ప్రపంచాన్ని జీవింపజేస్తున్నావనే (కట్టెలమోపు, పు 10)**

పై నిర్వచనానికి మరింత స్పష్టీకరణ ఈ నిర్వచనం.

ఎవరికి వాళ్ళు జీవించడం కన్నా ఒకరు ఇంకొకరికోసం జీవించడం అర్థవంతమైన జీవితం. ప్రపంచాన్ని జీవింపజేయడం అనే మాట విశాలార్థం గలమాట" సొంతలాభము కొంత మానుకు పొరుగువారికి తోడుపడవోయ్" అన్నది గొప్ప జీవిత సిద్ధాంతం. ఇది అంతసులభమైన పనికాదు. ఒక వ్యక్తి తన అహంకారాన్ని చంపుకొని, తనకు తాను అవర్ణకరించుకొని, అవర్గీకరించుకొని, నిస్వార్థకరణపొంది బతకడం ప్రపంచాన్ని జీవింపజేయడం ఇలాంటి వాళ్ళు ఏ కాలంలోనైన, ఏ సమాజంలోనైనా కొందరే ఉంటారు. అందుకే వాళ్ళు చారిత్రక పురుషులవుతారు.

**జీవితమంటే**

**భూమిని చీల్చగలవాళ్లదే (కట్టెలమోపు, పు : 134)**

ఇది శ్రామిక దృక్పథంలో కవి చేసిన నిర్వచనం. జీవించడమంటే మూడు పూటలా తింటూ ప్రాణంతో ఉండి పోవడంకాదు. అది కేవలం బతకడం. ఉత్పత్తి రంగంతో సంబంధమున్న మనుషులు బతకడానికి అవసరమైన సర్వ సామాగ్రిని సృష్టించడంలో భాగస్వామికావడం జీవితం. "శ్రమములోన్ బుట్టి సర్వంబు తానౌను". మన సమాజం రెండు అసమ ముక్కలుగా ఉంది. పెద్దముక్క అన్నింటినీ ఉత్పత్తి చేస్తున్నది. చిన్నముక్క దీనిని అనుభవిస్తున్నది. పెద్ద ముక్కదే జీవితం. చిన్నముక్కది బతకడం. కవి ఈ పెద్దముక్క పక్షాన నిలబడి జీవితాన్ని నిర్వచించారు. భూమిని చీల్చడమంటే చెమట చిందించడం. శ్రమించడం. మనిషి మట్టి మనిషికావడం. మెట్టవేదాంతిది బతుకు మాత్రమే. మట్టి వేదాంతిది జీవితం. నేలను చీల్చడంతోనే సృష్టివాకిళ్ళు తెరుచుకుంటాయి. అలా తెరిచివాళ్ళదే జీవితం.

**జీవితం ప్రకృతి ప్రతిబింబమే సుమా (కట్టెలమోపు, 201)**

మనిషి ప్రకృతిలో ఒక భాగం. మనిషి లేకుండా ప్రకృతి ఉండవచ్చు గాని, ప్రకృతి లేకుంటే మనిషి ఉండదు. మనిషికి చాలా విషయాలలో గురువు ప్రకృతే. మనిషి ప్రకృతి నుంచే జ్ఞానం పొందుతున్నారు. గుహను చూసి ఇల్లు కట్టుకున్నారు. చెట్టునుండి పండ్లు రాలి మొలకెత్తడం చూసి పంట పండించటం తెలుసుకున్నారు. రాతితో నేలను తవ్వి కర్రును తయారుచేసుకున్నారు. ప్రకృతి పరిణామాలలోంచే వైజ్ఞానిక శాస్త్రాలను సృష్టించుకున్నారు. మనిషి అనుకరణ జీవి. అనుకరణ ప్రకృతిని చూసే నేర్చుకున్నారు. అందుకే జీవితం ప్రకృతికి ప్రతిబింబం. శ్రమ జీవిత ఫలితం దక్కడం ప్రకృతి. శ్రమతో సంబంధం లేని వాడికి అది దక్కడం వికృతి. ఈ రకంగా కూడా జీవితం ప్రకృతికి ప్రతిబింబం. వ్యవస్థ ఎలా ఉంటే జీవితాలు అలా ఉంటాయి. పునాదిని బట్టి ఉపరితలం. పునాది ప్రకృతి. ఉపరితలం దాని ప్రతిబింబం.

**మాది రసమయజీవితం (కట్టెలమోపు, పు:90)**

ఇది జీవితానికి రసాత్మకమైన నిర్వచనం. కూటికి గుడ్డకు గూడుకు నిరంతరం పోరాటం చేస్తున్న ప్రజల పక్షాన నిలబడ్డకవి జీవితానికి చేసిన మరో నిర్వచనం. పేదల జీవితం రసమయమా? సంపన్నుల జీవితం రసమయమా? అన్నీ అమరిన వాళ్ళ జీవితాలు రసవంతంగా ఉంటాయా? శారీరక శ్రమ లేకుండా యుక్తులు కుట్రలు మోసం దోపిడీల ద్వారా సంపాదించే సంపద రసమయ జీవితాన్ని ఇవ్వగలదా? చేతుల కష్టం చేసి సంపాదించిన దానితో సంతృప్తిని చెందిన వాళ్ళ జీవితం రసమయంగా ఉండదా? బంగారు వాకిళ్ళు గలవారి జీవితం రసమయమే గాని రసమయం కాదు, శ్రమలేదు గనుక. ఎక్కడ శ్రమ, ఉత్పత్తి ఉంటాయో అక్కడ జీవితం రసమయంగా ఉంటుంది. కష్టంతో సంబంధంలేని పుష్టి తుష్టినివ్వదు. ఇది పేకమేడ వంటిది. ఎప్పుడైనా కూలవచ్చు. శ్రమించడం, శ్రమను ఇష్టపడటం, గౌరవించడం రసవంతం.

పద్మారావు జీవితాన్ని రెండు సాహిత్య ప్రక్రియలైన కావ్య నాటకాలతో పోల్చారు. కావ్యమంటే జీవితానికి ప్రతిఫల ప్రక్రియ. అది సామాజిక వాస్తవికతను విమర్శనాత్మకంగా కళాత్మకంగా ప్రతిబింబిస్తుంది. ఆ కావ్యం దృశ్యా దృశ్యం అంటున్నారు కవి.

**జీవితమంటే మాయకాదు**

**మార్మికం కాదు**

**ఉత్తుంగ తరంగ ప్రవాహం (కట్టెలమోపు, పు: 82)**

మాయావాదం భావవాదం. కనబడినది కనబడదని చెప్పడం నిండు చెరువులో నీళ్ళు లేవనడం వంటిది. మాయావాదం అధిక సంఖ్యా కుల శ్రమను దోచుకోడానికి అల్ప సంఖ్యాకులైన విశ్రాంతి వర్గం సృష్టించిన కూట సిద్ధాంతం. ప్రపంచంలో ఇంతకన్నా దోపిడీ సిద్ధాంతం ఇంకొకటి లేదు. జగత్తు మిథ్య అయితే ఆ సిద్ధాంతం చేసిన వారు ఎక్కడి నుండి వచ్చారు. జగత్తులో పుట్టి జగత్తునే మిథ్య అన్న వారు మానవ ద్రోహి తప్ప ఇంకేమి కాదు. ఈ సిద్ధాంతం భారత జాతిని నిర్వీర్యం చేసింది జీవితం. జీవితం ఒక సత్యం. అది చాలా స్పష్టం. ఇందులో ఏ మర్మాలు లేవు. ఎత్తైన తరంగాలతో కూడిన ప్రవాహం అంటున్నాడు కవి. ఉద్యమాలే ఉత్తుంగ తరంగాలు. వాటి పరంపర ప్రవాహం. అందుకే జీవితం శ్రామికులకు పూల పాన్పు కాదు, "బతుకుపూలబాట కాదు, అది పరవశించి పాడుకునే పాటకాదు" అని సినీ కవి అన్నట్లు.

**జీవితం ఒక దృశ్యాదృశ్యకావ్యం/జీవితం ఒక నాటకశాల (కట్టెలమోపు, పు:45) (భూమి భాష, పు: 105)**

పద్మారావు జీవితాన్ని రెండు సాహిత్య ప్రక్రియలైన కావ్య నాటకాలతో పోల్చారు. కావ్యమంటే జీవితానికి ప్రతిఫల ప్రక్రియ. అది సామాజిక వాస్తవికతను విమర్శనాత్మకంగా కళాత్మకంగా ప్రతిబింబిస్తుంది. ఆ కావ్యం దృశ్యా దృశ్యం అంటున్నారు కవి.

## నానీలు

దాసరోజు శ్రీనివాసాచారి,
9010972169



ఎ.సి గదుల్లో
కాస్ట్లీ కునుకు
గుడిసెల్లో ఉచితం
చందురుని వెలుగు

ఒకవైపు
రెక్కలేవని బలుపు
ఇటు రెక్కడొక్కాడని
బతుకు

చనిపోతామని
అందరికి తెలుసు
మరెందు కీ
స్వార్థాల సొగసు

పక్కింటి పలకరింపులు లేక
సంవత్సరం దాటింది
వాళ్ళు టి.వి కొన్నది
అపుడే...

పెళ్ళి అయిన మరునాడే
విడాకులు
ఆన్‌లైన్‌లో సంబంధం
కదా !

## నానీలు

డా॥ సి. భవానీ దేవి



ఈ సముద్రం
నా బాల్యం డైరీ
ప్రతి కెరటం
కరిగిపోని జ్ఞాపకమే !

అక్షరం కోసం
ఆరుమైళ్ళు నడిచేదాన్ని
అదే నాకు
అక్షయమైంది

ఊరు తల్లి పొమ్మంటుందా ?
నిజం కాదు
నేనే
ఎక్కడో దారి తప్పాను

ఈ భస్మ సింహాసనంపై
చెల్లి, నాన్న ....
నా కిక్కడ
నెలవుందో లేదో !

అప్పుడన్నీ
రంగుల కలలే !
ఇప్పుడు మిగిలింది
పీడకలలే !

ఈ మట్టి
వట్టి ఇసకలా కన్పిస్తుంది
తాకిచూడు
గుండెపోట వినిపిస్తుంది

కనిపించేది, కనిపించనిది అని అర్థం. అదృశ్యమన్నంత మాత్రాన అది మాయ, మార్మికంకాదు. కావ్యం వాస్తవికత కల్పనల కలనేత. వాస్తవికతను బలంగా చెప్పడం కోసం కల్పన. దృశ్యంలోంచి కవి ఆ దృశ్యాన్ని గ్రహిస్తారు. జీవితం ఎంత అర్థమౌతూ ఉంటుందో, అంత అర్థం కాకుండానూ ఉంటుంది. అర్థమైన జీవితం ఆధారంగా అర్థం కాని దానిని అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. ఇది జీవితం కావ్యం. అవును జీవితం ఒక రంగస్థలం, అందులో అనేక వ్యవస్థలు, యుగాలు అంకాలు, దృశ్యాలు, అవి మారుతూ ఉంటాయి. కాలం మారుతున్న కొలదీ సామాజిక వర్గాల ప్రాముఖ్యమూ మారుతుంది. పీడితులు ఎల్లకాలమూ పీడితులగానే ఉండిపోరు. పాతనీళ్ళు పోతూ కొత్తనీళ్ళు వస్తూ ఉంటాయి. అందుకే జీవితం నాటకం.

**జీవితం ఒక స్వతంత్ర సమరం/జీవితం పోరాటమైతే**
**జయించబడని దేముంది ? (ఆత్మగౌరవ స్వరం, పు:241, 242)**

నిరంతరం ఎక్కడో ఒక మూల అణిచి వేతకు, అవమానాలకు, వివక్షతకు గురౌతున్న శ్రామిక కులాల వర్గాల పక్షాన నిలబడి వాళ్ళ దృష్టి కోణం నుండి కవి జీవితానికిచ్చిన నిర్వచనమిది. తన జాతికి జీవితం పట్ల ఇదివరకు గల భావవాద అవగాహన నుండి దృష్టిని మళ్ళించి జీవితానికి గల వాస్తవ లక్షణాన్ని చెప్పి సడలించడం కవి ఉద్దేశ్యం, అందుకే జీవితం సమరమైంది. ముక్తి మార్గం కన్నా విముక్తి మార్గం తమ జీవితం బాగుపడడానికి పరిష్కారమని బోధించడానికే కవి జీవితాన్ని స్వతంత్ర సమరంతో పోల్చారు. దేశానికి స్వతంత్రం వచ్చి ఆరు దశాబ్దాలు గడిచిపోయినాక కూడా కవి జీవితాన్ని స్వతంత్ర సమరంతో పోల్చుతున్నారంటే, ఇదివరకే వచ్చినట్లు భావించబడుతున్న మీద కవికి విశ్వాసం లేనట్లే లెక్క. కనీసం అసంతృప్తైనా ఉండాలి. కె.ఆర్. నారాయణన్ రాష్ట్రపతి అయినప్పుడు భారతదేశానికి మరో స్వాతంత్రోద్యమం అవసరం అన్నారు. ఈ నేపథ్యంలో పద్మారావు నిర్వచనాన్ని అర్థం చేసుకోవాలి. స్వాతంత్ర్యం వచ్చిన ఏడాదికే "మన స్వాతంత్ర్యం మేది" అన్నారు ఆరుద్ర. స్వాతంత్రం వచ్చిన మూడు నాలుగేళ్ళకే "ప్రజల కామితాలు పాటింపలేని స్వరాజ్యమేల?" అని ప్రశ్నించారు గుర్రం జాషువా. స్వతంత్రం రావలసిన మార్గంలో రావలసిన వారికి ఇంకా రావలసి ఉంది. మానవ సమాజంలో కొందరికి అవసరానికి మించిన స్వేచ్ఛ, ఇంకొందరికి అసంపూర్ణ స్వేచ్ఛ. అందుకే దేశంలో నిరంతరం పీడితుల తిరుగుబాట్లు. అందుకే జీవితం ఒక స్వతంత్ర సమరం.

**ఒక్కమాట నిజం/జీవిస్తున్నవారందరూ/ సజీవంగాలేరు / సజీవంగా ఉన్నవారందరికీ /జీవితం అందుబాటులో లేదు (ఆత్మగౌరవం, పు : 370)**

ఈ వివరణను అర్థం చేసుకుంటే జీవితం ఒక స్వతంత్ర సమరం అనే నిర్వచనం మరింత స్పష్టమౌతుంది. ఊపిరులు తీసేవారికి జీవితం విలాసాల డోలగా ఉంది. ఉత్పత్తి చేసేవారు జీవితం విలాసాల హేలగా ఉంది. ఇది సామాజిక వైరుధ్యం. అంతమాత్రం చేత మొదటి వాడికి జీవితం కాదని, రెండవవాడికి జీవితం కాకపోదని అంటున్నారు కవి. కాబట్టి జీవితమంటే సంపద కూడబెట్టుకోవడం కాదు, మనిషి మనిషిగా ఉండమని అర్థం చేసుకోవాలి. "జీవితానికి సాహసమే ఊపిరి" (పైది, పు : 379) అన్నా "జీవించటం ఒక యుద్ధ ప్రక్రియ అన్నా (భూమి భాష పు : 152) కవి తన జాతిని తట్టి లేపడమే. పద్మారావు కవిత్వం ఒక చైతన్య గీతిక. ఒక పోలికేక. ఒక ఆత్మ గౌరవస్వరం. ఆత్మవిశ్వాసపతాక. ఆత్మ స్థైర్యగొంతుక. పీడనకు వివక్షకు అణిచి వేతకు గురౌతున్న సామాజిక వర్గాల ప్రజలకు పద్మారావు కవిత్వంలోని జీవిత నిర్వచనాలు ధైర్యం చెబుతాయి. ముందుకు నడిపిస్తాయి.

**వ్యాసకర్త ఫోన్: 9440222117**

# రహస్య కవాటం

కె. హనుమంతరావు

9440361381



మాటల మీద నుంచి మాటల మీదకు దూకటం కాదు
మంత్ర కవాటాలను ఒక్కొక్కటే తెరుచుకుంటూ పోవటం కవిత్వం
లోపలి చీకటికి వెలుగుల రంగులద్దే అద్దకం పని కవిత్వమంటే
నాడులు నీవే కావచ్చు ధమనుల బాధను అర్థం చేసుకోవడమే
పచ్చిదనాన్ని పచ్చదనంగా అనువదించే కళే కదా కవిత్వమంటే!
ఎడారిలో నడుస్తూ కూడా ఒయాసిస్సులను మోసుకుతిరిగే కూలీపనికి సిద్ధమా!
బోరుబావిలో పడ్డ బిడ్డ మాదిరి
ఊహలు ఊపిరికోసం విలవిలలాడితేనే కవిత్వ జ్వరం తగులుకున్నట్లు
ఉపమాల కోసం జపమాల తిప్పుతూ కూర్చొకు
ఊర్వశి మరో పురూరవుడితో లేచిపోవచ్చు
కవిత్వం సాక్షాత్కరించడానికి ఎన్ని మన్వంతరాలు శోధించాలో తెలుసా!
పసిబిడ్డ పకపకల పక్కలకి పోయి నిలబడాలి... కాస్త కాకెంగిలి కవిత్వం దొరకుతుంది
పడుచుపిల్ల వాల్చూపుల్లో తడిసి ముద్దవాలి... ప్రబంధాల చలిగాలి వణికిస్తుంది
అమ్మలాలింపు నాన్న గద్దింపు అన్న అల్లరివేధింపు చెల్లి బుంగమూతి సాధింపు
కవివే అయుంటే నీ ఇల్లే ఒక భువన విజయం కదరా బాబూ !
ఇరుగింటి పంచాంగం వారి బహుళ శుద్ధ పూర్ణిమ పర్వంలోనే కాదు
పొరుగింటి క్యేలండరు ముప్పయ్యో తారీఖు అడుగునా అణిగుంటుంది కవిత్వం కాస్త తడిమి చూడు
తాగొచ్చిన మొగుడు తన్నినా తను కంచం ఖాళీ చేసిందాక పచ్చి గంగ ముట్టని తడికవతలి తల్లి తడికళ్ళలోకి తొంగి చూడు
'మానిషాద' కన్న మహావిషాదమైన కవిత్వం వరదలై పారుతుంటుందక్కడ
ఎక్కడ లేదు కవిత్వం!
గుడిబైట గుడ్డి బిచ్చగాడు పర్చుకు పడుకున్న చింకిపాతలో లేదా!
బడికెళ్ళే బుడ్డడి స్కూలుబ్యాగు బుక్కుల బరువు కింద నలగడం లేదా !
పొలంగట్టు మీద మట్టికుప్పలా పడున్న అన్నదాత గుండెల్లో కదుంకట్టుంది తట్టల తట్టల కవిత్వం
అడవి చీకటి దారుల్లో జనం వెలుగుల కోసం అహోరాత్రాలు తుపాకీ మడమల మీదే కునికి పాట్లు పడే అన్నల కంటిరెప్పల్లో మరుగుతుంటుంది కవిత్వం
పట్టించుకోవాలే గాని బడ్జెట్ ప్రసంగాల్లో సన్మానపత్రాల్లోనూ అధికప్రసంగిలా అప్పుడప్పుడూ చప్పుడు చేస్తూనే ఉంటుంది కవిత్వం
తాతలకాలం నాటి తాళపత్రాల గ్రంథాలనుంచి పక్కింటి సీతకు రాంబాబు రాసిన ప్రేమలేఖల దాకా.. వెదుక్కుంటూ పోతే అంతా కవిత్వమేలే!
మేలైన కవిత్వమే ఏది?... ఎక్కడా ఆ రహస్య కవాటం?
ఖాళీ పదాల అర్థాలను పీకి పాకాన పెట్టి... పద్యాల ప్రతిపదార్థాలను తవ్విపోసి...
వెర్రి గీతాల చరణాల వెంట పిచ్చిగా పరుగెత్తితే వినిపించేది
సిల్కుస్మితలు చీరకుచ్చెళ్ళ చప్పుళ్ళు
సీతాకోకచిలుక రెక్కల సవ్వళ్ళ రహస్యం కావాలా!
పగలంతా వళ్ళు పుళ్ళు చేసుకుని రాత్రి హోటల్ బల్లల సందుల మధ్య కలత నిద్రలో ఉలికులికిపడే బుడ్డోడి గుండెలు తట్టి చూడు
అక్కడ తెరుచుకుంటుంది అసలు కవిత్వ రహస్య కవాటం.

కథ

# స్కైలాబ్



వేముల ప్రభాకర్

9533120533

“శుక్రవారం పూట మాంసం తెచ్చిన వేంది కొడుకా! నేనైతె వండ” అన్నది మా అమ్మ కోపంగా మా అన్నతో “నీకెందుకమ్మా నేను వండుత, నువ్వు రొట్టెలు చేసియ్యి చాలు” అన్నాడు మా అన్న.

“నాన్న కూడా ఇంట్లో లేడు. ఆదివారం వచ్చినప్పుడు తెచ్చుకోవస్తుండెగద”

“ఊర్లె అందరు తిని తాగి జల్సాలు చేస్తున్నారు వారం రోజుల నుంచి కొందరు ఉన్న ఆస్తులు కూడా అమ్ముకుని సొమ్ము చేసుకుంటున్నారు. రేపు ఏమయితదో ఎవ్వరికి అర్థమైత లేదు. నీకు ఇల్లే స్వర్గం. బయటి విషయాలు ఏమి తెలుసుకోవు”

“మీరు చెప్పితెనే గద నాకు తెలిసేది నేను చదువుకున్నదాన్ని కాదు గద. అయినా ఏం జరుగుతున్నది, భూకంపమేమన్న వస్తున్నదా” అన్నది అమ్మ రొట్టెలకు జొన్నపిండి తడుపుతూ.

“నెల రోజుల్నుంచి పత్రికల్లో, రేడియోల్లో రోజు వస్తున్న వార్తలు జనాన్ని భూకంపం కన్న ఎక్కువ భయపెడుతున్నాయి. అమెరికా వాళ్ళు ప్రయోగించిన అంతరిక్ష నౌక ‘స్కైలాబ్’ ఇప్పుడు పనిచేస్తలేదట అది భూమ్మీద వచ్చి పడుతుందంటున్నారు.

“అది ఎక్కడ పడ్తదో ఏమో? మనమెందుకు పరేషాన్‌కావాల”

“అది నిజమే నమ్మా! కాని అది మనప్రాంతంలో పడే అవకాశాలే ఎక్కువ ఉన్నాయంటున్నారు. ఇంకెక్కడో కాదు అది పడేది మనూరి మీదనేనని ఎవరికి వాళ్ళు పుకార్లు పుట్టిస్తున్నారు. లేనిపోని భయాలు సృష్టించి కొందరు వ్యాపారాలు చేసుకుంటున్నారు.” అన్నాడు అన్న.

“స్కైలాబ్ పడితె ఏమైతది” అన్నది మా చెల్లెలు భారతి

“ఒక పెద్ద పర్వతం మన ఊరి మీద పడితె ఎంత నాశనం జరుగుతది. స్కైలాబ్ వల్ల అంతకన్న ఘోరం జరుగుతుంది” అన్నాడు అన్న.

అప్పుడే మా ఇంటికి వచ్చిన సుదర్శన్ కుర్చీలో కూర్చుంటూ “బావా అమెరికా వాని స్కైలాబ్ పడితె ఎంత నష్టం జరుగుతదో ఏమో కాని మా దొర తయారు చేసిన స్కైలాబ్‌లు పేలితే మాత్రం దొరగడీ ఒక్కటే కాదు ఊళ్ళె ఉన్నందుకు మాకు గూడ కష్టాలు తప్పెటట్టు లేవు” అన్నాడు.

వడ్ల సుదర్శన్ మా అన్నతో కలిసి చదువుకున్నవాడు. ప్రస్తుతం వాళ్ళ స్వంత ఊరు రాజేశ్వర్ రావు పేటలో కులవృత్తి చేసుకుంటున్నాడు. మంచి మాటకారి. పిట్ట కథలు చెప్పడంలో దిట్ట. తుపాకి రాముని డైలాగులు చెప్పి అందర్ని నవ్విస్తుంటాడు. ఆయన నెలకొక్క సారైనా మా ఇంటికి వచ్చి మా అన్నతో ముచ్చట పెట్టి పోతుంటాడు. ఇంట్లో ఉన్న వాళ్ళందరిని వరుసలు కలిపి మాట్లాడిస్తడు. అందుకే సుదర్శన్

మాటలు మేమంతా ఆసక్తితో వింటుంటాము.

"మీదొర రావణాసురుడని తెలుసు గాని ఆయన తయారు చేసిన స్కైలాబ్‌ల సంగతి నువ్వే చెప్పాల" అన్నాడు మా అన్న

"అదిసరే స్కైలాబ్ స్పెషల్ వంట తయారు చేస్తున్నట్టున్నావు, ఏంటిదది మంచి వాసనొస్తున్నది"

"కోడికూర గోలిస్తున్నం, జొన్నరొట్టెలు చేస్తున్నాం"

"బామ్మర్దీ కొన్ని మంచి నీళ్ళియ్యి. నోరెండుకపోతుంది" అన్నాడు సుదర్శన్. నేను చెంబులో నీళ్ళు తెచ్చిస్తే గటగటా తాగి "మా ఊర్లె కోళ్ళు, గొర్లు, మేకలు ఆఖరికి పందుల ధరలు కూడ పెరిగిపోయినయి. ఎంత ధరైనా సరే పెట్టి కొందామంటె మాంసం దొరకుడు లేదు. దసరా అప్పుడు కూడ ఇంత గిరాకి చూళ్ళేదు." అన్నాడు.

"మీ ఊర్లెనే గొర్రె పిల్లలు అగ్గువ దొరుకుతయని అందరంటరు. నువ్వు ఉల్టా మాట్లాడుతున్నవేంది"

"అయ్యో! నీకు తెలువదా. మొన్నటి వారమే మా ఊర్లె రెండు మందల గొర్రె పిల్లలు చచ్చిపోయినయి"

"ఏంది పిడుగు పడ్డదా" అన్నది మా అమ్మ రొట్టెలు పెంక మీద కాలుస్తూ.

"అయ్యో అత్తమ్మా! ఉరుము లేని పిడుగు". స్కైలాబ్ వచ్చి పడితె గొర్లన్ని చచ్చిపోతాయని భయపడి మా ఊరి మంద గొల్లోళ్ళు గొర్లను ఇంట్ల తోలి తలుపులు బిడాయించిన్రు. ఇంకేమున్నది తెల్లారేసరికి గాలి ఆడక పిల్లలన్ని చచ్చిపోయినయి.' లబోదిబో మంటున్నారు.



"పాపం అమాయకులు. వాళ్ళ బతుకుదెరువు గొర్రెల మందనేకదా" అన్నాడు అన్న కోడికూర వంట ముగించి వచ్చి సుదర్శన్ పక్కకు కూర్చుంటూ "గొర్లన్ని వాళ్ళయే అయితె గొడవ ఉండకపోవు. చచ్చిన గొర్లల్ల మా ఊరి దొరవి కూడా ఉన్నాయట. అదే గొల్ల ఎంకన్నకు ముప్పుదెచ్చింది.

మందల పెంచుమనిస్తె నాపిల్లలను మీరు చంపిన్రు ఇప్పుడు కొనియ్యుండ్రని దొరగడీలకు పిలిపించిండట.

అప్పుడిన్ని ఇప్పుడిన్ని వెట్టికొచ్చిన పిల్లలు తెచ్చి దొర మందల కలిపిన మాట వాస్తవమే కాని మధ్య మధ్య ఆయనకు అవసరమైనప్పుడల్లా గొర్రె పిల్లలు తీసుకపోతనే ఉన్నడట దానికి లెక్కలేదు పత్రంలేదు. ఇప్పుడు చచ్చిన పిల్లళ్ళ సగం నాయే అంటే పాపం వాళ్ళు ఏడికెళ్ళిదెస్తరు.

"రేపొచ్చి మాట్లాడుతం బాంచెను" అని ఇద్దరు గొల్లోళ్ళు ఇంటికి వచ్చిన్రట. 'పిడుగు మీద పిడుగు పడ్డట్టు ఉన్న గొర్రె మంద పోయిందని బాధపడుతుంటె దొరకొత్త లెక్క చెప్పి గొర్రె పిల్లలు తెచ్చియ్యుమంటె మన ఇల్లు జాగ అమ్మినా అయేపనిగాదని భార్య శోకాలు పెట్టిందట. గొల్ల వెంకన్న నేమొ 'బతికి సాధించేది లేదు సంసారం బజార్ల పడవట్టె' అని దిగులు పడిపోయి ఓ అర్ధరాత్రి పూట లేచి ఊరవతల మర్రి చెట్టుకు ఉరిపెట్టుకొని చచ్చిపోయిండు. ఇది ఈ నడుమ మాదొర చేసిన మొదటి స్కైలాబ్."

"అయ్యో! ఎంత పని చేసిండు" అన్నది అమ్మ రొట్టెలు కాల్చుడు పూర్తి చేసి.

"ఇంత సేపటి నుంచి ముచ్చట చెపుతున్న అల్లునికి చాయకూడపోసుడు లేదా" అన్నడు సుదర్శన్ నవ్వుతూ.

"ఇప్పుడేం చాయ తాగుతావు, వంటయింది భోజనమే చేయు" అన్నది మా అమ్మ. కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చి మా అన్న సుదర్శన్ పీటలు వేసుకుని పక్క పక్కకు కూచున్నారు. మా చెల్లెలు నేను చాపలు వేసుకొని కూర్చున్నాం. అందరికి మా అమ్మ వడ్డించగా తింటున్నాం. సుదర్శన్ తినుకుంటనే చెపుతున్నాడు.

"వెంకన్న చనిపోయేసరికి గొల్లకులమంత ఒక్కటయింది. వాళ్ళకు తెనుగువాళ్ళు తోడైండ్రు"

"వాళ్ళెందుకు కలిసినట్టు" అన్నాడు అన్న " మాఊరవతల చింతచెట్ల కాయ ఎన్నో ఏండ్ల నుంచి తెనుగోళ్ళు కొట్టుకుంటున్నారు. దాని కిందికి గ్రామ పంచాయతీకి సాలీనా నూరురూపాయలు కడుతున్నారు. దొరతోని కిరికిరి ఎందుకని కొట్టిన కాయలకెళ్ళి పావలా వంతు ఆయనకు ముట్ట చెబుతున్నారు. 'అట్లగాదు ఈయేటి నుంచి కొట్టిన కాయల సగం నాకు సగం మీకు" అని దొర అనేసరికి వాళ్ళకు మండింది. ఇది రెండో స్కైలాబ్.

పోలీసులొచ్చి పంచ్‌నామ చేసి శవాన్ని ఇంటి వాళ్ళకు అప్పగించినాక, కులము వాళ్ళు అంతా కలిసిపోయి కల్లుమండువాల కూచొని చావు కల్లుతాగుతుంటే కల్లుపోసిన నారాయణ గౌడు కూడ బత్తి ఎక్కిచ్చిండట వాళ్ళకు దొరమీద

"ఆయనకెందుకు కోపం దొరమీద" అన్నాడు మా అన్న.

"ఆయనకు ఒక్కనికే కాదు మొత్తం గౌండ్ల వాళ్ళందరికి దొరమీద కోపమే మా ఊరి కల్లు గీత చెట్టు అబ్కారి హర్రాజుల్లో పాటపాడి అగ్గువకు తీసుకొని గౌండ్లోళ్ళకు పొందుబాటు చేసేటప్పుడు మాత్రం నూరుపెడితె వెయ్యి వసూలు చేస్తున్నడు ! దొర పీడ వదలాలంటే నీ అసుంటి చదువుకున్న మారాజు ఎవరో సొసైటీ పెట్టుకోవాలని చెప్పిండట. అప్పట్నుంచి వాళ్ళు సొసైటీ కోసం తిరుగుతున్నారు. సొసైటీ అయితే తన కొచ్చే కమీషన్లు పోతాయని దొర అబ్కారి వాళ్ళను పట్టుకొని వాళ్ళ పని గాకుండ పుల్లలు పెట్టిస్తున్నడట గౌండ్లోల్లంత దొరమీదికి కత్తులు నూరుతున్నరు. ఇది మూడో స్కైలాబ్" అన్నాడు సుదర్శన్. "మీ దొర దోపిడి అయిపోయిందా యింకా ఉన్నదా" అన్నది మా అమ్మ మధ్యలో. "అన్నదాత సుఖీభవ, నా భోజనమైతే అయిపోయింది. మా దొరయిరాకాసి లోయ కథలు, ఎన్ని చెప్పినా ఒడువయి. అసలు కథ ఇంకోటున్నది అది తర్వాత చెబుత" అని లేచాడు సుదర్శన్. "ఆ కథ కూడ చెప్పిపో" అన్నాను నేను అందరు నవ్వారు.

సుదర్శన్ "బామ్మర్దీ! నేను చెబుతున్నది కాలక్షేపం కథగాదు,

# నాగరిక వధ్యశిలపై

ఆవుల వెంకటేశులు
9441665095

నువ్వు నాగరికుడివి కదా !
అందుకే హృదయం ఘనీభవించింది
వాంఛా చాంచల్యంతో వైజ్ఞానిక పుష్పక విమానమెక్కి
మానవతా జఠాయువు రెక్కలు త్రుంచి
అసుర సంతతి పరిరక్షణ కోసం
కొత్త నియంత అవతారమెత్తినావు

కళ్ళతో నవ్వుతూ, కుయుక్తుల పద్మవ్యూహాన్ని పన్ని
కపటం కత్తితో స్వప్న బాహువులను తెగ్గోసి
చిరునవ్వుల సైనైడ్ కత్తితో
అమ్మపొట్టలో ఆడుకుంటున్న
అంకురాన్ని ఛిద్రం చేసినావు
తడిలేని అధరాలతో ఆదర్శాలు వల్లిస్తూ
నీతి నిజాయితీలకు ఉచ్చు బిగించి
మానవీయత కనుగుడ్లలో ఇనుప చువ్వలు గుచ్చి



చరిత్రను శూన్యం శూలానికి వేలాడదీసినావు
మంతనాల పూపందిళ్ళలో నజరానాల
కిళ్ళీలు చప్పరిస్తూ
ఆకలి జ్వాలల్లో కమిలిన రోదనలు
వినబడకుండ బధిరత్వాన్ని తొడుక్కొని
అధికార కుర్చీకోసం విలువల పీకల్ని త్రుంచి
మౌనం వీడి మాట్లాడిన ధర్మాన్ని శిరచ్ఛేదన
చేశావు

డాలర్‌కై వెంపర్లాడుతున్న మేధను రోబోటుగా
శిల్పించి
వెర్రెత్తిన స్వార్థంతో భూమ్యాకాశాల్ని
కొల్లగొట్టాలని
రిమోటు హస్తాన్ని తలమీదికెత్తుకొని
నాగరిక వధ్యశిలపై నిలబడిన
భస్మాసురుడివి.

---

మాఊర్లె చావు బతుకుల పోరాటం" అన్నాడు "నిజమే నైజాం రాజ్యం పడిపోయినా ఈ దొరల జులుం మాత్రం తగ్గలేదు. నక్సలైట్లైతెనే వీళ్ళ రోగం దిప్పుతరు అన్నాడు మా అన్న.'

"మా ఊరి భూమక్క మొగుడు రాములు దొర దగ్గర జీతం చేస్తుండె. దొర తోటల నీళ్ళు కట్టడానికి పోయినప్పుడు పాముకుట్టి చచ్చిపోయిండు. అప్పటికే భూమక్క గర్భవతి అప్పుడు పుట్టిన బిడ్డనే లక్ష్మి. తల్లిదండ్రులు ఎంత చెప్పినా భూమక్క రెండో పెళ్ళి చేసుకోలేదు. దొర కూడ సాయం చేసింది లేదు. బీడీలు చేసుడు నేర్చుకున్నది. ఆ సంపాదన తోనే బిడ్డను పెంచి పెద్ద చేసింది. పెండ్లి కూడ చేసింది.

లక్ష్మి అత్తవారి ఊరు వీరాపురం పిల్లను తీసుకపోవుడు లేదు. ఏం సంగతని విచారం జేస్తె "పెండ్లిల ఒప్పుకున్న బాపతు బంగారం అద్దతులం తక్కువైంది. ఇప్పుడు అది పెడితెనే నా కొడుకు సంసారం చేస్తడు లేకపోతె బంద్" అని వియ్యంకుడు చెప్పిపంపిండట.

పాపం భూమక్క దగ్గరేమున్నది. మొగుడు ఎప్పుడో కాలం జేసె. ఆమె రెక్కల కష్టంతోనే బిడ్డ పెండ్లి జేసింది. ఇప్పుడు అర్ధ తులం బంగారమంటె మాటలా. దొర ఏమన్న సాయం జేస్తడేమోనని ఆశపడిపోయి చెప్పుకున్నదట. లక్ష్మి చూడ చక్కని పిల్ల. వయసులో ఉన్నది ఆమెను చూడంగనే దొర కళ్ళు తిప్పుకోలేక పోయిండట. 'నేను వీరాపురం వాళ్ళను పిలిపించి మాట్లాడుత' అని చెప్పిన మరునాడే లక్ష్మి అత్తమామలను రప్పించి అందర్ని కూచోబెట్టి పావుతులం కాడికి ఒప్పించిండట.

"నా దగ్గర పావుతులం గాదు తుస్ర బంగారం కూడ లేదు. నేనెక్కడికెళ్ళి తెచ్చేది" అన్నదట భూమక్క "రాములు నాదగ్గర పనిచేసిండు. వాడు చనిపోయినప్పటి నుంచి ఏమి చేయలేకపోయిన. ఇప్పుడు నీ బిడ్డకు అవసరమొచ్చింది. ఆ పావుతులం బంగారం నేనేపెడత" అన్నాడట దొర.

తన భర్త సేవలను యిన్నేండ్ల తర్వాత దొర జ్ఞాపకం పెట్టుకున్నందుకు భూమక్క పొంగిపోయింది.

"దొరా నువ్వే దేవునివి దాని సంసారం నిలబెట్టు" మని లక్ష్మిని దొరకాళ్ళ మీద వేసిందట.

"భూమక్కా మా పెద్దమ్మాయి ప్రసూతికి వచ్చింది ఆమెకు నెలరోజులు తోడుంటది, లక్ష్మిని పంపియ్యి పురుడు అయినంక నేను ఒప్పుకున్నట్టు బంగారం పెడత" అన్నాడటడ దొర

"ఒక్క నెలకే మొచ్చింది బాంచెను, మీరన్నట్టే కాని" అని లక్ష్మిని ఒప్పించి దొర ఇంటికి పంపింది.

ఇంకేంది దొర అనుకున్నంత చేసిండు బాగ తాగినంక ఒకరోజు లక్ష్మిని లొంగ దీసుకున్నడు. తెల్లవారి బిడ్డ ఏడ్చుకుంట వచ్చి చెప్పేదాక భూమక్కకు తెలువదు. భూకంపం వచ్చినట్టు కిందపడిపోయింది. ఒకరి నుంచి ఒకరికి జరిగింది ఊరంత తెలిసిపాయె. 'లక్ష్మి బిడ్డసుంటిది దాని సంసారం నిలబెడ్తడని నమ్మి పంపితె దాని బతుకుల నిప్పులు పోసిండు. ఆ నిప్పులు వాని గడీల పడ అది కాలి కూల అని భూమక్క దొరమీద పగతోని కుతకుత ఉడికిపోతుంది. ఇది నాలుగో స్కైలాబ్. ఇన్నిట్ల ఏ స్కైలాబ్ దొర మీద ఎప్పుడు పడుతదో తెలువదు. అమెరికా వాళ్ళ సైలాబ్ ఆ పడేదేదో మా దొరగడీ మీద పడ్డా బాగుండు దొర పీడ విరగడై పోతుండె" అని చెప్పిన సుదర్శన్ వాళ్ళ ఊరికి పోయే బస్ టైమైందని హడావుడిగా వెళ్ళిపోయాడు.

◆

# ఊరబావి కథ - దళిత స్త్రీ చైతన్యం ఒక సామాజిక - చారిత్రక విశ్లేషణ



డా॥ వి. ఆర్. రాసాని

ఊరబావి - తాత్త్విక నేపథ్యం

"దెబ్బతిన్న వారికే దాని బాధ తెలియురా
వేరొక్కరి కడుపుమంట మూర్ఖుడేమి ఎరుగురా?"

**భా**రతదేశపు మొదటి సంఘ సంస్కర్త మహాత్మ జ్యోతిబాపూలే ఒక గేయ రూపంలో ఉద్ఘాటించినమాట అది.

"మనం పోరాడితే తప్ప ఏది లభించదు. ఎవరూ వచ్చి మనల్ని బాగుచేయరు. మనల్ని మనమే బాగుచేసుకోవాలి"

"నిమ్న జాతుల వారమనే భావం ఎన్నడూ మీ మనస్సులలోనికి రానీయకండి. మనం ఎవరికంటేనూ తక్కువ కాదు"

పై మాటలు అన్నది దళితుల అభ్యున్నతి కోసం తన జీవితాన్నే అంకితం చేసిన మరో సంస్కర్త డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్.

తరతరాలుగా అగ్రవర్ణుల చేత అణచివేయబడి, అజ్ఞానంలో మగ్గిపోతున్న నిమ్నజాతుల్లో వెలుగులు నింపిన మహానుభావులు పూలే, అంబేద్కర్‌లు. వారు ప్రారంభించిన సామాజిక చైతన్యం, సాగించిన పోరాటం భారతీయ సమాజంలో గొప్ప మార్పును తీసుకువచ్చింది. దళిత బహుజనుల్లో ఆత్మవిశ్వాసమూ, ఆత్మాభిమానమూ పెరిగింది. ముఖ్యంగా దళితులు ఆ మహానుభావులు చూపించిన చైతన్య బాటలో ప్రయాణిస్తూ నేడు ఎంతో పురోభివృద్ధిని సాధిస్తున్నారు. ఆ మహాశయుల చైతన్య ప్రభావం భారతీయ సాహిత్యపు మార్గాన్నీ, గమనాన్నీ, గమ్యాన్ని కూడా మార్చివేసింది. ఎందరోకవులు, రచయితలు దళిత బహుజనుల బాధలని, గాథలని చిత్రించడం ఆరంభించారు. దాంతో జర్మనీలోని యూదులకంటే, అమెరికాలోని నీగ్రోలకంటే, ఈజిప్టులోని ఇజ్రాయిలీల కంటే ఇంకాహేయంగా వున్న భారతదేశంలోని నిమ్న జాతుల స్థితిగతులు కాస్తంతయినా మెరుగుపడడానికి వారి రచనలు కూడా కాస్తో కూస్తో దోహదం చేశాయన్న సత్యం కూడా విస్మరించరానిది.

ఒకప్పుడు బానిసత్వం అన్ని దేశాలలోను వుండేది. అది వంద సంవత్సరాల క్రితం వరకు, అంటే 19వ శతాబ్దం పర్యంతం కొనసాగింది. అదికూడా పశువుల సంతల్లో గొడ్లను అమ్మినట్లుగా మనుష్యుల్ని అమ్మే వ్యాపార సంస్కృతి. సిగ్గూ ఎగ్గూ లేకుండా అది చట్టబద్ధమైన వ్యాపారంగా బాహాటంగా, బహుళంగా సాగింది. ప్రఖ్యాత ప్రాచీన గ్రీకు తత్వవేత్తలయిన ప్లేటో, అరిస్టాటిల్‌లు సైతం దాన్ని సమర్థిస్తూ రచనలు చేశారు. దీన్ని నిరసిస్తూ ఆధునిక కాలంలోనే చాలా రచనలు వచ్చాయి. అలాంటి వాటిలో హోవార్డు ఫాస్ట్ 'sparteus' అలెక్స్ హేలీ The roots, స్పెయిన్ బక్ 'The grapes of rath' వంటి నవలలు ప్రసిద్ధమైనవి.

అయితే ఈ బానిసత్వంకంటే అసహ్యకరమైనదీ, క్రూరమైనదీ, నీచ, నికృష్టమైందీ అస్పృశ్యత. ఇతర దేశాలలో 'రంగు భేదం', 'జాతిభేదం' వున్నాయి. గానీ ఇలా కులాల పేరుతో సాగే అస్పృశ్యతలేదు. ఇది భారతదేశంలోనే వున్న జాడ్యం. దీనికి 'మైల' అనే అందమైన పేరు పెట్టి వేల సంవత్సరాల నుంచీ సవర్ణులు సాగిస్తున్న దురాగతం. దీన్ని మొట్ట మొదట ఉద్యమ స్థాయిలో ఎదుర్కొన్న వారు జ్యోతిబాపూలే, అంబేద్కర్ ఇద్దరే. వీరు రగిల్చిన ఈ సామాజిక చైతన్యమే ఆనాటి కవుల, రచయితల పైన అనివార్యంగా పనిచేసి వుంటుందనీ, ఇప్పటికే చేస్తోందనీ చెప్పడం సత్యదూరం కాదు. అసంగతమూ కాదు. ఇలాంటి

సామాజిక ఉద్యమాల కాలంలో పుట్టిన కొలకలూరి ఇనాక్ పైనా ఈ ప్రభావం వుంటుందనుకోవడంలో తప్పేమీ వుండబోదు.

ఆచార్య కొలకలూరి ఇనాక్ ఎన్నో కథలు, నవలలు, నాటకాలూ రాశారు. కవిత్వమూ రాశారు. అయితే వీరి కీర్తిని మాత్రం జాతీయ స్థాయికి ఎగురవేసినవి తలలేనోడు, పిండీకృతశాటి, పశ్చాద్భూమి, ఆకలి, ఊరబావి లాంటి కథలు. అందులో మకుటాయ మానంగ నిలబడి వారికి అలరామకీర్తిని అర్జించి పెట్టిన కథ 'ఊరబావి'.

అద్భుతమైన శిల్ప నైపుణ్యంతో, గొప్ప ప్రతిభా సంపత్తితో, గొప్ప సామాజిక అవగాహనతో రాయబడి తెలుగు కథా సాహిత్యాన్నీ సుసంపన్నం చేసిన కథ ఊరబావి. ఇలాంటి అరుదైన కథను మరో రచయిత నుంచీ ఆశించలేం. ఆ కథను ఒక ఇనాక్ గారే రాయగలరు. మరొకరికి అసాధ్యం. ఒక దళిత స్త్రీ యొక్క గొప్ప ఆలోచన, గంభీరమైన వ్యక్తిత్వం, ఉరకలెత్తే స్త్రీ నవ చైతన్యం, ఆలోచింపచేసే ఆవేశం ఈ కథలోని ప్రతి అక్షరంలోను ఆవిష్కరింపబడి వున్న విశేషాలు.

**ఊరబావి కథ – ఇతివృత్తం :**

"భయం ప్రాతి పదిక మీద బ్రతుకుతున్న ఈ ఊరు, ఈ దేశం, ఎంతకాలం జీవిస్తాయి? ప్రేమ ప్రాతి పదిక మీద బ్రతికే సమాజం, వ్యవస్థ ఏ రోజు పుడతాయి"

ఊరిని, పల్లెని ఆవరించిన భయం సందర్భంగా కథలో రచయిత చెప్పిన ఈ మాటే ఈ కథకి ప్రాణవాయువు.



అగ్రవర్ణాలు జీవించే ఊరికి, దళితులు బతికే పల్లెకి మధ్య వున్న ఊరబావి చుట్టూ జనం మూగారు. మునసబూ వచ్చాడు. బావిలోకి తొంగిచూశాడు. నీళ్ళ మీద పూర్తిగా మునక్కుండా గిలకలకు కట్టిన మోకులతో బిగించిన తోలు వలిచేసిన ఎద్దు దట్టెం వ్రేలాడుతోంది. రక్తంతో తడిసిన నీళ్ళు ఎర్రడాలు తిరిగాయి.

ఆ బావికి పదిహేను గజాల దూరంలో వున్న మాదిగ రాముడూ, అతని కొడుకు చిదంబరమే ఈ పని చేసుంటారనుకున్నారు ఊరిజనం.

నాలుగు వందల గడపలున్న ఆ ఊరిలో, చివర వంద గడపలు హరిజనులవి. పల్లెలో ఉన్న బావిలో సరిగానీరుండదు. ఎప్పుడూ నీటి ఎద్దడే. ఊర్లో వాళ్ళకి స్మశానం సమీపంలోవున్న బావి, ఈ ఊరబావి సమృద్ధిగానీరందిస్తున్నాయి. పల్లెవాసులు కావళ్ళు, కడవలు తీసుకుని ఊరబావి దగ్గర దూరంగా నిలబడి ఊరివాళ్ళను అడుక్కుని నీళ్ళుపోయించుకొని రావాలి.

ఆ ఊరబావిని రైల్వే స్టేషనుకు కోసున్నర దూరంలోవున్న దేవాలయ దర్శనార్థం వెళ్ళే యాత్రికుల కోసం ప్రభుత్వం తవ్వించిన బావి. అయినా దళితులకు అందులో నీరు తోడుకునే అదృష్టంలేదు. అది ఎనిమిది గిలకలబావి.

ఈ సంఘటన జరిగిన ముందురోజు చిదంబరం భార్య, బాన తీసుకుని నీళ్ళకోసం వచ్చి, నీళ్ళు పోసే వాళ్ళకోసం ఎదురు చూసింది. మంచి దృఢమైన శరీర సౌష్టవం కలిగిన ఆమె అప్పుడే నీళ్ళకోసం వచ్చిన ఊరి యువకుని చేత నీళ్ళు పోయించుకుని, అతని సాయంతో నెత్తికి కడవనెత్తుకునే సమయంలో అతను కడవను వదిలేసి ఆమె వంటిపైన చేయివేస్తాడు! దాంతో ఆమె ఈడ్చి చెంప పగలకొడుతుంది. కుండ పగిలింది. వట్టి చేతుల్తో ఇంట్లోకి వెళ్ళి మామ రాముడికీ, భర్త చిదంబరానికీ ఈ విషయం చెబితే మామ ఊరి వాళ్ళకు భయపడి "ఎవుళ్ళకర్మ కెవుళ్ళు కర్తలు? మజ్జలో మనం వేంది జేసేది?" అని కోడలి నోరు మూయిస్తాడు.

ఊర్లో నాంచారమ్మ ఎద్దుచచ్చిపోతే రాముడు ఆ ఎద్దుని తీసుకువచ్చి తోలు వలచి నిన్ననే పల్లె సమీపంలో వేపచెట్టు కింద దట్టేన్ని వదిలేసివచ్చాడు. నాంచారయ్యకు ఇంటి మాదిగోడు రాముడైతే, రాముడికి నాంచారయ్య రైతు. కాబట్టి ఈపని రాముడే చేసుంటాడని నిర్ణయానికొస్తాడు మునసబు. అతనికి చిదంబరంపైన కసివుంది. రెండేళ్ళ క్రితం జరిగిన వేణుగోపాల స్వామి ఉత్సవంలో కనిపించిన ఒక దళిత యువతిని చూసి మనసుపడి ఆమెను పెండ్లాడీ కోరికను తీర్చమని ఎవరికీ తెలీకుండా అర్ధరాత్రివేళ గుడిలోకి జొరబడి కొబ్బరికాయ కొట్టి వచ్చాడు చిదంబరం. అతని కోరిక నెరవేరి ఆ అమ్మాయితోనే కొద్ది నెలల క్రితమే పెండ్లయింది చిదంబరానికి.

అంతేగాకుండా మునసబు భార్యతో బాటు బస్తీకి బయలుదేరి రైల్వేస్టేషన్ చేరుకుంటే అక్కడేవున్న చిదంబరం సిమెంట్ బెంచీపైన కూర్చొని పైకి లేవలేదు. దాంతో "వాళ్ళు పొగరెక్కిందా" అని కొట్టడానికి పోతే చిదంబరం భార్య అతన్ని అడ్డుకుంటుంది. అదొక కోపం. ఈ కారణాలవల్లా తండ్రీ కొడుకుల్ని వెట్టి వాళ్ళతో పట్టుకొచ్చి, గొడ్ల చావిట్లో గుంజలకు కట్టేసి రక్తగాయలై స్పృహ తప్పేటట్లు కొట్టి తన కసి తీర్చుకుంటాడు మునసబు. దాంతో ఊరి వాళ్ళకీ, పల్లె వాళ్ళకీ ఏం జరుగుతుందోనని భయాలు పట్టుకుంటాయి.

రెండు రోజులు నీళ్ళూ తిండీ లేకుండా అక్కడే వుండి పోతారు తండ్రీ కొడుకులు. దాంతో ఊరి ప్రజలు వారి కట్లు విప్పి, మునసబును మంచానికి ఏనుగు ముళ్ళతో కట్టేసి చేయి విరిచేసి, చావడికి నిప్పు పెట్టేస్తారు. మునసబు ఆసుపత్రి పాలై ఆ బావిని దళితులకే దత్తం చేస్తాడు. చివరికి విజయం లభించిన దళితులు ఏనుగుముళ్ళతో బావిలోకి దించి వున్న ఎద్దుదట్టాన్ని పైకి తీయడంలో విఫలమైతే, రాముడికోడలే దున్నల్ని బావి కాడికి తీసుకొచ్చి కాడికట్టి, మరో మోకుతాడుతో బావిలోకి దిగి దట్టెం క్రింది భాగానికి మోకు బిగించి, ఏనుగు ముడులు వేసి, పైకి వచ్చికాడికి మోకును బిగించి, దున్నల్ని తోలి, దట్టాన్ని పైకి తెప్పిస్తుంది. అంతలో మిగిలిన వాళ్ళు నిలువు కొయ్యల్ని బావికి తన్నించి, వాటి మీదుగా ఎద్దుదట్టాన్ని తీసి నేలపైన పడేస్తారు.

మునసబు మంచానికి బిగించిన తాళ్ళకున్న ఏనుగుముళ్ళను, దట్టేనికి బిగించిన చక్కని ఏనుగు ముళ్ళను చూసి, తమ గుడిసెలోని అటక మీద కనిపించకుండా పోయిన మోకు తాళ్ళను చూసి, ఈ విజయానికి కారణం తన భార్యేనని గ్రహించి సంతోషపడతాడు చిదంబరం.

ఇలా ఈ కథకు మూల బిందువు ఏనుగు ముళ్ళు వేసి, దట్టేన్ని బావిలోకి దించిన రాముడి కోడలు. ఆమె ఈ కథకు కథానాయిక, ఈ కథలో ఆమె ధైర్యం, సాహసం, గంభీరమైన వ్యక్తిత్వం పాఠకుడిని ఆశ్చర్యపరుస్తాయి. అంతకుమించి ఆమెలో వున్న అన్యాయాన్ని ఎదుర్కొవాలన్న తెగువ, ఉరకలెత్తిన నూతన చైతన్యం ఆనందింపచేస్తాయి. ఔరా అనిపిస్తాయి.

**ఊరబావి చారిత్రక సామాజిక విశ్లేషణ**

ఈ కథ తరాల తరబడి అణచివేయబడివున్న దళితుల్లో రావాల్సిన చైతన్యాన్ని తెలియజేస్తుంది. అలా ఈ కథ ఒక గొప్ప సామాజిక ప్రయోజనాన్ని సాధించింది. అయితే ఈ దేశంలో ఎన్నో పల్లెల్లో నీటికోసం దళితులు పడే బాధలు ఈ కథలోలా నెరవేరక పోయి వుండవచ్చు. కానీ అరుదుగానైనా విజయాన్ని సాధించినట్లు చరిత్రలో కొన్ని సంఘటనలయినా జరక్కపోలేదు. ఈ సందర్భంగా అలాంటి ఓ గొప్ప సంఘటనని గుర్తుకు తెచ్చుకుని విశ్లేషించుకోవాల్సిన అవసరం ఎంతయినా వుంది. ఆ సంఘటనే అంబేద్కర్ ముందుండి నడిపిన **'చౌదర్ చెరువు' ఉదంతం**



ఈ ఉదంతం చరిత్రలోనే అపూర్వమైంది. అరుదయింది. ఇది బి.ఆర్. అంబేద్కర్ ప్రత్యక్షంగా పాల్గొని నడిపించిన మొదటి పోరాటం.

మహారాష్ట్రలో ఒక మారుమూల, కొలాబా జిల్లాలో వున్న గ్రామం మహద్. ఈ ఉదంతానికి అదే రంగభూమి. వర్ణాశ్రమ ధర్మాలే సర్వస్వంగా భావించే హిందూమతంలో, కొన్ని కులాలవారు అస్పృలుగా ముద్రపడి సంఘ బాహ్యతగా జీవిస్తున్నారు. వాళ్ళు ఊళ్ళో కిరాకూడదు. మంచి బట్ట కట్టకూడదు. సవర్ణులను కలవకూడదు. చివరికి సవర్ణులు నడిచే దారిలో సైతం నడవకూడదు. ఒకవేళ తప్పని సరై నడవాల్సి వస్తే, వారు ఎంగిలి నేలపైన ఉమ్మకుండా మెడలో ఒక కుండను కట్టుకొని దాంట్లో ఉంచుకోవాలి. వారు నడిచిన పాదాల గుర్తులు చెరిగిపోయే విధంగా నడుముకు ఒక తాటి మట్టను తాడుతో కట్టుకొని అదినేల పైన జీరాడుతూ అతని అడుగుల్ని చెరిపేసే విధంగా అమర్చుకుని నడవాలి. లేకుంటే భూమాత మైలైపోతుంది. ఇలాంటి దారుణమైన సంప్రదాయాలు మరీ ఎక్కువగా వున్న గ్రామం మహద్.

ఆ ఊరికి నీటి కొరత లేదు. సమృద్ధిగా బావులూ, చెరువులూ వున్నాయి. కానీ దళితులు వాటిలో నీళ్ళు తెచ్చుకోకూడదు. ఈనేపథ్యంలో వివిధ దళిత జాతులవారు ఒక మహాసభను ఆ ఊర్లో జరపాలనుకుంటారు. అయితే కొన్ని వేలమంది హాజరయ్యే ఈ సభకు నీటి వసతి కోసం ఆ గ్రామ మునిసిపాలిటీ అధ్వర్యంలో వున్న ఒకచెరువుకు సమీపంలో ఆ సభ జరపాలనుకుంటారు. రెండు రోజులు జరిగే ఆ సభల కోసం అంబేద్కర్ వాళ్ళని చాలా ఉత్తేజపరుస్తాడు. గ్రామ సవర్ణులు వెంటనే ఆ సభల్ని ఆపలేకపోతారు. చివరికి అంబేద్కర్ ఆధ్వర్యంలో అక్కడ సభలు జరుగుతాయి. అవి 1927లో మార్చి 19,20 తేదీల్లో జరిగిన సభలు. అయితే ఇది సహించలేని సవర్ణులు ఏకమై సభానంతరం ఆయుధాలతో వచ్చి వాళ్ళ ఆహారపదార్థాలను నేలపాలు చేసి చితకకొడతారు. దళితులు అక్కడినుంచీ చెల్లాచెదురైపోయి పరిగెత్తి ప్రాణాలు కాపాడుకుంటారు. ఆపైన సవర్ణులు ఆ చెరువుకు శుద్ధి కార్యక్రమాలు జరుపుకుంటారు.

ఈ సంఘటన దేశ మేధావుల్ని కదిలించింది. ఆలోచనల్లో పడవేసింది. ముఖ్యంగా రచయితల్ని, కళాకారుల్ని మరింత కలచివేసింది.

**చౌదర్ చెరువు ఉదంతం - ఊరబావి కథ - ఈనాటికి వున్న రిలవెన్సీ :**

అయితే ఊరబావికి, చౌదర్ చెరువుకూ ఏమీ సంబంధం లేకపోవచ్చు, మనకథకీ, ఆ సంఘటనకీ ఎలాంటి లింకూలేకపోవచ్చు. కానీ రెండిటిలోను సమస్య ఒకటే. నీటి సమస్య, అస్పృశ్యతా సమస్య, దళితుల అణచివేతకు సంబంధించిన సమస్య. అందుకే చౌదర్ చెరువు ఉదంతాన్ని పోలిన నీటి చుట్టూ సాగిన దళిత సమస్య ఊరబావిలోనూ వుంది. కాకపోతే అక్కడ చెరువు, ఇక్కడ బావి అంతే.

అయితే మొదట చెప్పిన నేపథ్య ప్రభావం గాని, ఈ ఉదంత ప్రభావం గానీ రచయితపైన ఉండవచ్చు, లేకపోవచ్చు. ఈ కథ రాసే నాటికి ఈ సంఘటన గురించి రచయితకి తెలియకపోయి కూడా వుండవచ్చు. ఎందుకంటే చౌదర్ చెరువు ఉందంతం జరిగిన కాలానికీ ఈ కథ ముద్రించిన తేదీ (ఆంధ్రప్రభ - వారపత్రిక 2-7-69-9-7-69)కి ఎడం దాదాపు 41 సంవత్సరాల పైన వుంది. అంత మాత్రాన రచయితను తక్కువ చేయడానికి ఈ విషయం రాయటం లేదు. ఆధునిక సాహిత్యమంతా నేటి సామాజిక నేపథ్యంతోను ప్రభావంతోను వెలువడుతున్నదే. కాబట్టి విమర్శకులు, పాఠకులు నేటి సాహిత్యానికీ, సమకాలీన సంఘటనలకీ, అంశాలకీ వున్న సంబంధాన్ని (relevancy) గూర్చి పరిశీలించడం జరుగుతుంది. ఈ relevaneyని నిరూపించడం వల్లా ఆయా సాహిత్యాలకి సర్వకాలికత, సర్వ జనీనత తప్పక వస్తాయని భావించడంలో తప్పులేదనుకుంటాను. అందుకోసమే ఈ చర్చంతా.

ఈ విధంగా ఆలోచించినప్పుడు ఆనాటి దళితుల సమస్యకీ, ఈనాటి దళితుల సమస్యకీ పరిష్కారం లభించిందా? వారి బాధలు తీరాయా? వారి అణచివేతలో అగౌరవ పరిచే సవర్ణుల భావజాలంలో ఏమైనా మార్పు వచ్చిందా ? ఆకులాలకి అస్పృశ్యత తొలగి పోయిందా? అంటే లేదనే కదా సమాధానం. 1927 నాటి చౌదర్ చెరువు ఉదంత కాలం నాటికీ, 1969లో రాసిన ఊరబావి కథా కాలం నాటికీ ఆ మాటకొస్తే ఈనాటికీ అస్పృశ్యత అలాగే వుంది. అస్పృశ్యత పాటించని వారిలా నటించే సవర్ణుల కపట నాగరికత, దళితుల వేషభాషల్లో వచ్చిన కృత్రిమ మార్పు తప్ప అస్పృశ్యత అలాగే వుంది. ఈ అస్పృశ్య తా పిశాచం ఈ హిందూ సమాజం నుంచీ తొలగిపోయేంత వరకూ ఊరబావికథకి, నీటి సమాజానికీ relevency వుండనే వుంటుంది. ఎప్పుడైతే సవర్ణుల హృదయాల్లో నుంచీ, ఈ దేశంలోని సమాజం



# ఉమర్ అలీషా 'చంద్రగుప్త' నాటకంలో దేశభక్తి

షేక్ రియాజుద్దీన్ అహ్మద్

తెలుగు సాహిత్య వికాసానికి ఎందరో కవులు కృషి చేశారు. మరికొందరు చేస్తూనే ఉన్నారు. ఆంధ్రదేశంలోని ముస్లిములు తమ మాతృభాష ఉర్దూ అయినప్పటికీ ప్రాంతీయ భాషయైన తెలుగులో ప్రావీణ్యం సంపాదించి తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియలలో రచనలు చేస్తున్న కవులు అనేకులు ఉన్నారు. అందుకు సాక్ష్యాధారం డా. షేక్ మస్తాన్ 'తెలుగు సాహిత్యం : ముస్లింల సేవ" అనే పరిశోధక సిద్ధాంత గ్రంథం. ఉమర్ అలీషా, షేక్ దావూద్, షేక్ ఫరీద్, ఎ.సి. దస్తగిరి, సమద్, జవ్వాది హుసేన్ ఇత్యాదులే కాక మరెందరో ముస్లింలు తెలుగులో రచనలు చేశారు.

శ్రీనాధుడు భీమేశ్వర పురాణంలో వర్ణించిన పిఠాపురం, అలీషా జన్మస్థలం. చాంద్‌బీబీ, మొహియుద్దీన్ బాద్‌షాలకు 1885 సం॥లో జన్మించారు. వీరి ప్రతిభా పాండిత్యాలను గుర్తించి 1936 సం॥లో 'ఇంటర్ నేషనల్ అకాడమీ ఆఫ్ అమెరికా' వారు డాక్టర్ ఆఫ్ లిటరేచర్' అన్న గౌరవ పట్టానిచ్చి సత్కరించారు. సాహిత్యంలోనూ, రాజకీయ జీవితంలోనూ ప్రావీణ్యం సంపదించారు. 1916 సం॥లో రాజకీయ రంగంలో ప్రవేశించి కాంగ్రెస్ సభ్యులుగా 1930 సం॥ వరకు కొనసాగారు. తర్వాత 1934 సం॥లో అఖిల భారత శాసన సభ్యులుగా స్థానాన్ని సంపాదించి దేశ సేవ, భాషా సేవ చేశారు.

ఉమర్ అలీషా వివిధ ప్రక్రియలకు సంబంధించిన కావ్యాలు, అనువాదాలు, గేయాలు, నాటకాలు, కథలు, వ్యాసాలు, నవలలు సుమారు యాభై వరకు రచనలు గావించినట్లుగా వారు రచించిన 'చంద్రగుప్త' నాటకం (1955) పీఠికలో పేర్కొనబడింది. ఈ నాటకాన్ని 1910వ సం॥లో నాటక లక్షణాలను పాటించి రచన చేశారు. ఇది ఆరంకాల నాటకం. అంకాలను రంగాలుగా విభజించారు. చరిత్రలో ప్రసిద్ధి వహించిన మౌర్య వంశస్థాపకుడు చంద్రగుప్తుడు మహా పద్మనందుడి కపటోపాయాలతో కోల్పోయిన మగధ సామ్రాజ్యాన్ని తిరిగి పొందడమే ఇందులో చిత్రించబడింది.

ఇతివృత్తాలాధారంగా వారు రచించిన నాటకాలను మూడు విధాలుగా పౌరాణికాలని, చారిత్రకాలని, పౌరాణిక, సాంఘిక సంఘటనల సమ్మిళితంగా రచించిన నాటకాలను మిశ్రమ నాటకాలుగా పేర్కొనవచ్చు.

ఉమర్ అలీషా పాఠకులలో దేశభక్తిని పెంచాలన్న ఉద్దేశ్యంతో 'చంద్రగుప్త' నాటకాన్ని రచించారు. భారతదేశం అనేక మతాలకు, భిన్న సంస్కృతులకు, పలు భాషలకు నిలయమైనప్పటికీ ప్రజలంతా కలసి ఒక్కటిగా జీవించడం మెచ్చుకోదగ్గ అంశం. భిన్నత్వంలో ఏకత్వాన్ని చాటిచెప్తుంది మన భారతదేశ సంస్కృతి అందుకు ప్రజలలో అంతర్గతంగా దాగి ఉన్న జాతీయభావమే కారణం మాతృదేశాభిమానంతో వారు ఈ నాటక రచన చేసి తమ వంతు కర్తవ్యాన్ని తీర్చినట్లు తెలుస్తుంది. దేశభక్తిని ప్రబోధించే సన్నివేశాలు నాటకంలో చోటు చేసుకున్నాయి.

విదేశీయుడైన సెల్యూకస్ పద్మనందుడితో స్నేహం చేసి భారతదేశాన్ని కొల్లగొట్టాలనే కోరికతో వచ్చి భారతదేశ ఔన్నత్యాన్ని క్రింది పద్యం ద్వారా చాటి చెప్పారు–

"ఏ మహారాజ్ఞికి హిమవన్నగంబులు
కులగిరుల్ పెట్టని కోటలౌక్కొ
ఏ లతాతన్వికి హిందు గంగానదుల్
దరిలేని మంచి ముత్యాల సరులౌ

ఏ సరోజాస్యకు నా సింహళద్వీప
మత్యంత రత్న సింహాసనంబొ
ఏ రమారమణికి భారత యోధులఁ
గాళిదాసాదులఁ గన్న కడుపొ
అట్టి సుగుణ రత్నాకరమై జగాన
నసదృశ విలాసినిగ నలరారు చుండు
భరత వర్ష వధూటినిఁ బడయ వలయు
సమరభూమి రాజుల సంహరించి

వేరొక సన్నివేశంలో గ్రహాలన్నింటిలో సూర్యుడు ఎంతటి శక్తిమంతుడో దేశాలలో హిందూదేశం అంతటి శక్తివంతమైందని సెల్యూకస్ పేర్కొన్నాడు.

భూలలనా గళంబున నిభూషితమైన విదేశ రత్నహా
రాళిని ముత్యమట్టులలరారెడు భారత వర్షమిందుతోఁ
బోలునె రోమకాది వరభూములు? దీనికి రత్న గర్భయం
చోలి వచించు పల్కు దగియుండెడు
నెంతయునీ ధరాస్థలిన్

విదేశీయుని ముఖంగా మన భారతదేశ ఔన్నత్యాన్ని చెప్పించటం రచయితకు తన దేశంపై గల భక్తి ప్రపత్తులే కారణమని చెప్పక తప్పదు. వ్యక్తి యొక్క ముఖ్యమైన విధులను క్రింది విధంగా వెల్లడించారు.



మనుజుండు రెండు పనులనె
యొనరింపఁగ వలయు ధర్మమొక్కటి మఱియున్
జననియగు జన్మభూమికి
ననుకూలుండగుట యిడుమలలవడుచున్నన్ !

మనుష్యుడు ధర్మాన్ని పాటించడం ప్రథమ కర్తవ్యమని, జన్మ భూమిని ప్రేమించటం ద్వితీయ కర్తవ్యమని అనటంలో భారత దేశీయతను తెలియజేస్తున్నాయి. ఇలా పాఠకులలో దేశభక్తి భావం పెంపొంది తమ కర్తవ్యం అవగతమౌతుంది..

మహాపద్మనందుడు సెల్యూకస్‌తో స్నేహం చేయగా చంద్రగుప్తుడు పద్మనందుణ్ణి దూషించడంలో భారతీయుల శక్తి సామర్థ్యాలు తెలుస్తాయి.

స్వచ్ఛమైన భారతవంశ సంజాతుఁడ
వైన క్షత్రియుండవైన నీకు
గ్రీసు దొరలకు సహవాసమేటికి పెద్ద
పులికి నక్క చెలిమి గలిగినట్లు

భారతీయుణ్ణి పెద్ద పులిగాను, విదేశీయుడైన సెల్యూకస్‌ను నక్కగానూ చిత్రించడం జరిగింది.

మహాపద్మనందుడు సెల్యూకస్‌తో కలిసి చంద్రగుప్తుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి కావించగా భారతీయ వనితలు హిందూ రాజ్యలక్ష్మికి కలిగిన దుస్థితికి చింతిస్తూ 'తులసివనంలో గంజాయి మొక్క మొలసినట్లు' పద్మనందుడి జన్మకు వాపోతూ....

జననిరో ! మున్ను నీ గర్భవనమునందు
బయలుదేరెడు పుష్పముల్ పరిమళంబు
గలవియని పేరు వచ్చెనుగాని యెపుడు
వట్టి దుర్గంధ కుసుమంబు పుట్టలేదు

అని చింతించారు.

యుద్ధ రంగంలో స్వదేశరాజులు ప్రాణాలు కోల్పోతుండగా స్త్రీలకు మానభంగం కలుగుతుందనే భయంతో వారు అగ్ని దేవుడికి ప్రాణాలు అర్పించడానికి సంసిద్ధులై...

లెక్కింపగా రాని పెక్కేడు లీరీతి
గన్న బిడ్డల వలె గ్రాచినావు
చెక్కు చెదరకుండ స్నిగ్ధ సౌధయుల
నుయ్యేలలను బెట్టి యూఁచినావు
ఆరామసీమల నలఘు వైభవములఁ
దేలించి వన్నెలు దిద్దినావు
కలిమిలేముల కవకాశమియ్యఁగనీక
యెల్ల రాజ్య సుఖంబు లిచ్చినావు
తల్లి ! భారత వర్ష వధూమ తల్లి నిన్ను
వీడి ఘోరాగ్నిలోఁ బడి వెడలు చుంటి
మిదిగొ జోహారు గైకొను మింక మీఁద
నమ్ము నీ పుత్రికలమని మఱచిపొమ్ము

అని రోదించటం భారతీయుల యెడ ఎంతటి మాతృత్వాన్ని ప్రసాదించిందో వెల్లడౌతుంది. ఈ ఘట్టంలోనే కొందరు స్త్రీలు తమ మానాన్ని కాపాడుకోవడానికై అగ్నిలో దూకి మరణి,ంచటం కంటే యుద్ధంలో తమ పతులకు తోడుగా యుద్ధం చేయటం ధర్మమంటూ...

పతికి సహధర్మచారిణి పడఁతి యగుట
కుడిచి యింటఁ గూర్చుండుట కొఱకొలేక
కష్టములు పంచుకొనుటకో కాంతలార!
యగ్నిఁబడనేల యుద్ధాన కరుగరాదె

అని రణరంగానికి వెళ్లటానికి సంసిద్ధులు కావటం భారతీయ నారీమణుల ధైర్య స్థైర్యాలు వ్యక్తమౌతాయి. సమయం ఆసన్నమైనప్పుడు స్త్రీలు సైతం దేశరక్షణకై ప్రాణాలొడ్డడానికి సిద్ధపడాలని, పురాణ ప్రసిద్ధులైన సత్యభామ తదితరుల శక్తి సామర్థ్యాలను స్మరిస్తూ యుద్ధానికి సిద్ధమవటం వారి ధైర్యస్థైర్యాలకు తార్కాణం ఈ విషయం శోణోత్తర వసంతికి సంభాషణ ద్వారా తెలుస్తుంది.

నరకున్ద్రుంచెను సత్యభామ శరముల్ నాటించి

# మేల్కోండి!!

పి. విజయశాంతి
8106613727

ఓ అనాధ బిడ్డల్లారా ఎందుకు భయం
సమాజాన్ని దోచుకుతినే వారికి లేని భయం మీకెందుకు
వీధిలోని అడుక్కుని తెచ్చుకున్న అన్నం
జులాయి కుక్కలాక్కెల్లిందని భయమా
యజమానుల దౌర్జన్యానికి హోటల్లో
కప్పులు కడగలేమని భయమా
విగత జీవుల్లారా! అనాధ పాపల్లారా!
నే చెప్పేది వినండి, వినండి!
దేశం కోసం పోరాడి ప్రాణాలు కోల్పోయిన
మహావీరుల స్ఫూర్తితో ముందుకు నడవండి
సమాజాన్ని పట్టి పీడిస్తున్న విషపురుగులను
కాల్చే కార్చిచ్చుల కావాలి మీరు



మీ జ్వాలల్లో దోపిడిదారులు బూడిద కావాలి
దుష్ట సమాజాన్ని నిర్మూలించాలి
సమసమాజ స్థాపకులు కండి
పెత్తందార్ల చేతుల్లో బలికాకముందే మేల్కొండి
పురుషాధిక్యంతో బలి అవుతున్న
నేటి స్త్రీ సమాజాన్ని కాపాడండి
అవినీతి, కుంభకోణం దుర్మార్గపు
రాజకీయ కుట్రలను కూల్చండి
ప్రశ్న మీరైతే! జవాబు సమాజం కావాలి
ప్రజ్వలించే ప్రకాశంతో, ఉజ్వలించే ఉత్తేజంతో
మీదారిలో అడ్డొచ్చిన వారిని ఎదుర్కోండి
మీరెవరని ఎవరన్నా అడిగితే అనాధ బిడ్డలం
అని ధైర్యంగా చెప్పండి!

---

యమ్మాహిషా

సురుమర్దించెను బార్వతీసతి ధరన్ సుశ్లోకులై యెందుఱో
తరుణుల్ యుద్ధములాచరించి గుణదోర్దర్పంబుతో దేశమున్
గరమున్ గాచి కృతజ్ఞులై వెలయరే కాంక్షించిరే ప్రాణముల్

ఇక్కడ భారతనారీమణి వ్యక్తిత్వం ద్యోతకమౌతుంది.

న్యాయానికి, ధర్మానికి మించిన అస్త్రశస్త్రాలు మృగ్యమని ఉమర్ అలీషా గారు తెలియజేయటం ద్వారా నైతిక విలువలకు కూడా ప్రాధాన్యమిచ్చినట్లు వ్యక్తమౌతుంది. చంద్రగుప్తుడు రాజ్యం కోల్పోయి చాణక్యాశ్రమం చేరుతాడు. శోణోత్తర చంద్రగుప్తుని యోగక్షేమాలును గూర్చి వసంతిక ద్వారా తెలుసుకొని ఆనందపడుతుంది. కానీ వసంతిక శోణోత్తరతో చంద్రగుప్తుడు నిరాయుధుడు రాజ్యాన్ని ఎలా పొందగలుగుతాడు అన్న ప్రశ్నకు సమాధానంగా శోణోత్తర క్రింది విధంగా...

ప్రజల రక్షించి దేశంబు పండుకొఱకు
భూమిఁ బ్రాణార్థములు ధారపోయువారి
కస్త్రశస్త్రంబు లేటికి ? న్యాయమొకటె
చాలు శివపూజకును భక్తి చాలినట్లె

అని తెలుపుతుంది.

చంద్రగుప్త నాటకం చివరలో సెల్యూకస్ తన కుమార్తె శోణోత్తర కోరిక మేరకు చంద్రగుప్తునికిచ్చి పెళ్ళి చేయడానికి మెగస్తనీసును చంద్రగుప్తుడి వద్దకు పంపగా, మెగస్తనీసు చంద్రగుప్తునితో విషయం తెలిపినపుడు చంద్రగుప్తుడు మౌనం వహిస్తాడు. అపుడు మెగస్తనీసు చంద్రగుప్తునితో "ఓరీ పార్థివేంద్రా ! నీవు యోచించునదే నెఱుంగుదును. ఈ సెల్యూకస్ ప్రభువరుఁడు కులీనుఁడు. గ్రీస్ ఆర్యుల సంతతివాఁడు. నీవును ఆర్య సంతతికి వేఱుగావు. ఆర్యులన నీరాను దేశవాసులు. ఆ దేశమొకప్పుడు క్షామ పీడితయై యుండ బ్రజలు వికావికలై నానా దేశముల కేఁగి నివాసము లేర్పఱచుకొని నాగరికతను నాటి యా యా ఖండములకు వన్నె దెచ్చిరి. కావునఁ జరిత్రాంశములను బట్టి చూడ మీకు c బూర్వసంబంధము సంపూర్ణముగాఁ గలదు. అదిగాక బహుకాల నివాసమేర్పఱచుకొని యున్న మేమందఱము భారతీయులమనుట నిర్వివాదాంశము. కావున మూఢాచారములను జోనాడి జాతీయ విజ్ఞానముఁ బ్రసన్న బుద్ధిని. సమాధాన పఱచి యీ పెండ్లికి నీవవశ్యము నియ్యకొనుము" అని సాంగత్యాన్ని ఏర్పరచటం ఉమర్ అలీషా గారి లోకజ్ఞానంతో పాటు జాతీయ సమైక్యతకు పాటు పడినట్లు వ్యక్తమౌతుంది. పరదేశీయులైనప్పటికీ భారతావనిలో ఎందరో నివసిస్తున్నారు. పూర్వీకులు విదేశీయులు కావచ్చు లేదా స్వదేశీయులైన కారణాంతరాల వల్ల పరధర్మాన్ని పాటించి ఉండవచ్చు. అయినప్పటికీ పూర్వీకుల నుంచి వస్తున్న ధర్మాలను పాటిస్తూ భారతదేశంలో నివసిస్తున్నారు. బహుకాలంగా భారతదేశంలో నివసించటం వల్ల వారు భారతీయులే అనే విషయాన్ని తెలియజేయడం వారి జాతీయభావనకు దృష్టాంతం.

దేశ సేవకు, తెలుగు భాషకు విశిష్ట సేవలందించిన వీరు తమ శిష్యులకు దర్శనభాగ్యం కల్గించడానికి నరసాపురానికి వెళ్ళి 24వ తేదీ జనవరి 1945న తుది శ్వాస విడిచారు. వీరు స్వర్గస్థులయ్యే నాటికి ఐదుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు, పెక్కురు పౌత్ర పౌత్రికలు కలరు.

**వ్యాసకర్త ఫోన్: 9441983007**

# పీడిత జన పక్షపాతి హంగల్



సింహాద్రి సరోజిని

అవతార్ కిషన్ హంగల్ జీవితం ఒక సినిమాకంటే కూడా ఎంతో ఆసక్తిని రేకెత్తిస్తుంది. ఆయన తుది శ్వాస విడిచే వరకూ పేదలు, పీడిత ప్రజల పక్షాన నిలిచారు. వామపక్షవాదిగా తాను నమ్మిన సిద్ధాంతాల కోసం కడదాకా నిలిచారు. మతతత్వాన్ని ఎంతో ధైర్యంతో ఎదుర్కొన్నారు. భారతీయ సాంస్కృతిక రంగంపై మరువలేని ముద్ర వేసిన ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ (ఇప్టా) వ్యవస్థాపకుల్లో హంగల్ ఒకరు. అనారోగ్యంతో ఉన్నప్పటికీ తన అంతిమ ఘడియల్లో కూడా ఆయన అందులో కొనసాగారు.

హంగల్ విద్యార్థిగా ఉన్నప్పుడే స్వాతంత్ర్య పోరాటంలో దూకారు. 1929 నుంచి 1947 వరకూ భారత స్వాతంత్ర్య పోరాటంలో చురుకుగా పాల్గొన్నారు. 1936లో పెషావర్‌లోని శ్రీ సంగీత ప్రియ మండల్‌లో చేరారు. దేశ విభజనకు ముందు పాకిస్తాన్‌లో 1946 వరకూ నాటకాల్లో అనేక పాత్రలు పోషించారు. కేవలం కమ్యూనిస్టు అన్న కారణంతో కరాచీలో 1947 నుంచి 1949 వరకూ హంగల్‌ను జైలులో ఉంచారు. తరువాత కళలు, థియేటర్ రంగంలో అడుగిడినప్పటికీ కమ్యూనిస్టు పార్టీతో తన సంబంధాలను తెంచుకోవడం గానీ, పార్టీకి దూరం కావడం కానీ చేయలేదు. తన దేశభక్తికి ఒక నిదర్శనంగా హంగాల్ ఏటా తన పుట్టిన రోజును ఆగష్టు 15న జరుపుకుంటారు. ప్రజాతంత్ర విలువలపట్ల ఆయన చూపిన విశ్వాసం మూలంగా మతతత్వ శక్తుల నుంచి మౌఖికంగా వ్యతిరేకతను మాత్రమే గాక భౌతిక దాడులను కూడా ఎదుర్కోవలసి వచ్చింది. 1993-94లో శివసేన విషపూరిత ప్రచారంతో పాటు ఆయనను బాయ్‌కాట్ చేయాలనే ప్రచారాన్ని కూడా సాగించింది. తన గూండాల సహాయంతో ఆయన సినిమాలను ముంబయిలో మాత్రమే గాక మహారాష్ట్ర అంతటా నిలిపివేయించింది. అయితే ఇవన్నీ ఆయన్ను వీసమెత్తు కూడా కదల్చలేకపోయాయి.

ఎకె హంగల్ దేశ విభజనకు ముందు సియాల్‌కోట్‌కు చెందిన ఒక కాశ్మీరీ పండిట్ కుటుంబంలో 1917, ఫిబ్రవరి 1న జన్మించారు. ఆయన తండ్రి పండిట్ హరికిషన్ హంగల్. ఆయన తన విద్యాభ్యాసాన్ని పెషావర్‌లో సాగించారు. అనంతరం కరాచీకి వెళ్ళారు. భగత్‌సింగ్ లాహోర్‌లో చురుగ్గా కార్యకలాపాలు సాగిస్తున్న కాలంలో ఆయన పెషావర్‌లో పాఠశాల విద్యార్థిగా ఉన్నారు. 'నేను ఒక నటునిగా మీ ముందు నిలబడలేదు. మీలో ఒకనిగా మాత్రమే ఉన్నాను. నేను సినిమా నటుడు కావడానికి చాలా ముందే ట్రేడ్ యూనియన్ కార్మికుణ్ణి, కమ్యూనిస్టును. దేశ విభజనకు ముందు నేను కరాచీలో ఒక దర్జీ దుకాణంలో పని చేసేవాణ్ణి. కరాచీ టైలరింగ్ వర్కర్స్ యూనియన్‌కు నేను వ్యవస్థాపక సభ్యుణ్ణి, ఆర్గనైజర్‌ను. వారాంతపు సెలవు, 15 రోజుల సెలవు, షాప్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్ చట్టాన్ని అమలు చేయాలని మేము డిమాండ్ చేసేవాళ్ళం. ఈ డిమాండ్లపై మేము ఒకరోజు సమ్మె కూడా చేశాము. దాంతో నామీద కక్ష సాధింపుతో ఉద్యోగం నుంచి తీసేశారు' అని భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్ బలిదానం చేసిన 75వ వార్షికోత్సవం సందర్భంగా జరిగిన సభలో ప్రసంగిస్తూ చెప్పారు. ఈ సందర్భంగా వామపక్ష, లౌకిక పురోగామి విలువల కోసం జీవితాంతం నికరంగా నిలిచినందుకు హంగల్‌ను సన్మానించారు.

హంగల్ చాలా నిరాడంబర జీవితం గడిపారు. అదే సమయంలో చాలా ముక్కుసూటిగా ఉండేవారు. ఒక్క గదిలో ఆయన జీవించారు.

### హంగల్ సినీ జీవితం

పెషావర్‌లోనే ఆయన థియేటర్‌లో అనేక ప్రముఖ పాత్రలో పోషించారు. ఆయన తండ్రి ఉద్యోగ విరమణ చేయడంతో వారి కుటుంబం పెషావర్ నుంచి కరాచీకి మారింది. దేశ విభజన అనంతరం 1949లో ఆయన బొంబాయికి వచ్చారు. విభజన అనంతరం ఆయన మూడేళ్ళపాటు జైలు జీవితం గడిపారు. ఇప్టాలో బల్‌రాజ్ సహానీ, కైఫీ అజ్మీతో కలిసి పనిచేశారు. 1949 నుంచి 1965 వరకూ భారత్‌లో అనేక థియేటర్ నాటకాల్లో నటించారు. హంగల్ 50 ఏళ్ళ వయస్సులో హిందీ చిత్ర రంగంలో ప్రవేశించారు. 1966లో వచ్చిన బాసు భట్టాచార్య 'తీస్రీ మంజిల్' ఆయన మొదటి సినిమా. నమక్ హరామ్, షౌకీన్, అవతార్, అర్జున్, ఆంధీ, తపస్యా, కోరా కాగజ్, బావర్చీ, ఛుపా రుస్తుమ్, చిత్‌చోర్, బాలికా బధు, గుడ్డీ, నరమ్ గరమ్ వంటి చిత్రాల్లోని హంగల్ పోషించిన పాత్రలు అత్యుత్తమమైనవిగా పరిగణించబడ్డాయి. ఆయన లెక్కలేనన్ని హిందీ చిత్రాల్లో తత్వ చింతనతో కూడిన, అణచివేతకు గురైన వృద్ధుని పాత్రలు పోషించారు. షోలే, షౌకీన్ చిత్రాల్లో నటించిన పాత్రలు ఆయనకు అత్యంత ప్రీతిపాత్రమైనవి. ఆయన పెద్ద సంఖ్యలో క్యారెక్టర్ ఆర్టిస్టు పాత్రలు పోషించారు. ప్రముఖ నాయకీనాయకులకు మమతానురాగాలు పంచే తండ్రిగా, బాబాయిగా, బంధువుగా, విశ్వాసపాత్రుడైన నౌకరుగా అనేక విభిన్నమైన పాత్రలు పోషించారు. రాజేష్ ఖన్నాతో కలిసి ఆప్‌కీ కసమ్, అమర్ దీప్, నౌక్రీ, ప్రేమ బంధన్, థోడీసీ బేవఫాయీ వంటి 16 చిత్రాల్లో నటించారు. లాయర్, డాక్టర్ పాత్రలను కూడా ఆయన నిర్వహించారు. వాటిలో అత్యధికం పాజిటివ్ పాత్రలే కావడం గమనార్హం. మంజిల్, ప్రేమ్ బంధన్ వంటి ప్రముఖ చిత్రాల్లో హంగల్ నటించిన ప్రతినాయకుని పాత్రలు కూడా ప్రాచుర్యం పొందాయి.

హంగల్ 2012, ఫిబ్రవరి 8న ఫ్యాషన్ డిజైనర్ రియాజ్ గంజీ కోసం చక్రాల కుర్చీలోనే రాంప్ వాక్ చేశారు. ఆయన చిట్టచివరిగా ఈ సంవత్సరం మే నెలలో టీవీ సిరీస్ మధుబాల - ఏక్ ఇష్క్ ఏక్ జునూన్‌లో నటించారు. భారతీయ సినిమాకు వందేళ్ళు నిండిన సందర్భంగా ఈ కార్యక్రమాన్ని ప్రసారం చేశారు. ఇంకా హంగల్ 2012, ఆగష్టు 3న విడుదలైన కృష్ణ ఔర్ కంస అనే యానిమేషన్ సినిమాలో ఉగ్రసేన్ మహారాజు పాత్రకు తన గళాన్నిచ్చారు. ఇదే ఆయన చివరి సినిమా. ఉగ్రసేన్ పాత్రకు ఆయన గళంలో పలికించిన భావాలకు సినీ విమర్శకుల నుంచి ఎన్నో ప్రశంసలు లభించాయి. దాదాపు ఐదు దశాబ్దాల హంగల్ సినీ జీవితంలో రెండు వందల వరకూ చిత్రాల్లో నటించారు. హిందీ సినిమాకు ఆయన అందించిన సేవలకు గాను 2006లో భారత ప్రభుత్వం ఆయనను పద్మ భూషణ్‌తో గౌరవించింది. ఈ అసమాన నటునికి అది మినహా ఇతరత్రా అవార్డులేవీ రాకపోవడం బాధకరం.

ఆయనకు ఒక కుమారుడున్నారు. తన భార్య మరణానంతరం ముంబాయిలోని శాంతాక్రజ్‌లోని తన ఫ్లాట్‌లో ఒంటరిగానే జీవించారు. హంగల్ కుమారుడు విజయ్ బాలీవుడ్‌లో స్టిల్ ఫొటోగ్రాఫర్‌గా పనిచేశారు.

రంగుల ప్రపంచంలో దాదాపు అర్ధ శతాబ్దం పాటు పనిచేసిన హంగల్ జీవిత చరమాంకంలో కడు పేదరికంలో గడపాల్సి వచ్చింది. ఆయన వైద్య ఖర్చులను అనేక చిత్రాల్లో ఆయనకు కుమార్తె పాత్ర పోషించిన జయా బచ్చన్, సల్మాన్ ఖాన్, మిధున్ చక్రవర్తి వంటి హిందీ నటులు సమకూర్చారు. జీవితాంతం అణగారిన వర్గాల ప్రజల పక్షాన నిలిచిన హంగల్‌కు జోహార్లు. ♦

కథ

# ముడతలు



**మూలం : హిందీ.. కుబేరదత్**

**అనువాదం : ఆర్. శాంతసుందరి**

ఆరోజు అర్ధరాత్రి సతీష్ స్టేషన్‌కి వెళ్ళాల్సి వచ్చింది. అతని స్నేహితుడొకడు వస్తుంటే రిసీవ్ చేసుకునేందుకు వెళ్ళాడు. మసక వెల్తురులో రోడ్ల మీద ఎన్నో దృశ్యాలూ, రంగులూ కనిపించాయి, కానీ ఎక్కువగా ఖాకీ రంగే కనిపించింది. ఆటోలనీ, టిప్పర్లనీ పోలీసులు ఆటకాయిస్తున్నారు. రోడ్డు మీద నడిచే వాళ్ళమీదా, స్టేషన్ నించి ఊళ్ళోకి వచ్చే ప్రయాణీకుల మీదా, కొజ్జాల మీదా, దొంగతనమే వృత్తిగా ఉన్నవాళ్ళ మీదా ఒక కన్ను వేసి ఉంచారు. కొన్ని ట్రక్కుల్ని ఆపి మామూళ్ళు వసూలు చేస్తున్నారు. చివరికి పాలమ్ముకునే వాళ్ళు కూడా పోలీసుల గుప్పిట్లో చిక్కుకున్నారు. సరే, ఇవన్నీ మామూలుగా అందరం చూస్తున్నాం, కానీ రైలు స్టేషన్ గేటు దగ్గర ఫ్లైఓవర్ కింద ఉలిక్కిపడేటట్టు చేసే దృశ్యాలు ఎన్నో కనిపించాయి.

ఆటోకి డబ్బు చెల్లించి ప్లాట్ ఫామ్ వైపుకి రెండడుగులు వేశాడో లేదో ఒక తాగుబోతు సతీష్‌కి అడ్డంగా వచ్చి నిలబడి, "ఏం కావాలి, సార్?" అని అడిగాడు. వాడు కావటానికి యువకుడే కాని, అనారోగ్యం వల్ల మధ్య వయస్కుడిలా కనిపించాడు. వాడి ప్రశ్న అర్థం అయ్యేందుకు సతీష్‌కి రెండు నిమిషాలు పట్టింది. అర్థమయ్యాక కోపం వచ్చింది. వాడికి జవాబు చెప్పకుండా ముందుకు కదిలాడు, కానీ ఆ తాగుబోతు అతన్ని వదల్లేదు. దారికడ్డంగా వచ్చి, "చాలా సూపర్ మాల్ సాబ్! మూడు వందలే.." అంటూ ఒకవైపు చూపించి, "అదిగో మాసిన గోడలతో స్టార్ కనిపిస్తోంది, దాని వెనకే.." అన్నాడు.

సతీష్‌కి చాలా ఇబ్బందనిపించి, అటూ ఇటూ చూశాడు. అక్కడ జనం అట్టే మంది లేరు. దగ్గర్లో పోలీసు గాని, చౌకీదార్ లాంటి మనిషి గాని లేడు. అతనికి భయం వేసింది. వీడు ఏ కత్తో చూపించి దోచుకునే రకం కాదు గదా! దగ్గర మూడు నాలుగు వందలు, వాచీ తప్ప ఏమీ లేవు. అయినా అన్నీ లాక్కున్నాక వీడు కత్తితో పొడవడని గ్యారంటీ ఏమిటీ? అని అనుకున్నాడు.

కాస్త ధైర్యం కూడగట్టుకుని, "నాకేం వద్దు.. పో ఇక్కణ్ణించి!" అన్నాడు. సతీష్ గట్టిగా అలా అనేసరికి ఆ తాగుబోతు భయపడి చీకట్లోకి పారిపోయాడు.

సతీష్ గబగబా ప్లాట్ ఫాం టికెట్ కౌంటర్ కేసి నడిచాడు. కిటికీ మూసి ఉంది. రెండు మూడుసార్లు తట్టాక కిటికీ తెరుచుకుంది. నిద్రమత్తులో ఉన్న ఓ వ్యక్తి సతీష్‌కి టికెట్ ఇచ్చాక, "మేమూ మనుషులమే సాబ్!" అనేసి గట్టిగా కిటికీ మళ్ళీ మూసేశాడు. ఈ దేశంలో ఎన్నో రకాల జయ జయధ్వానాలు జయ హింద్, జయ్ జవాన్, జయ్ కిసాన్ లాంటివి వినిపిస్తాయి, కానీ ఒక్కరూ జయ్ డ్యూటీ అనరే! ప్రతి మనిషీ తను చెయ్యవలసిన పని చేస్తే చాలు, దేశం ఏనాడో బాగుపడేది! అనుకున్నాడు సతీష్.

సరే, తన ప్లాట్ ఫాం చేరుకున్నాక రైలు అరగంట లేటు అని సతీష్‌కి తెలిసింది. అక్కడ జనం కూడా అట్టే లేరు. టీ కొట్టు వాళ్ళు తమ దుకాణాలని సర్దుకుంటున్నారు. ఒక ఖాళీ బెంచీ మీద కూర్చుని సతీష్ నింపాదిగా సిగరేట్ వెలిగించాడు. ఉన్న కొద్దిమందీ కునికిపాట్లు పడుతున్నారు. రైలు లేటని తెలిశాక ఇక మేలుకుని ఉండటం అనవసరమని అనుకున్నారేమో. సతీష్ పక్కన ఒక ముసలాయన కూర్చున్నాడు. మడతలు పెట్టిన వార్తా పత్రిక చదువుతున్నాడు. పేపరు చాలా పాతదిగా కనిపించింది. పేపర్ చదువుతూ చదువుతూ నిద్ర వచ్చి ఆయన తల వాలిపోతోంది. ఆ వెంటనే ఆయన మళ్ళీ సరిగా కూర్చుని పేపర్ చదివే ప్రయత్నం చెయ్యసాగాడు. ఐదు నిమిషాల కొకసారి ఇలా జరగటం చూసి సతీష్‌కి నవ్వొచ్చింది. అసలు ఈయన పేపర్ చదువుతున్నాడా, లేక దాని మడతల్లో ఎక్కడో దాక్కున్న తన గతాన్ని వెతుక్కుంటున్నాడా

అనిపించిందతనికి.

సతీష్ తల మరోవైపు తిప్పి చూశాడు. అక్కడ బెంచి పక్కనే ఒక స్తంభం కనిపించింది. అటు చూడగానే అతను నివ్వెరపోయాడు. ఆ స్తంభాన్ని ఆనుకుని ఒక నిరుపేద అమ్మాయి గొంతు క్కూర్చుని ఉంది. ఆమె ఎముకలపోగులా కనిపించింది. కళ్ళు మూసుకుని ఉంది. పెదవులు ఎండిపోయాయి. మొహం మీద ఈగలు ముసురుతున్నాయి. ఇక ఆమె కాళ్ళ కింద రక్తపుధార ప్రవహించి కొంతమేర వ్యాపించింది. ఆ పిల్ల జీవచ్ఛవంలా కదలక మెదలక అలాగే ఉండిపోయింది. బట్టలన్నీ చిరిగి పీలికలయ్యాయి. చింపిరి జుట్టూ, మట్టికొట్టుకున్న పాదాలు.. ఆ పిల్ల దగ్గర సంచీ కాని, ఏదైనా మూట గాని కనపడలేదు. మరైతే ప్రయాణీకురాలు కాదు... బిచ్చగత్తేమో! అనుకున్నాడు సతీష్



ఇంతలో ఒక పోలీసు ఆ పిల్ల పక్కనించి వెళ్తూ ఉన్నట్టుండి ఆగాడు. కాసేపు ఆమెని పరికించి చూసి, "ఎవరి పాపాన్ని మూట గట్టుకొస్తారో తెలీదు. దాన్ని వదిలించుకునేందుకు ఈచోటే దొరుకుతుంది!" అని విసుక్కున్నాడు.

పోలీసు అన్నమాటలు సతీష్‌కి వినబడ్డాయి. పాపం అందుకే కాబోలు అంత రక్తం కారిపోయింది. చచ్చిపోదు కదా! ఈమెకి సాయం చేసేందుకు ఎవరూ రారా? అనుకున్నాడు. వెంటనే అతని మనసు అతన్ని నిలదీసింది, "నువ్వే చెప్పు, నువ్వామెకి సాయం చెయ్యగలవా? తను చెయ్యలేనందుకు అతను నొచ్చుకున్నాడు. పోలీసు మాటలకి ముసలాయన కూడా ఉలిక్కిపడి లేచాడు. పేపర్ తీసి చదవబోయి, తలతిప్పి చూశాడు. కళ్ళజోడు తీసి, అద్దాలు తుడిచి మళ్ళీ పెట్టుకుని ఆ అమ్మాయికేసి పరీక్షగా చూశాడు. నలిగిపోయి ముడతలు పడ్డ పేపర్లోని వార్తలు చూసినట్టే ఆ పిల్లనీ చూశాడు. నిస్పృహగా ఒక నిట్టూర్పు విడిచి మళ్ళీ పేపర్లోకి తలదూర్చాడు. ఇంతలో సతీష్ వైపు మత్తెక్కించే సువాసన ఒక అలలా వచ్చింది. ఒక అత్యాధునికమైన యువతి టీ షర్ట్, జీన్స్ తొడుక్కుని భుజానికి బ్యాగ్ తగిలించుకుని వయ్యారంగా నడిచి వస్తోంది. ఆమె పక్కనే ఒక యువకుడు కూడా ఉన్నాడు. ఇద్దరూ ఐస్‌క్రీమ్ తింటున్నారు. సతీష్ ఆ సువాసన తన దగ్గరికి చేరుకోవటం చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో వెనకనించి ఎవరో కెవ్వుమని అరిచారు, "చచ్చిపోయింది! అరె, ఈ అమ్మాయి చచ్చిపోయింది!"

సతీష్ వెనక్కి తిరిగి చూశాడు. ఆ పిల్ల నిజంగానే చనిపోయింది. ఇంతకు మునుపు విసుక్కున్న రైల్వే పోలీస్ పరిగెత్తుకొచ్చాడు. ఆ పిల్ల చుట్టూ మూగిన జనాన్ని దూరంగా పొమ్మని గదమాయించి మరో పోలీసుతో, "వెళ్ళి సార్‌కి చెప్పిరా. ఇప్పుడీ శవాన్ని తరలించాలిగా! అది చచ్చింది సరే, ఒక మన చావు మనం చావాలి!" అన్నాడు.

ఈ లోపల ఆ సువాసన సరిగ్గా సతీష్ పక్కకి వచ్చి ఆగింది. చనిపోయిన పేదపిల్ల రక్తం తాలూకు దుర్గంధం ఎక్కువగా ఉందా, మత్తెక్కించే ఈ సువాసన ఎక్కువగా ఉందా అనే విషయం సతీష్ తేల్చుకోలేకపోయాడు. సువాసన తన స్నేహితుడి భుజం మీద చెయ్యి వేసి, "సో పెథటిక్! ద గవర్నమెంట్ డజంట్ డూ ఎనీ థింగ్ ఫర్ ద పీపుల్?" అంది. "ప్రభుత్వం ఏం చేస్తుంది? ఈ పిల్లని ఇలాంటి దుస్థితి కొని తెచ్చుకోమని ప్రభుత్వం చెప్పలేదు కదా?" అన్నాడు యువకుడు.

సువాసనకి చిర్రెత్తుకొచ్చింది, "ఏమిటి నాన్సెన్స్ మాట్లాడుతున్నావు? ఆమెకి ఈ గతి పట్టటానికి స్వయంగా తానే కారణమంటున్నావా?" అంది కోపంగా.

ఆమె కోపం చూసి యువకుడు తగ్గాడు. "ఒకే..ఒకే.. మనం ఈ విషయం వదిలేద్దాం. పద ఇంకేమైనా మాట్లాడుకుందాం," అంటూ అతను ఆమె చెయ్యి పట్టుకుని లాగటం మొదలు పెట్టాడు. ముందు ఆ యువతి కొంచెం బెట్టు చేసినా, ఇంజన్ వెనక బోగీ లాగ అతని వెంట వెళ్ళిపోయింది.

ఆ సువాసన సతీష్‌కి దూరంగా పోసాగింది. దాని బదులు మృత్యువు వాసన వాతావరణాన్ని పూర్తిగా కమ్మేసింది. ఉన్నట్టుండి నా పక్కన కూర్చున్న ముసలాయన వెక్కి వెక్కి ఏడవసాగాడు. మధ్య మధ్య ఏదో సణుగుతూ, "అందర్నీ తుపాకీతో కాల్చి పారెయ్యాలి. ఆడ కూతుళ్ళకి ఇలాంటి గతి పట్టిస్తారా? ఈ దేశానికో స్వాతంత్ర్యం. దాన్ని ఒక పండగగా మనం జరుపుకోవటం..ఛీ! ఛీ! సిగ్గులేకపోతే సరి!" అన్నాడు. ఆయనకి కన్నీళ్ళు ఆగటం లేదు, నలిగిపోయిన వార్తా పత్రిక ఆ కన్నీళ్ళలో తడిసిపోతోంది.

ఇంతలో," ...రైలు మరో ఐదు నిమిషాలలో.. ప్లాట్ ఫాం మీదికి వస్తోంది" అన్న అనౌన్స్‌మెంట్ వినిపించింది. అదయ్యాక టీవీలో దూర్‌దర్శన్ వారి' రాగ్‌దేశ్' ప్రసారం మొదలైంది.

సతీష్ కూర్చున్న బెంచి వెనకాల పెద్ద గుంపు తయారైంది. ఒక ఎముకలపోగులా ఉన్న పధ్నాలుగేళ్ళ కుర్రాడు పిల్లిలా గుంపులో దూరి ఎవరిదో బ్యాగ్ లాక్కుని మెరుపు వేగంతో పరిగెత్తి పారిపోసాగాడు. 'దొంగ దొంగ' అని బాధితుడు అరిచాడు. కొందరు కుర్రాడి వెంట పడ్డారు. పోలీసు కూడా వెంబడించాడు. వాడిని పట్టుకుని బ్యాగ్ లాక్కునే లోపల వాడుదాన్ని రైల్వే లైన్ల మధ్యన నించున్న తన తోడు దొంగకి అందేటట్లు విసిరేశాడు. రెండో కుర్రాడు దాన్ని అందుకుని చీకట్లోకి మాయమయ్యాడు.

పోలీసు దొరికిన కుర్రాణ్ణి బాదుతూ, 'ఎవరికిచ్చావురా బ్యాగు, దొంగ నాయాలా? చెప్పు, చెప్పకపోతే నీ రక్తం కళ్ళ చూస్తాను,' అని అరిచాడు.

'సార్, వాడే నా బాస్, వాడి పైన అందరికన్నా పెద్ద బాస్ ఉన్నాడు, సార్! ఈ పనులన్నీ మా చేత చేయిస్తాడు, మొత్తం వాడికే చేరుతుంది, నాకింత తిండి దొరుకుతుంది.. ఐతే వాడు నాకు తెలీదు సార్.. ఈ పనులు చెయ్యనంటే అక్కడ తన్నులు తప్పవు సార్! నన్నొదిలెయ్యండి..!" అని భోరుమన్నాడా కుర్రాడు.

వాడెంత బతిమాలినా పోలీసు మనసు కరగలేదు, వాణ్ణి కొడుతూ లాక్కుపోయాడు. దెబ్బలు భరించలేక ఆ కుర్రాడు కేకలు పెట్టసాగాడు. సతీష్ పక్కనున్న ముసలాయన ఇంకా ఏడుస్తూనే ఉన్నాడు, "ఏమైంది దేశానికి? ఎక్కడుంది స్వేచ్ఛ! స్వాతంత్ర్య దినం ఎందుకు జరుపుకోవాలి?" అంటూ నలిగి చిరిగిపోయిన పేపర్‌లో మొహం దాచుకున్నాడు. సందడి మొదలైంది, రైలు ప్లాట్‌ఫాం మీదికి వస్తూ కనిపించింది. టీ, తిండి సామాన్లూ అమ్మేవాళ్ళు, రైలు ఎక్కే పాసెంజర్లూ హడావిడి చేస్తున్నారు. సతీష్ లేచి నిలబడ్డాడు. బెంచి

వెనక గుమిగూడిన జనం ఎటో వెళ్ళిపోయారు. కానీ చనిపోయిన ఆ అమ్మాయి అక్కడే అలాగే పడి ఉంది, తన ఒంట్లోంచి కారిన రక్తం మీదే ఆమె శరీరం ఒరిగిపోయి ఉంది.

సతీష్‌కి తన స్నేహితుడు బోగీలోంచి దిగుతూ కనిపించాడు. అతని మొహం జేవురించి ఉంది. "ఏమైంది? ఎందుకలా కోపంగా ఉన్నావు?" అని పలకరించాడు సతీష్. అబ్బ అడగద్దు! పాల క్యాన్ల వాళ్ళు చంపేశారనుకో! రిజర్వేషన్ లేకుండా బోగీ ఎక్కిపోయి మా నిద్రపాడు చేశారు. మేం పడుకునుంటే మమ్మల్ని లేపేసి మా సీట్లు ఆక్రమించారు. పొగరుబోతు వెధవలు! ఇక బోగీలో ఉన్న నీళ్ళతో పాల క్యాన్లు నింపుకున్నారు. అదికాక... నోరు తెరిస్తే బూతులు బండబూతులు!" అంటూ వాపోయాడు ఆ స్నేహితుడు.



వెనక్కి తిరిగిన సతీష్‌కి ముసలాయన బెంచీ మీద కనబడలేదు. చనిపోయిన ఆ అమ్మాయి దగ్గర గొంతుకూర్చుని పేపర్‌తో ఆ శవం మీద ముసురుతున్న ఈగల్ని తోలుతూ కనిపంచాడు.

"ఏమిటిది. సతీష్?' అన్నాడా స్నేహితుడి కళ్ళింతలు చేసుకుని.

సతీష్ అతని సూట్‌కేసేని చెత్తో పట్టుకుంటూ, "బైటికెళ్ళాక చెప్తాను, పద!" అన్నాడు. ఇద్దరూ స్టేషన్ బైటికొచ్చారు. ఆటోల వాళ్ళు చుట్టుముట్టి, 'ఎక్కడికి సార్? హోటల్‌కా?' నా ఆటో వేగంగా వెళ్తుంది, మంచి హోటల్‌కి తీసుకెళ్తాను, ఇటు రండి సార్!' అంటూ వెంటబడ్డారు.

"సతీష్, నా బుర్ర బాగా వేడెక్కిపోయింది. అర్జంటుగా ఒక కప్పు టీ తాగాలి," అన్నాడు స్నేహితుడు.

స్టేషన్ బైటున్న దుకాణాలు ఇంకా తెరవలేదు. "నువ్విక్కడే ఉండు, నేనలా కొంతదూరం వెళ్ళి ఎక్కడైనా టీ స్టాల్ తెరిచారేమో చూసొస్తాను,' అన్నాడు సతీష్.

సతీష్ స్నేహితుడు సూట్‌కేస్ మీద కూర్చుని సిగరేట్ వెలిగించాడు. సతీష్ ముందుకి నడిచాడు. టీ బడ్డీలు తెరిచి లేవు. రైల్వే బ్రిడ్జ్ చేరుకునేసరికి మరో దృశ్యం కనిపించింది. పన్నెండు పదమూడేళ్ళ కుర్రాళ్ళు నేలమీద కూర్చుని పేక ఆడుకుంటున్నారు. వాళ్ళల్లో ఒకడికి అష్టావక్రుడిగా కాళ్ళు వంకరగా ఉన్నాయి. వాటిని ఒక పక్కకి ముడుచుకుని పేకాడుతున్నాడు.

ఇంకొకడు, 'ఏయ్ ఏంటిరా అది? రోజూ మోసం చేస్తూనే ఉన్నావు, నేనూ చూస్తున్నాను. ఈరోజు చేశావంటే చచ్చావే!' అన్నాడు.

'ఏయ్, ఏంట్రా కూస్తావు? నువ్వే దగుల్ బాజీవి, రోజూ ముక్కలు మార్చేది నువ్వు, పైగా నన్నంటావా?" అన్నాడు పక్కవాడు.

"ఏయ్, నోరుముయ్యండిరా! పోలీసోడు వచ్చాడంటే మనపని ఖిల్లాస్!" అని సర్దబోయాడు మూడో వాడు.

"వాడెందుకు అలా చేస్తాడు, రోజూ వాడికి మేపుతున్నాంగా!" అన్నాడు మరో కుర్రాడు. సరిగ్గా అదే సమయానికి స్టేషన్‌లో బ్యాగ్ పట్టుకుని పారిపోయిన కుర్రాడు రక్తం ఓడుతూ కుంటుతూ అక్కడికి వచ్చాడు. "ఒరే పారిపోండి రా! పోలీసులొస్తున్నారు, పొండి... లగెత్తండి!" అని అరిచాడు. కుర్రాళ్ళందరూ పేక కింద పడేసి, డబ్బులు జేబుల్లో కుక్కుకుని తలో వైపు పరిగెత్తారు. వంకర కాళ్ళ కుర్రాడు తాపీగా తన సంచీలోంచి అల్యూమినియం చిప్ప బైటికి తీసి ముందుకి వంగి పడుకుని, 'బాబూ ధర్మం చెయ్యండి!' అంటూ అడుక్కోవటం మొదలెట్టాడు.

పోలీసుల్లో ఒకడు వాణ్ణి గద్దించి అడిగాడు, "ఏరా, కుంటీ ఎటు పోయార్రా నీ దోస్తులు? ఏడీ వాళ్ళ లీడర్, చెప్పు, లేకపోతే ఈ రోజు నిన్ను వదిలేది లేదు!" దెబ్బల భయంతో కుర్రాడు వేలెత్తి చూపిన వైపు సతీష్ నిలబడి ఉన్నాడు. పోలీస్ లాఠీ ఊపుతూ అతని దగ్గర కొచ్చి, ఏమీ అడక్కుండానే అతని భుజం మీద లాఠీతో ఒక దెబ్బ వేసి, "అయితే నువ్వన్న మాట వాళ్ళ లీడర్! ఇన్నాళ్ళకు నా కళ్ళబడ్డావ్! జూదం, దొంగతనం... ఇంకేమేం చేయిస్తున్నావ్? చూడ్డానికి జెంటిల్ మాన్ లా ఉన్నావ్! ఈ రోజు మా చేతిలో నీ పెళ్ళి ఉంది. దొంగ రాస్కెల్!" అని గర్జించాడు. తన వాళ్ళు అనుకుంటున్న వాడిని కాదనీ, ఒక ప్రభుత్వ ఉద్యోగిననీ చెప్పేందుకు ప్రయత్నం చేశాడు సతీష్. ఐ కార్డు చూపించేందుకు జేబులో చెయ్యి పెట్టి, వెంటనే బిక్క చచ్చిపోయాడు. తొందరలో ఐ కార్డ్ ఇంటి దగ్గరే మరిచిపోయినట్టు గ్రహించాడు. పోలీస్ ఏమీ వినిపించుకోకుండా సతీష్‌ని మెడ పట్టుకుని నెడుతూ పదమన్నాడు. అప్పుడు సతీష్ గట్టిగా తన స్నేహితుణ్ణి పేరు పెట్టి పిలిచాడు. తెల్లారగట్ల అంతా నిశ్శబ్దంగా ఉండటంవల్ల స్నేహితుడికి సతీష్ కేక వినిపించి, సూట్‌కేస్ పట్టుకుని గబగబా అక్కడికి వచ్చాడు. "ఏం చేస్తున్నారండీ? వీడు నా స్నేహితుడు. నా కోసం స్టేషన్ కొచ్చాడు. టీ కొట్టు ఏదైనా తెరిచి ఉందేమో చూసేందుకు ఇటు వచ్చాడు. ఒక గవర్నమెంట్ ఉద్యోగితో ఇలా ప్రవర్తిస్తే, ఫలితం ఎలా ఉంటుందో తెలుసు కదా! మీ కసలు బుద్ధి లేదా? నేను ఆర్మీలో ఉన్నాను, తెలుసా?" అన్నాడు కోపంగా.

పోలీసు భయం భయంగా చూసి సతీష్‌ని వదిలిపెట్టాడు.

పోలీస్ గట్టిగా పట్టుకోవటం వల్ల సతీష్ మెడ మీద నీలంగా వాతలు పడ్డాయి. లాఠీ దెబ్బకి వెన్ను జలదరించి ఇంకా భుజం నొప్పెడుతోంది. సతీష్ స్నేహితుడు, 'పదవోయ్, టీ వద్దు ఏమీ వద్దు! ఇంటికెళ్ళి తాగుదాం," అన్నాడు. సతీష్ అటుగా వెళ్తున్న టాక్సీని పిలిచాడు.

టాక్సీ వచ్చి ఆగింది. ఇద్దరూ ఎక్కి కూర్చున్నారు. ఉన్నట్టుండి సతీష్ కిటికీ బైటికి చూశాడు. ప్లాట్‌ఫాం మీద కనిపించింది సువాసనా, ఆమె స్నేహితుడూ టాక్సీ దగ్గర నిలబడి ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. సువాసన చురుగ్గా ఒక చిన్న కాయితం చీటీ సతీష్‌కి ఇచ్చింది. అందులో ఒకే ఒక వాక్యం టైపు చేసి ఉంది : "టూ అవర్స్, టూ థౌజండ్, టాక్సీ యువర్స్"

సతీష్ నుదుటి మీద చెమట బిందువులు పొడసూపాయి. త్వర త్వరగా కిటికీ అద్దం మూసేసి, డ్రైవర్‌ని పోనిమ్మన్నాడు.

పొగమంచు వల్ల తెల్లవారినా ఒక మసక చీకటి అలాగే ఉంది. టాక్సీ హెడ్ లయిట్లు వెలగగానే, సతీష్‌కి రోడ్డు వార రైలింగ్‌కి ఆనుకుని ఆ బెంచీ మీద ముసలాయన మళ్ళీ కనిపించాడు. ఇంకా ఆయన ఆ నలిగిపోయిన పేపర్ని కళ్ళకి దగ్గరగా పెట్టుకుని చదవటానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రజాస్వామ్యం తాలూకు ముడతల్లో ఎక్కడైనా మంచి వార్త కనబడుతుందేమోనని వెతుకుతున్నాడు లాగుంది.... ♦

# అసమానతలపై గజళ్ళు సంధించిన కవి

- రాంజీ తివారి



దుష్యంత్ కుమార్

హిందీ గజళ్ళ అభ్యుదయ పరంపరలో దుష్యంత్ కుమార్ పేరు సర్వాగ్రగణ్యుడిగా పరిగణించబడుతుంది. ఇది యాదృచ్ఛికం కాదు. హిందీ పుర వీధుల్లో ఆయన గజళ్ళను ఉటంకించకుండా ఉండే అభ్యుదయ గోష్ఠులు కాని చర్చలు కాని వుండవు. ఒకవైపు ఆయన గజళ్ళు సహజ సూటి భాషలో సగటు మనిషిలో సంవాదం నెరపుతున్నట్టు అనిపిస్తాయి. మరోవైపు వాటి నుండి కఠినాతి కఠినమైన సమయాల్లో కూడా ధైర్యం, ఆశా కిరణాలు లభ్యమౌతాయి. దుష్యంత్ కుమార్లో ఉన్న ఈ సామర్థ్యమే ఆయన్ను అమరుడిని చేసింది.

సెప్టెంబర్ 1, 1933న ఉత్తర్‌ప్రదేశ్‌లో బిజ్‌నౌర్‌లో పుట్టిన ఈ మహత్తరమైన అభ్యుదయ కవి చదువు అలహాబాద్ విశ్వవిద్యాలయం నుండి జరిగింది. చదువు ముగించిన తరువాత తొలుత ఆయన ఆకాశవాణిలో పనిచేసారు. తొలి దినాల్లో దుష్యంత్ కుమార్ తన సమకాలీనులిలా పాటలు రాసేవారు. అప్పుడు ఒక ప్రక్క వేదిక నుండి కవితలు చదవటం అనేది రాజ్యమేలుతుండేది కూడా. సహజంగానే దుష్యంత్ కుమార్ కూడా దీనికి దూరంగా ఉండలేని పరిస్థితి. 'సూర్యకాస్వాగత్ (సూర్యుడికి స్వాగతం)' 'ఆవాజోం కే ఘేరే (గొంతుల వలయం)' 'జల్తే హువే వన్ కా వసంత్‌ఖ (కాలుతున్న అడవి వసంతం)' అనే మూడు కవితా సంకలనాలు, 'ఏక్ కంఠ్ విషపాయి (విషం తాగిన ఒక కంఠం) అనే కావ్య నాటకం మరియు 'ఛోటే ఛోటే సవాల్ (చిన్న చిన్న ప్రశ్నలు)' 'ఆంగన్ మే ఏక్ వ్రిక్ష (వాకిట్లో ఒక చెట్టు)' అనే రెండు నవలలు ఆయన రచనలు. కాని ఆయనకు నిజమైన ఖ్యాతి లభించినవి 'సాయే మే ధూప్ (నీడలో ఎండ)' అనే గజళ్ళ సంకలనం ప్రచురించబడిన తరువాతే. 52 గజళ్ళు ఉన్న ఈ సంకలనం ఆధునిక హిందీ గజళ్ళ పరంపరను అభివృద్ధి చేయటానికి తోడ్పడటమే కాకుండా ఉర్దూ గజళ్ళను కూడా ప్రజల వాణిగా మారటానికి ప్రేరేపించింది.

'సామే మే ధూప్' సంకలనం ఒక వైపు మనకాలంలో ఉన్న వైరుధ్యాలను గుర్తిస్తుంది. అదే సమయంలో ఒక అడుగు ముందుకేస్తూ మన ప్రయత్నాల వల్ల ఈ వ్యవస్థను మార్చటం తప్పకుండా సాధ్యమౌతుందని సగటు మనిషిలో ధైర్యాన్ని నింపుతుంది.

*బాధ కొండలైంది. ఇహ కరగాలి,*
*ఈ హిమాలయం నుండి ఏదో గంగ ప్రవహించాలి*
*ఉట్టి గొడవ పెట్టుకోవటమే నా అభీష్టం కాదు,*
*నా ప్రయత్నం ఎందుకంటే, ఈ పరిస్థితి మారాలి.*

దుష్యంత్ గజళ్ళలో 'పరిస్థితిని మార్చే' ఈ ప్రయత్నమే సర్వత్రా కనబడుతుంది. ఆయన ప్రతి గజల్లో అసమానతలతో కూడిన ఈ వ్యవస్థపై ఒక వైపు దెబ్బవేయటం ఉన్నట్టే మరో వైపు ఆ దెబ్బని ఇంకా బలవత్తరం చేసే ప్రయత్నం ఉంటుంది.

*చెప్పబడింది వస్తుంది దీపం ప్రతి ఇంటికి,*
*కాని దొరకలేదు దీపం ఊరంతటికి*
*బండరాయి కరగదని నిశ్చింత వారిది,*
*గళం పనిచేయాలని తాపత్రయం నాది.*

ఈ నిక్కచ్చితనమే ఆయన గజళ్ళ శక్తి. ప్రజల్లో ఆయన పలుకుబడికి కారణం కూడా. ఆయన ఎప్పుడు కల కన్నా అందులో భవిష్యత్ ప్రపంచాన్ని మెరుగుపరిచే భావమే కనపడుతుంది. మనమున్నది చాలా కష్టకాలమని మన అన్ని ప్రయత్నాల తరువాత కూడా అది కష్టతరంగానే ఉందని ఆయనకు తెలుసు. కాని మన ఈ చిన్న చిన్న ప్రయత్నాలే పునాదిగా పని చేసి, దానిపై భవిష్యత్ సౌధం నిర్మించబడే రోజు కూడా తప్పకుండా వస్తుందని కూడా ఆయనకు తెలుసు.

*కాస్త నిప్పు ఉండనీ, కాస్త పొగ రానీ,*
*రేపు చూస్తావు, కొంతమంది బాటసార్లు ఈ నెపంతోనే వస్తారు*
*వేము చరిత్ర రచించలేకపోయాం, ఈ బాధలో దహిస్తున్నాం,*
*ఇహ ఏ ధారలను పట్టుకున్నా ఈ కలయికకే వస్తాయి.*

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రజల ఆశలు, ఆకాంక్షలు ఏ విధముగా మట్టి కొట్టుకుపోయాయో అది హిందీ కవితని చాలా వరకు కుదిపి వేసింది. నాగార్జున్, కేదార్‌నాథ్, అగ్రవాల్, త్రిలోచన్, ధూమిల్, ముక్తిబోధ్ వంటి వారి కవితల్లో ప్రజల్లో నెలకొన్న ఈ అశాంతి, పెనుగులాట మనం చాలా స్పష్టంగా చూస్తాం, చదువుతాం. మోహ భంగమౌతున్న ఈ తరుణంలోనే

# దగ్ధగీతం

బి. కళాగోపాల్
9441631028



ఎంత దూరమని పరుగెడతాం ?
మాయదారి వ్యామోహాల ఎండమావుల్లోంచి
ఇంకెన్నడు బయటపడతాం ?
జీవశక్తిని పీల్చిపిప్పిచేసే ఊపిరి సలపని
సుడిగాలి కెరటాల నుండి ఇంకెన్నడు బయటపడతాం ?
కనురెప్పల మాటున చిధ్రమౌతున్న కలలకోట
హృదయాంతరాళలో గూడుకట్టిన
నిశి నైరాశ్యపు భావన నుండి ఇంకెన్నడు బయటపడతాం?
ఒక స్వప్నం దగ్ధమౌతున్న వేళ
దుఃఖ విపంచిక తనరాగాలను శృతిచేస్తుంది
కాలం నవ్వుతున్నది
తన పడగనీడిలో జరిగే అవినీతి, అన్యాయాల కుళ్లును చూసి,
రోజూ కాచే వెన్నెల కారిపోతున్నది,
మృత్యుఘోషలను వినలేక
ఖండిత శిరస్సుపై నాట్యం చేసే
ఒక భావోద్వేగపు కెరటం
మానవాళి కుతంత్రాలను బట్టబయలు చేయలేక
నిస్సహాయంగా నీవు ఆలపించే దగ్ధగీతానికి
బాణీలుగా ఉండబోమంటూ నిష్క్రమించాయి అగ్నిజ్వాలలు
వద్దు... వద్దు... అరణ్యరోదనలా,
ఇంకా మిగిలిన 'నీతనం', 'నీదైన తనం'

# నానీలు

ఎ.ఎ. నాగేంద్ర
9949358301



దేశానికి రైతు
వెన్నెముకే
మరిదానిని
విరిచేసిందెవరు ?

భూపట్టాలిచ్చారు
భూమిని కాదు
చూడరమ్మో
రైతునోట్లో దుమ్ము

బద్దలవుతున్నాయి
మానవ సంబంధాలు
లావా పేరు
స్వార్థం

సీమ ధైర్యశాలి
వేరు శెనగ
కరువుకు
ఎదురొడ్డింది

అలసిపోతోంది
నాన్న ఫింఛను
అప్పుల బూజు
దులుపుతూ

నాగలి
అటకెక్కిందే !
పని కల్పించాలని
నిరశన దీక్షేమో

అయ్యో !
మేత లేదా ఆవుకు
అవును నాయకులు
మేసేశారు

---

దుష్యంత్‌కుమార్ 'తన గజళ్ళ ద్వారా ప్రజల ముందు కొత్త ప్రత్యామ్నాయాల రూపు రేఖలని ఇలా ప్రస్తావిస్తాడు.

**ఎలాంటి ఘట్టాలు ముందుకొస్తున్నాయో**
**పాడుతు పాడుతు జనం అరుస్తున్నారు**
**ఇహ ఈ చెరువు నీరు మార్చేయండి,**
**ఈ తామర పువ్వులు వాడిపోతున్నాయి.**

వాస్తవం ఏమంటే దుష్యంత్‌కుమార్‌కు మానవత, సామాజిక, సాహిత్య, రాజకీయాలు పట్ల లోతైన స్పందన ఉంది. తన పాటలు, కవితలు, గజళ్ళలో అన్ని సందర్భాల్లో ఈ స్పందనను అట్టే పెట్టుకుని ఉన్నాడు, సందర్భం బట్టి విప్లవ పతాక కూడా ఎగరేసాడు. ఎన్నో సందర్భాల్లో సమాజంలో విభిన్న రంగాల్లో పోరాటంలో ఉన్న వాళ్ళు దుష్యంతుడి ఈ శేర్ (పద్యం)ను ఉటంకించటం మనం చూస్తాం.

**ఆకాశంలో చిల్లు ఎందుకు పడదు**
**ఉత్సాహంగా ఒక రాయైతే ఎగరేయండి నేస్తం**

ఈ రోజు మన సమాజంలో చెల్లుబాటౌతున్న దుష్యంత్ గజళ్ళు అంత తేలికగా నిలదొక్కుకోలేదు. ఒకటేమో హిందీలో గజళ్ళ పరంపర చాలా తక్కువనే ఉంది, రెండోది వేదికని ఆక్రమించుకున్న ఉర్దూ గజళ్ళు ప్రియురాలి కురులు, మద్యం గృహాల సందుల్లో చిక్కుకుని ఉన్నాయి. అలాంటి పరిస్థితిలో దుష్యంత్ చాలా వ్యతిరేకతను ఎదుర్కోవలసి వచ్చింది. అసలు ఆయన రాసినవి గజళ్ళే కావని ఆయన్ను ఒక విధంగా తిరస్కరించారు. కాని ఓడిపోయే మనిషి కాదు. ఆయన గజళ్ళు ప్రజల వాణిగా నిలిచేఉన్నాయి. ఈ దేహం బరువు మోతకి వంగి ఉంటుంది, నేను అభివాదన చేయలేదు, మీరు పొరబడ్డారు. ఇక్కడ దాకా వస్తూ వస్తూ ఎండిపోతాయి ఎన్నో నదులు, నాకు తెలుసు, నీరు ఎక్కడ నిలిచిపోయి ఉంటుందో.

ఎంతోమంది ప్రతిభావంతులు తన జీవిత చరమ ఉత్కర్షకాలంలోనే, పిన్న వయసులోనే రాలిపోయారు. హిందీలో భారతేందు హరిశ్చంద్, జయ్‌శంకర్ ప్రసాద్, మోహన్ రాకేశ్, ధూమిల్ వంటి ఇతర దిగ్గజాల్లాగే దుష్యంత్‌కుమార్ కూడా 42 ఏళ్ళ పిన్న వయసులోనే 30 డిశంబరు, 1975న కాలం చేసారు. ఆయన పంక్తులు నేడు కూడా మన మనసులను తట్టి, కుదుపుతూనే ఉన్నాయి. జీవించాలని, పోరాడాలని, అన్యాయానికి వ్యతిరేకంగా గళం విప్పాలని ప్రేరణ ఇస్తూనే ఉన్నాయి.

**తెలుగు: వేదుల రామకృష్ణ**

# హిందీలో మహాప్రస్థానం




డా॥ తక్కోలు మాచిరెడ్డి

మనకు వచ్చే కవినో / రచయితనో మనం అనువదిస్తాం. అని అభిప్రాయపడతాడు ప్రఖ్యాత విమర్శకుడు, అనువాదకుడు – రారా. నాకు నచ్చిన తెలుగు కవులు – శ్రీశ్రీ, అలూరి బైరాగి. శ్రీశ్రీ మహాకృతి 'మహాప్రస్థానం' నా మనసుపై చెరగని ముద్ర వేసింది. నేను విద్యార్థిగా ఉన్నప్పుడే – అంటే 60వ దశకంలో నన్నమాట. బైరాగి శ్రీశ్రీ కంటే ఒక అడుగు ముందుకెళ్లి సామ్యవాద సమాజం ఎలా ఉంటుందో చిత్రించినాడు 'వాగ్దత్త వసుంధర' అంటే కవితలో. సరే ఇక విషయానికి వద్దాం.

మొదట్నే చెప్పొద్దు? 'మహాప్రస్థానం' లోని కవితల అనువాదం కంటే చలం రాసిన 'యోగ్యతాపత్రం' అనువదించడం నాకు కొంచెం కష్టమన్పించింది. చలం శైలిని హిందీలో యథాతథంగా తేవడం అంత సులభమేమీ కాదు. 1940లో రాసిన ఈ యోగ్యతా పత్రాన్ని మించి తెలుగులో బహుశా ఏ పీఠికా రాలేదేమో.

నేను కవిని. నా కవితా సంపుటి శీర్షిక 'అసలు విషయం వ్యవస్థను మార్చడం' కావ్యానువాదం కవియే చేయగలడని నా అభిప్రాయం. 'మహాప్రస్థాన్' మొదటి కవితా శీర్షిక. మరో ప్రపంచం / మరో ప్రపంచం పిలిచింది అనే దానికి నా అనుసృజన ఏక్ అన్య దునియా / ఏక్ అన్య దునియా / ఏక్ భిన్న్ దునియా భులారహీ / నేను 'భిన్న్' చేర్చడంతో స్పష్టత సంతరించుకొనింది. 'ఏక్ ఔర్ దునియా' కి 'మరి ఒక ప్రపంచం' అనే అర్థం వస్తుంది. అది ఇక్కడ అతకదు. అందుకే నేనన్నాను 'ఏక్ అన్య దునియా' అని – స్పష్టత కోసం.

అనువాదం ముఖ్యంగా కవిత్వానువాదం అనుసృజన అవుతుంది.

అనువాదకునికి లక్ష్య భాషలో బాగా నైపుణ్యం వుండాలి. లేకపోతే తప్పులు దొర్లే ప్రమాదం ఉంది. ఉదామరణకు శ్రీశ్రీ 'జయభేరి' కవితలో 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను' అనే పంక్తుల్లోని 'ప్రపంచాగ్నికి' అనే పదబంధానికి ఓ అనువాదకుడు హిందీలో కూడా 'ప్రపంచాగ్ని' అనే అనువదించాడు. 'ప్రపంచ్' అంటే హిందీలో బూటకం, దగా అనే అర్థాలున్నాయి. ప్రపంచం అనే అర్థంరాదు.

లక్ష్యభాషలో మూలంలోని లయ రావాలంటే కష్టసాధ్యమే. కొన్ని చోట్ల మూలం లోని తెలుగు / సంస్కృత పదాలను యథాతథంగా తీసుకున్నాను. 'పరాజితులు' అనే కవితలో 'దుర్గతి, దుర్గతి / దుర్మతి, దుర్మృతి అనే పదజాలం ఇలాంటిదే. కుక్కపిల్లా / అగ్గిపుల్లా / సబ్బుబిళ్లా – హీనంగా చూడకుదేన్నీ ! కవితామయమేనోయ్ అన్నీ ! ఈ పక్తులకు నా అనువాదం –

పిల్లా హో చాహే / దియాసలాఈ, మా / సాబున్ కీ టికియా / నీచ్ నసమ ఘో కవితామయ్ హీ హై c సభీతో !

'పిల్లా' అంటేనే హిందీలో కుక్కపిల్ల అని అర్థం. వీలైనంత మేరకు ప్రాస ఇవ్వగలిగాను.

కొన్ని ధ్వన్యర్థక పదాలను లక్ష్యభాషలో సరియైన పదాల్ని వాడటం సులువేం కాదు. నేను అగ్ని కిరీటపు ధగధగలు అనే దానికి 'అగ్నిమకుట్‌కీ చమక్ దమక్' అనీ, ఎర్రబావుటా నిగనిగలు అనే దానికి 'లాల్ పతాకాకీ చకా చౌం ధియాc అనీ హోమ జ్వాలల భుగభుగలు' అనే పదజాలానికి 'హోమ్‌కుండ్ కీ ధక్ ధకియా' అని నేను భావిస్తున్నాను.

పతితుల్నీ, భ్రష్టుల్నీ, బాధా సర్పదష్టుల్నీ సంబోధిస్తూ రాసిన కవిత 'జగన్నాధుని రథచక్రాలు' హిందలోల ఈ సంబోధనను ఇలా అనువదించినాను 'పతిత్ జనో / భ్రష్ట జనో / పదా సర్పదష్ట జనో' అని ఇది తప్పుగా 'దుష్ట జనో' అని అచ్చయింది. వాస్తవికతావాద వచన కవితల్లో మేటి 'భిక్షువర్షీయసి' అనే కవిత. శీర్షికను నేను హిందీలో కూడా అలాగే వుంచాను. కింద అర్థమిస్తూ.

స్తాలిన్ (రష్యను భాషలో ట,డ లు లేవు) నాయకత్వాన రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీల నెదుర్కొంటూ సోవియత్ వాయుసేన రంగంలోకి దిగింది. 1941 జూన్‌లో ఈ వార్తతో ప్రేరణ పొంది శ్రీశ్రీ రాసిన గేయం 'గర్జించు రష్యా' రష్యను భాషలో పదానికి ఒకే దీర్ఘముంటుంది. చెహూవ్, లేవ్‌తోయ్, దోస్తొయెవ్స్కి – ఇలా రాయడమే కరెక్టు. శ్రీశ్రీ తప్పుగా షెకేవ్, టాల్‌స్టాయ్, డొస్టాయేవిస్కీ అని తన కవితలో పేర్కొన్నాడు. ఆంగ్లం ఆధారంగా నేను రష్యను భాషలో ఉన్న దాన్నే ప్రామాణికంగా తీసుకున్నాను. అసలు 'రష్యన్' అనే పదం ఆంగ్లంలోనిది 'రూస్కీ' అని అంటారు రష్యన్లు తమ భాషను 'రూస్' అని అంటారు, రాస్తారు.

అనువాదం – ముఖ్యంగా కవిత్వానువాదం ఒక సంశ్లేషణ – ఒక సింథెసిస్ (**Synthesis**) – ఒక అనుభూతి. ఒక సృజన. 'మహాప్రస్థానం' అనువదించేపుడు నాకు కలిగిన అనుభవం.

**08562-243537**

# తెలంగాణా సాహిత్య సాంస్కృతిక విశిష్ట సంచిక 'సత్కృతి'




కె. ఆనందాచారి

సాహిత్య రంగంలో వున్న రచయితలకు, కవులకు, విద్యార్థులకు కళా సాంస్కృతిక రంగాలలో వున్న వారందరికీ కరదీపికలా, రిఫరెన్స్ గ్రంథంలా ఉపయోగపడేలా 'సత్కృతి'ని తీర్చిదిద్దారు గిరిజా మనోహరబాబు అభినందన సమితివారు. సాహిత్య రంగంలో అభినందన సంచికలు వేయడం వున్నదే కానీ ఈ షష్టిపూర్తి అభినందన సంచిక సత్కృతి'ని మాత్రం విపులమైన, విశిష్టమైన సాహితీ కళారంగాలపై ఎంతో విలువైన విశ్లేషణలతో వెలువరించారు. గతంలో యువభారతి వారు వేసిన మహతి' అనే సంచికను చదివిన అనుభూతి ఈ సత్కృతి చదివితే కలిగింది.

వరంగల్లులో 'సహృదయ' సాహిత్య సంస్థ స్థాపకులలో ఒకరైన గన్నమరాజు గిరిజా మనోహర బాబు అధ్యాపకుడుగా, సాహితీ సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలలో అందరి మన్ననలు పొందిన సాహితీవేత్త, కవి, రచయిత వీరి షష్టిపూర్తి సందర్భంగా, శ్రీభాష్యం విజయసారథి, కోవెల సుప్రసన్నాచార్య గౌరవ సంపాదకులుగా ఆచార్య బన్న అయిలయ్య ప్రధాన సంపాదకత్వంలో ఈ అభినందన సంచికను తీసుకువచ్చారు. సంచిక ముఖచిత్రాలు, అభినందన అభిప్రాయాలు చాలావరకు మనోహరబాబు గురించి సాహితీ విశేషాలు అభినందనలు, వారిసేవ, వారి రచనలు, వారి సాహిత్యానికి సంబంధించిన విశ్లేషణ వుంటాయని అందరూ అనుకుంటారు నాలాగే కానీ సత్కృతిలో వీరి గురించి చాలా తక్కువే వుంది. ముఖ్యంగా తెలంగాణ ప్రాంత సాహితీ కళా సాంస్కృతిక సామాజిక పరిణామాలపై ఒకింత సమగ్రంగానో ఎంతో శ్రమకోర్చి ఈ అభినందన ఉద్గ్రంథాన్ని తీసుకువచ్చారు. దాదాపు ఏడు వందల పేజీలు గల ఈ సంచికలో డెబ్బయి మంది రచయితలు అనేక అంశాలపై వ్యాసాలు రాశారు.

ఇందులో తొంభై శాతం తెలంగాణ నేపథ్యంగానే వ్యాసాలున్నాయి. కొన్ని మాత్రం తెలుగువారందరికీ సంబంధించినవీ. జానపద విజ్ఞానం, పద్య విద్య పరిశోధన, పీఠికలు, ఛందస్సు పరిశోధన, జాతీయ సాహిత్యము, తెలుగు పద ప్రయోగాలు, సిద్ధాంత గ్రంథాల ప్రమాణాలు, మైనారిటీ కవిత్వం. పద సాహిత్యం మొదలైన అంశాలు సాధారణ అధ్యయనానికి పనికివస్తాయి. మిగతా వ్యాసాలన్నీ తెలంగాణ ప్రాచీన సాహిత్యం నుండి ఆధునిక అస్తిత్వ ఉద్యమ సాహిత్యం వరకూ వున్న కళా సాంస్కృతిక పరిణామాలు దేనికదే ప్రత్యకంగా సమకూర్చడం అధ్యయనం చేసేవారికి ఎంతో ఉపయోగపడే అంశం. అంతేకాదు తెలుసుకోవాలనుకునే సాధారణ పాఠకుడుకీ చాలా విషయాలను ఎరుకపరుస్తుందీ గ్రంథం.

రాజకీయ, చారిత్రక అంశాలలోనే కాక సాహిత్య సాంస్కృతిక రంగాల్లో తెలంగాణకు ఒక ప్రత్యేకత వుందన్నది అందరికీ తెలిసిన విషయం తెలంగాణేతర ప్రాంతాలలో రాజాశ్రయంలో సాహిత్యం వైష్ణవ మత ధర్మ ప్రచారంలో భాగంగా, వర్ణ ధర్మాన్నీ కాపాడే సాహితీ సృజన పండిత కవులు వెలువరించగా ఆ కాలంలోనే వీరశైవ మత ప్రభావంతో ప్రజారంజకమైన శిల్ప వైశిష్ట్యాన్నీ, సామన్య ప్రజల ఇతివృత్తాలను తీసుకుని తెలంగాణలో రచన కొనసాగిందని, నన్నయకు పూర్వమే తెలంగాణలో సాహిత్యోద్యమం ప్రారంభమయిందంటూ, కన్నడ ఆది కవి పంపన సృజన ఇక్కడి నుండే మొదలయిందనీ సంపాదకులు, గౌరవ సంపాదకులు తెలంగాణ సాహిత్య సాంస్కృతిక చరిత్రను స్థూలంగా ముందు మాటల్లో వివరించారు.

అన్నీ పరిచయం చేయలేను కానీ ఇందులో వున్న కొన్ని ముఖ్యమైన రచనలు పేర్కొంటాను జానపద విజ్ఞానం, సాహిత్య సౌరభం, జానపద కళారూపాలు మొదలైన విషయాలను ఆచార్యులు భక్తవత్సలరెడ్డి, రుక్నుద్దీన్, గడ్డం వెంకన్న, మనకు ఎంతో విలువైన విషయాలను అందించారు. బాలకృష్ణశర్మగారు పద్య విద్యను

# మృత్యు శకటం

బి.బి. సుబ్రహ్మణ్యం
9490012215

మోకరిల్లిన గుండె
పిడికిట్లో ఉరేసుకొని
ఉద్వేగ రోదన
అక్షరాలను...
దళారికి ముడిసరుకు చేసాక
పసితనం...
ఓ... పురావస్తు శకలం.

బాల్యాన్ని బస్సు చక్రాలకిచ్చి...
వెన్నుపూసకు
స్కూల్ బ్యాగును శిలువేసి
గానుగెద్దులా
గమ్యం చేరడం దురాశే ...



విగత శిశువుల
తడి పుస్తకాల్లోంచి
తొంగి చూస్తున్న నెమలీక ...
మన నిర్లక్ష్య జ్ఞాపిక.

ఇప్పుడు ...
చితి మీద
వారి పార్థివ శరీరాలే కాదు
ఈ దేశ భవిష్యత్తు కూడా
తగలబడుతుంది.

పరిచయం చేస్తూ పద్యాన్నే కాదు అసలు కవిత్వానికే రోజులు చెల్లిపోయాయి. నాగరికత పురోగమిస్తుంటే కవిత్వం తిరోగమిస్తూ ఉంటుందని వాపోయారు. తాడేపల్లి పతంజలి అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు త్యాగయ్య, శ్యామదాసు, ముత్తుస్వామి దీక్షితులు వారి పద సాహిత్యాన్నిసారాన్ని వివరించారు. తెలుగు ఛందస్సుపైన ఇప్పటికి జరిగిన పరిశోధనలు, భవిష్యదవసరాలపై సంగనభట్ల నర్సయ్యగారు వివరించటం పరిశోధకులుకు ఎంతో ఉపయోగం సమకాలీన తెలుగు కథ ప్రయోగాలుపై ఆదెపు లక్ష్మీపతి సోదాహరణంగా వివరించారు.

దళిత కవిత్వంపై సుదర్శనరాజు, మైనారిటీ కవిత్వంపై దిలావర్ వ్యాసాలు మంచి అవగాహన కలిగిస్తాయి. ఇక రవ్వా శ్రీహరి తెలంగాణ మాండలికం తీరుతెన్నులు, నలిమెల భాస్కర్ తెలంగాణ భాష మాండలికం కాదన్న వ్యాసాలు చర్చకు పురికొల్పుతాయి. "అచ్చమైన తెలుగు ఫలానా జిల్లాల ప్రయోగాలే గ్రాహ్యాలు, ఇతరములన్నీ పరిత్యాజితాలు అని యెవరూ యెవరినీ గర్హింప జాలరు గర్హింపకూడదు" అన్న వేటూరి ప్రభాకరశాస్త్రి అభిప్రాయాన్ని ఉటంకిస్తూ రవ్వా శ్రీహరి గారి ముగింపు మాండలికాల పదాలు పరిణామం ఎంతో విజ్ఞాన వంతంగా వుంటుంది.

తెలంగాణ కవులు అనువదించిన పురాణాలను కోదండ రామాచార్యులు వారు సవివరంగా పేర్కొన్నారు. ఈ ప్రాంతపు సంస్కృత కవుల గూర్చి లక్ష్మణరావు, శతక సాహిత్యం గూర్చి పల్లేరు వీరస్వామి, పాల్కురికి సోమనాధుని జీవితం సాహిత్యం గురించి గడియారం రామకృష్ణశర్మ, పోతన గూర్చి హనుమచ్ఛాస్త్రి, రాములు, వానమామలైవ రదాచార్యులపై ఇందారపుకిషన్‌రావు చక్కగా వివరించారు. దాశరథి, సినారేలపై ఉర్దూ ప్రభావాన్నీ సుధాకర్ దాశరధి కవితా చైతన్యాన్ని రంగాచార్య రాయగా దర్భశయనం శ్రీనివాసాచార్య కాళోజీ 'నాగొడవ' ముదిగంటి సుజాతారెడ్డి .... కథల విశిష్టతలను విశ్లేషించారు.

"ఆ ముంగిటి రాగాలు శ్రమక్షేత్రపు రక్తనాళాలు పొయ్యిలో కాలే కఱ్ఱల చిటపటలు సంగీత ధ్వనులవుతాయి, ఆ ఇంట గంజి వార్చని రోజుపాటలే వాళ్ళకి పండుగ తిళ్ళు" అంటూ సుద్దాల హనుమంతు సాహిత్యాన్ని జయధీర్ తిరుమలరావు, తన జీవితాన్ని గూర్చితానే రాసుకున్న హనుమంతు రచన చాలా బాగా చదివిస్తుంది.

'తెలంగాణా విమర్శ ప్రస్థానం' ఎస్వీ రామారావు రచనలపై ఎన్ రఘు పరిచయం చేశారు. తెలంగాణా పోరాటం నాటక చైతన్యం మాభూమి 'పోతుగడ్డ' 'గెరిల్లా' నాటకాలు, నాటికల గూర్చి బి.ఎస్. కామేశ్వరి విశ్లేషించారు. గ్రంథాలయోద్యమంపై కాంతారావు, తెలంగాణా రంగస్థలం ..... ప్రాచీనచరిత్ర నుండి నేటి వరకు పైడిముక్కల ఆనంద్‌కుమార్, పెద్ది వెంకటయ్య వివరించారు. తెలుగు కథ ప్రాంతీయ స్పృహపై బి.ఎస్. రాములు, సోదరకవులుపై శ్రీరంగాచార్య, తెలంగాణ సామెతలు జనజీవనం పై దామోదరరావు, 'తెలంగాణా పలుకుబళ్ళు'పై నాగళ్ళ రామశాస్త్రి, తెలంగాణలో అభ్యుదయ రచయితలు ఎస్వీ సత్యనారాయణగారు సినీ రంగంలో తెలంగాణపై వి.వి. రామారావు గేయ సాహిత్యంపై వి. వీరాచారి. పత్రికలు - పత్రికా రచనపై వరవరరావు - తెలంగాణ వచన కవిత సాహిత్య సంస్థలుపై బన్నా అయిలయ్య ఉర్దూ విద్వత్తుగల తెలుగు కవుల గూర్చి సామల సదాశివ, అర్ధశతాబ్ది సామాజిక రాజకీయ ఉద్యమాలు స్త్రీల చైతన్యంపై కాత్యాయినీ విద్మహే స్త్రీ చైతన్యంపై విజయలక్ష్మి, సంస్కరణ ఉద్యమాలపై కసిరెడ్డి వెంకటరెడ్డి, మిమిక్రీపై బొమ్మా శ్రీనివాస్, న్యాయం - న్యాయస్థానాలపై సుగుణాకరరావు. తెలంగాణ అస్తిత్వ పోరాట పూర్వాపరాలపై వెలపాటి రామిరెడ్డి, కోలాహలం రాంకిశోర్, ఎన్. వేణుగోపాల్‌లు సమీక్షించారు.

స్థూలంగా పరిశీలిస్తే అనేక అంశాలపై అనేకానేక అభిప్రాయాల సమాహారంలా సత్కృతి దర్శనమిస్తుంది. ప్రతి సాహితీ ప్రియుడు, సాంస్కృతిక కళాహృదయుడూ తప్పక చదవాల్సిన సంచికిది. తెలంగాణకు సంబంధించిన చరిత్ర, సంస్కృతి పరిణామాల విజ్ఞానమెంటో అందించే ఈ మనోహర బాబు షష్టిపూర్తి అభినందన సంచికను తెలంగాణ సాహిత్య, సాంస్కృతిక విశిష్ట సంచికగా పేర్కొనవచ్చు. అయితే ఇన్ని విభిన్న అంశాలకంటే ఒక్క సాహిత్యమో, కవిత్వమో, ఏదో ఒక విషయంపై కేంద్రీకరించి తీసినట్లయితే ఇంకా సమగ్రంగా వచ్చేదని అనిపించింది. ప్రతి వ్యాసంలో మనోహర బాబుగారి చిత్రం కంటే తెలంగాణలోని చారిత్రక కట్టడాలు, ప్రదేశాలు లేదా ప్రాచీన కవుల ఫోటోలు ఇస్తే సంచికకు మరింత కళాత్మకత చేకూరేదనిపించింది. ఏదిఏమైన అభినందన సమితివారు అభినందనీయులు.

**వ్యాసరచయిత ఫోన్: 9948787660**

# నానీల రైతు కావ్యం

- డా॥ ఎస్. రఘు




"దేశానికి వెన్నెముక రైతు" అనే మాట ఒక పడికట్టు పదజాలంగా, అరిగిపోయిన స్థితి వాక్యంగా అనిపించడం నేటి చేదు నిజం! ఒక్కసారి మేరెడ్డి యాదగిరిరెడ్డి 'రైతు నానీలు' చదివితే దుర్భరమైన రైతు బతుకు చిత్రం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. సాగు చేస్తున్న పొలమే రైతు జీవన రణక్షేత్రంగా మారిన దుస్థితి వెల్లడవుతుంది. 'వ్యవసాయం ఓ మాయాజూదంగా' వర్ణించిన కవి మాటల్లోని కఠిన సత్యాన్ని అందరూ అంగీకరించవలసిందే. అందుకే మేరెడ్డి రైతు నానీలు రైతుల పాలిటి వాస్తవ శ్వేతపత్రంగా పిలుచుకోవడంలో ఏమాత్రం సందేహం లేదు. ఈ నానీలు రైతు జీవనాన్ని, వాస్తవ స్థితిని యథాతథంగా వ్యాఖ్యానించాయి.

"రైతు జీవనం
ఓ పరమపద సోపానం
నిచ్చెనలుండవు
అన్నీ పాములే"

ఈ పాములకు కూడా రకరకాల పేర్లు, రూపాలున్నాయి. నేడు అమలవుతున్న అరాచక విధానాలు సమగ్రంగా ఈ రైతు నానీల్లో కనిపిస్తాయి.

నిజంగానే రైతు జీవితం ఒక మహాభారతంలా అనిపిస్తుంది. అందుకే మేరెడ్డి ఒక నానీలో ఇలా అంటాడు.

"వ్యవసాయం / ఓ మాయాజూదం
అడుగడుగునా / శకుని మామలే"

రైతు వ్యవసాయమనే మాయాజూదం ఆడకా తప్పదు. ఓడిపోకా తప్పదు. పంట చేతికొచ్చేనాటికి ప్రకృతి కూడా శకునిలా మారిపోతుంది. కోలుకోలేని దెబ్బతీస్తుంది. రైతు బతుకును ఛిద్రం చేస్తున్న కల్తీ విత్తనం,'కల్తీ మందులు, దళారులు, కరెంట్ కోతలు, మైక్రోఫైనాన్స్‌లు ఎటు చూసినా దిక్కుతోచని దైన్యాన్ని ఆర్ద్రతతో చిత్రించారు మేరెడ్డి యాదగిరిరెడ్డి. కవికి రైతు పట్ల అపారమైన ప్రేమాభిమానాలు ఉన్నాయి. అందుకే రైతుని 'మట్టిని మెతుకులుగా / మార్చిన మహా మాంత్రికుడిగా' కీర్తించారు కవి.

రచయితలు తమ స్థానీయ మూల్యాల పట్ల అంతులేని ఆంతరంగిక సంబంధాన్ని, మానసిక అనుబంధాన్ని ముడివేసుకుంటారు. తను పుట్టిన మట్టిలోని మార్మిక శక్తిని ఆవాహన చేసుకుని అక్షరాల్లో ప్రతిఫలించే ప్రయత్నం చేస్తారు. ఇదో అరుదైన అనువాద క్రియ. మేరెడ్డివారు తమ తొలి క్రియావేశాన్ని కథల్లో ప్రతిఫలింపచేశారు. తన స్థానీయ మూల్యాల సాంస్కృతికావేశాన్ని, ఆవేదనల్ని కథలుగా అందించి తెలంగాణా దుఃఖచిత్రాన్ని సజీవంగా చిత్రించారు. కథా రచయితగా తనదైన ఉనికిని నిరూపించుకున్నారు.

రచయితల అనుభవ పరిధి విస్తృతమవుతున్న కొద్ది రచనల్లోని ఇతివృత్తం లోతైన అనుభవాన్ని, స్పష్టమైన దృక్పథాన్ని, చైతన్యాన్ని అందిపుచ్చుకుంటుంది. మేరెడ్డిలో ఆ కొత్త చైతన్యం కనిపిస్తుంది. మనిషికి - మట్టికి మధ్య ఏర్పడిన గాఢమైన అద్భుతబంధాన్ని మరింత స్పష్టమైన దృష్టితో దర్శించారు. ఆ దర్శన ఫలితమే ఈ రైతు నానీలు. తన ఆలోచనా తీవ్రతనూ, అభివ్యక్తి నైపుణ్యాన్ని మరింత పదును పెట్టుకుని ఈ నానీలు రాశారు. ఒక ఇతివృత్తాన్ని ప్రధానంగా తీసుకుని నానీలు రాయడమనేది అక్షరాలా సాముగరిడీ సాహసమే. పునరుక్తులు లేకుండా, విషయ తీవ్రత పలుచనవకుండా, కవితా సాంద్రత తగ్గకుండా వైవిధ్య నిర్వహణ చేయడం కవి ప్రతిభకు పరీక్షలాంటిది. ఆ సాహస పరీక్షలో విజేతగా నిలబడ్డారు మేరెడ్డి. వ్యవసాయం మీద ఒళ్ళు కదలకుండా రాయడమే కాదు, ఒళ్ళు కరిగేలా వ్యవసాయం చేసిన మట్టిమనిషి కాబట్టే ఈ రైతు నానీల్లో కవితాత్మ దర్శనమిస్తూ రైతు కావ్యానుభూతిని కలిగిస్తుంది. ఎవరూ వినలేని రైతు ఆత్మగత ధ్వనుల్ని, వెచ్చటి కన్నీళ్ళని, వెలకట్టలేని స్వేదాన్ని నాలుగు పాదాలతో నిబద్ధించి ఆలోచనలకు గురిచేస్తూ, ఆవేదనతో హృదయాల్ని కదిలించే ఈ 'రైతు నానీలు' చదవడం వ్యవసాయం చేయడమంత పవిత్రకార్యం!

**సెల్ : 9848208533**

# కొత్త పుస్తకాలు

## జీవించు - నేర్చుకో - అందించు




తమ్మేటి రఘోత్తమరెడ్డి

వెల : రూ.75/- పేజీలు : 139

**ప్రతులకు : 040-24652387**

నా తరువాత తరం కోసం ఏదైనా రాయలనిపించింది. మారుతున్న జీవన శైలికి అనుగుణంగా, తగిన సాహిత్య రూపం ఉండాలనుకున్నాను. అందుకు అనుగుణంగా 'కోటేషన్'ను ఒక ప్రక్రియగా భావించాను. నేను ఎరిగినంత మేర, జీవితం గురించి సూక్ష్మంగా నా అభిప్రాయాలను రాసి పెట్టాను. ఇందులోని కొన్ని విషయాల గురించి లోగడ చాలామంది చాలా రకాలుగా వ్యాఖ్యానించారు. అటువంటి వాటినికూడా వస్తుసమగ్రత కోసం నా దృక్పథంలోంచి తిరిగి వ్యాఖ్యానించాను. చాలా వరకు అనుభవాల్లోంచి నేను రూపొందించుకున్నవే.

**- తుమ్మేటి రఘోత్తమరెడ్డి**

## అన్నీ మన మధ్యనే ...




నానీలు

ఎస్.ఆర్. పృథ్వి

వెల : రూ.30/- పేజీలు : 34

**ప్రతులకు : 9989223245**

గుండె ఊటలు (నానీలు) సంపుటి 2006 సం॥లో వెలువరించాను. అప్పట్లో నానీలు వ్రాయడానికి, పుస్తకంగా వెలువరించడానికి తగిన ప్రోత్సాహమిచ్చిన డా॥ ఎన్.గోపి గారిని, శ్రీసోమేపల్లి వెంకట సుబ్బయ్యగారిని, మరోసారిక్కడ గుర్తు చేసుకోవాలి. అమ్మలైన ఇరువురికి ధన్యవాదాలు.

ఇది నా రెండవ నానీలు సంపుటి. ఈ మధ్యకాలంలో వ్రాసిన నానీలలో కొన్నింటిని ఏరి, ఈ సంపుటి ద్వారా మీ ముందుకు తీసుకువచ్చాను.

**ఎస్.ఆర్. పృథ్వి**

## సోమేపల్లి పురస్కార కథలు




వెల : రూ.100/- పేజీలు : 200

**ప్రతులకు : రమ్యభారతి ప్రచురణ**

పెద్ద పెద్ద కథలు చదివే తీరిక, సమయం లేని ఈ కాలంలో అతి తక్కువ నిడివిలో ... క్లుప్తంగా, సూటీగా పాఠకుల మెదళ్ళలో మంచి ఆలోచనలు రేకెత్తించే దిశను కలిగించేందుకు ఈ 'చిన్న కథ' అనేది శక్తివంతమైన సాధనమని మా నమ్మకం. ఆ నమ్మకం వమ్ము కాకుండా మేం గత నాలుగేళ్ళుగా నిర్వహిస్తున్న 'చిన్న కథలు పోటీలకు' రచయితల నుంచే కాకుండా, పాఠకుల నుండి విశేష ఆదరణ లభించడమే ఈ 'సోమేపల్లి పురస్కారాల కథలు' మీ ముందుకు తీసుకురావడానికి కారణమైంది.

**- సోమేపల్లి వెంకట సుబ్బయ్య**

## సామాజిక రాజకీయ విప్లవం బౌద్ధ సాంస్కృతిక నిర్మాణం




డా॥ బి.ఆర్. అంబేద్కర్

వెల : రూ.100/- పేజీలు : 182

**ప్రతులకు : 9963827776**

ఈ గ్రంథంలో అంబేద్కర్ విలువైన ప్రవచనాలున్నాయి. రాజకీయ, తాత్విక, సామాజిక, పర్యావరణ, వ్యక్తిత్వ నిరూపణకు సంబంధించి డా॥బి.ఆర్. అంబేద్కర్ వ్యక్తపరచిన అభిప్రాయాలు రచనారూపంగా, ఉపన్యాస రూపంగా, లేఖల రూపంగా ఈ గ్రంథంలో పొందుపర్చబడ్డాయి.

సంపాదకులు డా॥ కత్తి పద్మారావుగారు ఈ పనిని నిబద్ధంగా నిర్వహించారు. వారు రాసిన పీఠిక అంబేద్కర్ జీవన గమనాన్ని దర్శింపజేస్తుంది.

**- లోకాయత ప్రచురణలు**

## ఆనందభైరవి




దేశెట్టి కేశవరావు

వెల : రూ.70/- పేజీలు : 160

**ప్రతులకు : 08581-256090**

ఈ సంపుటిలో కొన్ని కథలు వుడ్‌హౌస్ స్ఫూర్తితో వ్రాయబడినవని పాఠకులు సులభంగా గ్రహించగలరు. ప్రేమ కథలైతే అందరూ చదువుతారని ఆ ఫ్రేంని తీసుకోవడం జరిగింది. అంతకు మించి మారే ఉద్దేశమూ లేదు. ఇంతకు మించి ఏం చెప్పగలను?

నమస్సులతో...

**- కే**

## మౌనశబ్దాలు




నానీలు

డా॥ విష్ణువందనాదేవి

వెల : రూ.30/- పేజీలు : 49

**ప్రతులకు : 9550702025**

మౌన శబ్దాలంటే మౌనంగా ఉండే శబ్దాలని కాదు. మౌనంలోంచి వెలువడిన శబ్దాలని. మౌనం అంటే ఇక్కడ తపన. పుస్తకానికి శీర్షికే ఇంత భావస్ఫోరకంగా పెట్టగలిగిన డా॥ విష్ణువందనాదేవి రచించిన నానీలు ఎలా ఉంటాయో ముందే కొంత ఊహించుకోవచ్చు.

**- ఎన్. గోపి**

# కొత్త పుస్తకాలు

## నాగులగుట్ట కథలు

నిశాపతి

వెల : రూ.100/- పేజీలు : 190

ప్రతులకు : 9848330708




ఈ రచయిత గొప్ప హృదయవాది. భావుకుడు, కరుణార్ద్ర సముపేతచిత్తుడు, మానవత, మానవత అంటూ అది సాహిత్యానుభూతికి అత్యంతమూ లేదా ఆద్యంతమూ ఆవశ్యకమంటూ గొప్ప రచనలను విశ్లేషణ పూర్వకంగా ఉదాహరించే సాహితీ విమర్శకులు, సాహితీవేత్తలు ఈ కథలను తప్పక మెచ్చుకుంటారు.

- అక్కిరాజు రమాపతిరావు

## ఎగరేసిన ఎర్రని జెండా

కామ్రేడ్ టి.వి.ఆర్. చంద్రం

వెల : రూ.30/- పేజీలు : 58

ప్రతులకు : 0866 - 2433359




భద్రాచలం డివిజన్ కమ్యూనిస్టు ఉద్యమానికి జీవగర్ర ఈ అరుణ సౌధానికి పునాది రాయి కామ్రేడ్ టి.వి.ఆర్. చంద్రం ఆయన చనిపోవడానికి ముందు, రెండు మూడేళ్ళు క్రితం కామ్రేడ్ చిర్రావూరి లక్ష్మీ నరసయ్య గారి సూచన మేరకు ఈ ప్రాంత ఉద్యమ నిర్మాణ నేపధ్యాన్నీ చరిత్రనూ సంక్షిప్తంగా రికార్డు చేశారు. దానికిది పుస్తక రూపం.

సాహితీమిత్రులు

## స్వర్ణ నందులు

ఆకెళ్ళ

వెల : రూ.75/- పేజీలు : 132

ప్రతులకు : ...............................




ఆకెళ్ల రచించిగా గంగోత్రి సాయి బృందం ప్రదర్శింస్తున్న “మీ ఇల్లెక్కడ?, “ఇదొక విషాదం” నాటకాలు. ఈ రెండింటిలో మీ “ఇల్లెక్కడ” నాటకం ... ప్రతీ అద్దెకొంప మధ్యతరగతి అడుగు జీవి హృదయాన్నీ తాకుతుంది... రెండవది ఇదొక విషాదం ... అందులోని అంశ... “డబ్బు చుట్టూ విలువలు పతనం” అనేది అందరికీ వర్తించినా కథా పాత్రలూ సంఘటనాపరంగా హై ప్రొఫైల్ ఫ్యామిలీకి చెందినదవ్వటం వల్ల దానికీ దీనికీ ప్రేక్షకులకు సామీప్యతలో భేదం వుండి తీరుతుంది.

ఉదయ శంకర్ టేకి

## మహిత

సామాన్య

వెల : రూ.20/- పేజీలు : 24

ప్రతులకు : 9775600900




“బుజ్జమ్మా! ఒక రవ్వంత ఇది చదువు నాయన, కంటి చూపు ఆనటంలేద”ని నాయనమ్మ పిలిస్తే చదవదా మనిపోతా ఉండానా, అంతలోకి మా నాయనొచ్చి మొన్న చూసిపోయిన పెళ్లిచూపులోళ్ళ గురించి చెప్పడం మొదలు బెట్టేడు. ముందుగా మీకు నా గురించి చెప్పనీయండి. నా పేరు మహిత. ఆ పేరు మా అత్త ఏదో పుస్తకంలో చదివి పెట్టిందంట. మహిత అంటే ‘గొప్పది’ అంట.. మా అత్త కూతురు చెప్పింది. నాకిప్పుడు పదహారేళ్ళు మొన్ననే నా పదో తరగతి రిజల్ట్స్ తెలిసాయి.

- సామాన్య

## ఎల్లడి

ఉదారి నారాయణ, తదితరులు

వెల : రూ.60/- పేజీలు : 119

ప్రతులకు : 9441413666




ఈ సంకలనంలో సుమారు ముప్పైనాలుగు మంది కవుల కవితలు, 13పాటలు వేటికవే ప్రత్యేకతను సంతరించుకున్నాయి. ప్రజాపాటను ప్రపంచానికి చాటిన గూడ అంజయ్య, పాట మొదలుకొని దగాపడ్డ తెలంగాణా బిడ్డల బతుకుల్ని, సోయి దెచ్చుకొని పోరాదుతున్న వైనాన్ని వాడిగా వేడిగా పాటలల్లిండ్రు ఇక్కడి కవి గాయకులు. తెలంగాణా కవితా లోకానికి ఆ మాటకొస్తే తెలుగు సాహిత్య లోకానికి ఏమాత్రం తీసిపోని విధంగా ఈ కవులు కవిత్వంను సృష్టించిండ్రు. “మా బత్కులల్ల/మేమే మన్ను బోసుకున్నం” అన్న వాక్యాలల్లో దారుణాన్ని కవి ఎంత ఆర్ద్రంగా చిత్రీకరించిండో...

- డా॥ ఉదారి నారాయణ

## నివద్దిగ జెప్తుండ ?

దంతోజు అశాకాచారి

వెల : రూ.30/- పేజీలు : 81

ప్రతులకు : 9291326146




ఆయనను సహజకవిగా చెప్పవచ్చు. ఎందుకంటే ఆయన కవిత్వంలో ఉండే రాటుదేలిన డాంబిక అలంకారిక భాష ఉండదు. ఆయన కవిత్వం తెలంగాణా జానపదుల సంభాషణ, చమత్కారం, సహజత్వం ఊరుతూ - ఊరిస్తూ ఉంటుంది. పెదవుల మీది నుండి వెలువడే సవ్వడిలా కాకుండా గుండె నుండి ఉబికి వచ్చే నిసర్గ స్వరం ఉంటుంది. దీనికి ఈ సంకలనంలోని ప్రతి కవితా అద్దం పడుతుందని చెప్పడం స్వభావోక్తి మాత్రమే.

- వల్లభాపురం జనార్దన

# ఉత్సాహం నింపిన సాహిత్య కార్యశాల



సాహితీస్రవంతి ఆధ్వర్యాన విజయవాడలో మాంటిస్సోరి మహిళా కళాశాల ఆడిటోరియంలో రెండు రోజులు సెప్టెంబరు 30, అక్టోబర్ 1వ తేదీ 'మూడు యాభైల గురజాడ సాహిత్య కార్యశాల జరిగింది. ఈ కార్యక్రమంలో రాష్ట్ర వ్యాప్తంగా 150 మంది కవులు, సాహితీవేత్తలు, సాహితీ మిత్రులు పాల్గొన్నారు. రెండు రోజుల్లో నాలుగు సభా కార్యక్రమాలు జరిగాయి. ఈ సభా కార్యక్రమంలో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఉపకులపతి ప్రొఫెసర్ కె. వియన్నారావు మాట్లాడుతూ గురజాడ రచనల్లోని విలువలు ఏ కాలంలోనైనా అనుసరించదగినవీ అందుకే ఆయన సాహిత్యం సార్వజనీనం, సార్వకాలీనమని ఆయన పేర్కొన్నారు. ముఖ్య అతిధిగా శాసన మండలి సభ్యుల కె.ఎస్.లక్ష్మణరావు పాల్గొన్నారు. తెలుగు భాషాభివృద్ధికి తన వంతు కృషి చేస్తానని, తెలుగు భాషాభివృద్ధికి తీర్మానం చేయాలనీ శాసనమండలిలో ఉన్న ఎనిమిది మంది పిడిఎఫ్ సభ్యులం గత నెల 22న వాయిదా తీర్మానం ఇచ్చామనీ గుర్తుచేసారు. తెలుగు భాషాభివృద్ధికి ఏం చేయబోతున్నారనీ, తెలుగు సంస్కృతి, భాష అభివృద్ధికి ప్రత్యేక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేయాలనీ, ప్రభుత్వాన్ని అడిగానన్నారు. డాక్టర్ వెన్నా వల్లభరావు, డా. గుమ్మా సాంబశివరావు రచించిన 'గురజాడ కథలు - నాటకాలు' పుస్తకాన్ని లక్ష్మణరావు ఆవిష్కరించారు. సాహితీ స్రవంతి ప్రచురించిన ఈ పుస్తకం తొలికాపీని శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత విశ్వేశ్వరరావుకు అందించారు. గోళ్ల నారాయణరావు అధ్యక్షత వహించిన సభలో గురజాడ 'అపురూప పత్రాలు - చిత్రాలు' పుస్తకాన్ని డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు ఆవిష్కరించారు. సాహిత్య కార్యశాలకు ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ ప్రధాన కార్యదర్శి గోళ్ల నారాయణరావు అధ్యక్షత వహించారు. అనంతరం 'సాహిత్య రీతులపై' ప్రసంగాలు, పుస్తకావిష్కరణలు జరిగాయి. ప్రముఖ రచయిత్రి ఓల్గా, ప్రముఖ కవి అద్దేపల్లి రామమోహనరావు, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అసోసియేట్ ప్రొఫెసర్ మేడిపల్లి రవికుమార్, సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఆనందాచారి, డాక్టర్ గుమ్మా సాంబశివరావు. డాక్టర్ వెన్నా వల్లభరావు, డాక్టర్ రావెళ్ల శ్రీనివాసరావు పాల్గొన్నారు.

ఆదివారం మధ్యాహ్నం జరిగిన 'నాటకశాల'లో నాటక రచనపై ప్రసంగాలు సాగాయి. ఈ కార్యక్రమానికి సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఎస్. వెంకట్రావు అధ్యక్షత వహించారు. సినీ దర్శకులు సి. ఉమామహేశ్వరరావు, ప్రముఖ నాటక రచయిత వై.ఎస్. కృష్ణేశ్వరరావు, సినీ గేయ రచయిత అదృష్ట దీపక్, ప్రజాసాహితీ సంపాదకులు కొత్తపల్లి రవిబాబు, ప్రజానాట్యమండలి రాష్ట్ర నాయకులు కె. దేవేంద్ర ప్రసంగించారు. సాయంత్రం జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్లో సుమధుర కళానికేతన్ ఆధ్వర్యంలో 'కన్యాశుల్కం' నాటకంలోని కొన్ని సన్నివేశాలను ప్రదర్శించారు.

రెండో రోజైన సోమవారం జరిగిన సాహిత్య కార్యశాలలో ఉదయం బాల సాహిత్యంపై సదస్సు జరిగింది. ఈ కార్యక్రమానికి చినుకు సాహిత్య మాస పత్రిక సంపాదకులు నండూరి రాజగోపాల్ అధ్యక్షత వహించారు. బాల సాహితీవేత్త రెడ్డి రాఘవయ్య, సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు సత్యాజీ, అరిబండి ట్రస్ట్ నిర్వాహకులు అరిబండి ప్రసాదరావు, బాలబంధు అలపర్తి వెంకట సుబ్బారావు ప్రసంగించారు. ఈ కార్యక్రమానికి డాక్టర్ రావెళ్ల శ్రీనివాసరావు వందన సమర్పణ చేశారు. మధ్యాహ్నం జరిగిన కవిత్వశాలలో కవులు సీతారాం, ఖాదర్ మొహిద్దీన్ సందేశాలను అందించారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో 30 మంది కవులు పాల్గొన్నారు.

సమాజాన్ని ప్రభావితం చేసే నాటక రచనలు కరువయ్యాయని పలువురు ప్రముఖ రచయితలు, సాహితీవేత్తలు నాటక సదస్సులో అభిప్రాయపడ్డారు. గతంలో సమాజాన్ని ప్రభావితం చేసే స్థాయిలో నాటక రచన ఉండేదని, ప్రస్తుతం అటువంటి రచనలు, రచయితలు కనిపించడంలేదని ఆవేదన వ్యక్తం చేశారు. మొదటిరోజు మధ్యాహ్నం జరిగిన ఈ నాటకశాలలో వక్తలు మాట్లాడుతూ సామాజిక స్పృహను రేకెత్తించి, ప్రజలు తమ దైనందిన జీవితంలో ఎదుర్కొంటున్న ఒడిదుడుకులను ప్రభావితం చేసేవిధంగా నాటక రచన సాగించాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉందన్నారు. సి. ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ మంచి నాటకం మంచి సాహిత్యమవుతుందని, అలాగే మంచి సాహిత్యం మంచి నాటకమవుతుందని, ఈ రెండిటికీ మధ్య విడదీయరాని బంధం ఉందని అన్నారు. వై.ఎస్. కృష్ణేశ్వరరావు ప్రజలకు చెప్పదలుచుకున్న విషయంపై రచయితకు ముందుగానే నిర్దిష్టమైన, స్పష్టమైన అభిప్రాయం ఉండాలన్నారు. గురజాడను స్ఫూర్తిగా తీసుకుని సమాజంలో తమవంతు పాత్ర పోషించాలన్నారు. సినీ గేయ రచయిత అదృష్ట దీపక్ మాట్లాడుతూ కళలు లాభార్జన కోసమేనన్న భావనను సినిమాలు, టీవీలు కలిగించాయన్నారు. మంచి నాటకాన్ని చూసినప్పుడే కాదు.. చదివినప్పుడు కూడా ప్రభావితం చేసే విధంగా దానిని రూపకల్పన చేయాలన్నారు. కొత్తపల్లి రవిబాబు మాట్లాడుతూ మన నాటకరంగం పాతాళంకన్నా కిందకు దిగజారిపోయిందని అన్నారు. ప్రజానాట్యమండలి రాష్ట్ర నాయకులు కె.దేవేంద్ర మాట్లాడుతూ కళ మమేకం చేస్తూ నాటికలను రూపొందిస్తే ప్రజలను ఆకర్షించవచ్చని అభిప్రాయపడ్డారు. నాటకం వేయడమంటే

నవరసాలనూ రచయిత గమనంలో ఉంచుకోవాలన్నారు. కన్యాశుల్కం, మాభూమి, ముందడుగు నాటికలు సమాజాన్ని ప్రభావితం చేసినవేనన్నారు. సమాజంలో దారిద్ర్యం, దోపిడీ, అణచివేత, అసమానతలు అప్పుడూ, ఇప్పుడూ ఉన్నాయని, అయితే రూపాలు మార్చుకోవటంలోనే తేడా ఉందని అన్నారు. ప్రపంచీకరణ ప్రజలను వస్తువ్యామోహం వైపు నడిపిస్తోందని, దాని నుండి బయటపడాల్సిన అవసరం ఉందని అన్నారు. ఈ నాటకశాలకు సాహితీ స్రవంతి కార్యదర్శి ఎస్. వెంకట్రావు అధ్యక్షత వహించి మాట్లాడుతూ ప్రపంచీకరణ నేపధ్యంలో ప్రజలు దుర్భర జీవితాలను అనుభవిస్తున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రపంచీకరణ దుష్ఫలితాలను తిప్పికొట్టడానికి కళారంగం ఎంతగానో దోహదపడుతోందన్నారు. కళల ద్వారా ప్రజలను చైతన్య పర్చాల్సిన బాధ్యత రచయితలపై ఉందన్నారు.

బాలలకు సమభావం, స్వేచ్ఛ, స్వాతంత్ర్య భావాలను నేర్పే సాహిత్యం సమాజానికి అవసరమని పలువురు వక్తలు అభిప్రాయపడ్డారు. సాహిత్యాన్ని బాలలకు చేరువ చేయడంపై ప్రత్యేక దృష్టి సారించాలన్నారు. రెండోరోజు బాల సాహిత్యంపై జరిగిన సదస్సుకు 'చినుకు' మాసపత్రిక సంపాదకులు నండూరి రాజగోపాల్ అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా రెడ్డి రాఘవయ్య మాట్లాడుతూ.. 1952లో తెలుగు బాలల రచయితల మహాసభలు విజయవాడలోని హనుమంతరాయ గ్రంథాలయంలో జరిగాయనీ, నార్ల చిరంజీవి వంటి అభ్యుదయ రచయితలు దీనిని నిర్వహించారనీ గుర్తుచేశారు. నాటి నుంచి నేటి వరకూ ఎందరో రచయితలు బాల సాహిత్యాన్ని సుసంపన్నం చేశారనీ తెలిపారు. పిల్లల్లో సాహిత్యం పట్ల జిజ్ఞాస పెంచాలంటే.. వారికి ఎలాంటి పుస్తకాలు కావాలో వాటినే తయారు చేయాలని సూచించారు. ప్రజాశక్తి బుక్‌హౌస్ పిల్లల సాహిత్యాన్ని పెద్దఎత్తున ప్రచురించడాన్ని ఆయన అభినందించారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు సత్యాజీ మాట్లాడుతూ.. అప్పట్లో వచ్చిన విశాల బాలసాహిత్యంలో పిల్లల ఆలోచనల ఆధారంగా దేశం అభివృద్ధి చెందుతుందనే స్పృహ ఉండేదన్నారు. పిల్లల్లో ఆలోచన పెంచేందుకు ఉపయోగపడే రష్యన్ బాల సాహిత్యం ఆ దేశం విచ్ఛిన్నమైన తరువాత తగ్గిందన్నారు. 1991 తరువాత వచ్చిన ఆర్థిక సంస్కరణలు బాలల్లో విశేష మార్పును తీసుకొచ్చాయన్నారు. విశ్రాంత వ్యవసాయ శాస్త్రవేత్త అరిబండి ప్రసాదరావు మాట్లాడుతూ మార్కెట్ విలువల ఆధారంగా నేడు పెరుగుతున్న కొద్దీ స్వాతంత్ర్యం, సమభావన అనే ఆలోచనలే లేకుండా పోతున్నాయని అన్నారు. అలపర్తి వెంకట సుబ్బారావు మాట్లాడుతూ పిల్లలకు చెప్పాలనుకున్న విషయాన్ని రచనకంటే గేయాల ద్వారా ఎక్కువగా వివరించడానికి అవకాశం ఉందన్నారు. సాహితీ స్రవంతి విజయవాడ నగర అధ్యక్షులు డాక్టర్ రావెల్ల శ్రీనివాసరావు వక్తలను వేదిక మీదకు ఆహ్వానించారు. డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు బాల్యంపై గజల్ పాడి ఆహూతులను అలరించారు.

తెలుగులో కవిత్వపు స్థాయి తగ్గిందనీ, యువత కూడా కవిత్వం పట్ల ఆసక్తి చూపడం లేదనీ వక్తలు అన్నారు. రెండవరోజు మధ్యాహ్నం నుండి కవిత్వశాల జరిగింది. ఈ సందర్భంగా ప్రముఖ కవి సీతారాం మాట్లాడుతూ కవిత్వం కవికీ – పాఠకుడికీ మధ్య జరిగే ఆంతరంగిక సంభాషణ వంటిదన్నారు. అయితే కవిత్వాన్ని మన జీవితంలో భాగంగా చదవడంలేదని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రముఖ కవి ఖాదర్ మొహిద్దీన్ మాట్లాడుతూ జీవితానికి పనికివచ్చే అంశంగా కవిత్వాన్ని పరిగణించడం లేదన్నారు. సమాజానికి కవిత్వం అవసరం ఎటువంటిదో చూపాలన్నారు. సాహితీ స్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యుడు చీకటి దివాకర్ మాట్లాడుతూ గురజాడ భావజాలాన్ని ప్రజల్లోకి తీసుకువెళ్లాలన్నారు. ఈ కార్యక్రమానికి సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ అధ్యక్షత వహించారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో రాష్ట్రం నలుమూలల నుండి వచ్చిన కవులు తమ వచన, పద్య కవితలతో అలరించారు. డాక్టర్ రావెల్ల శ్రీనివాసరావు, గోళ్ల నారాయణరావు,సర్వజిత్, జి.రాజశేఖర్, తంగిరాల చక్రవర్తి, ఎరుకలపూడి గోపీనాథరావు, బూరుగుపల్లి ప్రభావతి, కోకా విమలకుమారి, సి. వాసుదేవరావు, పొన్నాడ సత్యప్రకాశరావు, బాల సుధాకరమౌళి, పి.ఎస్.శ్రీనివాసరావు, శిఖా ఆకాష్, చిత్తలూరి సత్యనారాయణ. సి.హెచ్.వి. బృందావన, శ్రీనాగాస్త్ర, సరికొండ నరసింహరాజు, పి. మోహనరామ్‌ప్రసాద్, ఎం.అంజయ్య, కె.ఎన్.వి. ప్రసాదు, ఎస్. శైలజ, మహ్మద్‌ఖాన్, డాక్టర్ జయరామిరెడ్డి, సింహాద్రి వాణి, డాక్టర్ గుమ్మా సాంబశివరావు, శాంతిశ్రీ, డాక్టర్ వెన్నా వల్లభరావు, త్రిమూర్తులు, వొరప్రసాద్, వి. ఉమామహేశ్వరి తదితరులు తమ తమ కవితలను వినిపించారు. ఈ కార్యక్రమానికి శాంతిశ్రీ, ఉమామహేశ్వరి, చీకటి దివాకర్ సమన్వయకర్తలుగా వ్యవహరించారు.

మొదటిరోజు ఉదయం ప్రారంభంలో భవానీపురంలోని నేతాజీ విద్యాలయానికి చెందిన బాలబాలికలు 'దేశమును ప్రేమించుమన్నా' నృత్య రూపాకాన్ని ప్రదర్శించారు. గురజాడ 150వ జయంతి ఉత్సవాల్లో భాగంగా 150 విద్యార్థులు ప్రదర్శించిన ఈ రూపకం వర్తమాన భారతాన్ని కళ్లకు కట్టింది. అవినీతి, ఆత్మహత్యలు, ఆకలిచావు, ప్రాంతీయవాదాలు, ఆడపిల్లలపై జరుగుతున్న అత్యాచారాలు, నిరుద్యోగం వంటి సమస్యలతో ఉన్న భారతావనిని రేఖామాత్రంగా చూపింది. గురజాడ దేశభక్తి గీతం అందుకుంటూ ఈ దేశాన్ని ప్రేమిద్దాం... మంచిని పెంచుదాం అంటూ విద్యార్థులు నృత్యాన్ని ప్రదర్శించారు. ప్రత్యేకంగా తయారు చేసిన తెలుగు అక్షరాలను భుజాన పెట్టుకుని గురజాడే మా వెలుగుజాడ అంటూ చేసిన నృత్యరూపకం అలరించింది. ఈ రూపకానికి నృత్య దర్శకునిగా ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శి ఆర్. రాజేష్ వ్యవహరించగా, కళాకారులు ఆర్.వినోద్ పర్యవేక్షించారు.

సాయంత్రం సుమధుర కళానికేతన్ విజయవాడ వారిచే కన్యాశుల్కం నాటకంలో నుండి చిరు ఘట్టాన్ని ప్రదర్శించారు. నాటి పరిస్థితులు అద్దం పట్టే విధంగా నాటకాన్ని చిత్రీకరించారు. ఈ నాటకంలో గిరీశంగా ఎం.సి.దాసు, రామప్ప పంతులుగా బి. సత్యనారాయణ, మధురవాణిగా రాజేశ్వరి, గురజాడ అప్పారావుగా మోహనరామ ప్రసాద్ చక్కగా నటించారు. రామసూర్యప్రకాష్ దర్శకత్వం వహించారు.

శ్రీశ్రీ సాహిత్య నిధి అధినేత సింగంపల్లి అశోక్‌కుమార్ వెలువరించిన 'సంతాపకీయాలు' పుస్తకాన్ని సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఎస్. వెంకట్రావు ఆవిష్కరించారు. తొలి ప్రతిని ప్రముఖ కవి ఖాదర్ మొహిద్దీన్‌కు అందచేశారు. రెండురోజుల సాహిత్య కార్యక్రమాలు సభికుల్లో ఉత్సాహాన్ని నింపాయి.

**డా. రావెల్ల శ్రీనివాసరావు,**
**పట్టెం వెంకటేశ్వరరావు**

## ఆధిపత్య సంస్కృతికి తావుండరాదు




సెప్టెంబరు 8న సుందరయ్య విజ్ఞానకేంద్రంలో సాహితీస్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో జరిగిన ప్రత్యామ్నాయ మీడియా సాధ్యమే సదస్సులో మాట్లాడుతున్న తెలకపల్లి రవి. చిత్రంలో తంగిరాల చక్రవర్తి, జి. యాదగిరి రావు

ప్రత్యామ్నాయ మీడియాలో ఆధిపత్య సంస్కృతికి తావుండరాదని, సామ్రాజ్యవాద కార్పొరేట్ ఆధిపత్యం మీడియాలో ఎక్కడా కన్పించకూడదని మీడియా విశ్లేషకులు, సాహిత్య ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి అన్నారు. సాహితీ స్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో సెప్టెంబరు 8న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో 'ప్రత్యామ్నాయ మీడియా సాధ్యమే' అన్న అంశంపై సదస్సు జరిగింది. సదస్సుకు ముఖ్య అతిథిగా తెలకపల్లిరవి హాజరయ్యారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ సమాజంలో ఎలక్ట్రానిక్ మీడియా ప్రభావం పెరిగిన తర్వాత మీడియాలో వర్గపక్షపాతం, కార్పొరేట్ పక్షపాతం పెరిగిందన్నారు. మీడియాకు ప్రజలు ఆలోచించటం ఇష్టం ఉండదనీ, ప్రజలను ఆలోచింపజేసే అంశాలు మీడియాలో కనిపించవని అన్నారు. ఎలక్రానిక్ మీడియా స్పాన్సర్లపై ఆధారపడి ఉంటుందన్నారు. ప్రజలు, ఓటర్లు వినియోగదారులు, ప్రేక్షకులు, మోసపోతూనే ఉంటారన్నారు. ఆధిపత్య సంస్కృతిని అంగీకరించటం, ఆధిపత్యానికి గురయేవాళ్లను కూడా అంగీకరింపజేయటం మీడియా ప్రధాన అంశమని ఆయన తెలిపారు. ఈ సదస్సుకు సాహితీ స్రవంతి నగర సంయుక్త కార్యదర్శి తంగిరాల చక్రవర్తి అధ్యక్షత వహించారు. కార్యక్రమంలో సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్, నగర కమిటీ ప్రధాన కార్యదర్శి జి. యాదగిరిరావు, శాంతిశ్రీ, వెంకటి శ్రీనివాస్ పాల్గొన్నారు. అనంతరం వర్తమాన సమస్యలపై జనకవనం నిర్వహించారు. వి.ఎస్.వి. ప్రసాద్, మోపిదేవి రాధాకృష్ణ, సుతారపు వెంకటనారాయణ, కందేపి రాజ్యలక్ష్మి, శిష్టా మాధవి, రత్నా మహీధర్, మౌనశ్రీ మల్లిక్, సాహిత్య ప్రకాశ్, పెద్దూరి దాసు, ఒబ్బిని సన్యాసి రావు, తెళ్ళపురి సుధీర్ కుమార్, కె. విల్సన్ రావు, బులుసు సరోజిని, టి. కిశోర్, కె.రాధాకృష్ణ, బొపార, లక్ష్మీకాంత శర్మ, తదితరులు జనకవనంలో తమ కవితలు వినిపించారు. ఈ కార్యక్రమాన్ని సాహితీ స్రవంతి నగర ఉపాధ్యక్షులు గేరా నిర్వహించారు. కార్యక్రమంలో పలువురు కవులు తమ కవితలు చదివి వినిపించారు.

## చిరస్మరణీయుడు గురజాడ




*గురజాడ 150 వ జయంతి సందర్భంగా ఖమ్మంలో జరిగిన సభలో మోతుకూరి నరహరి. చిత్రంలో ముప్వా శ్రీనివాసరావు, చింతరెడ్డి వెంకటరెడ్డి, కె. ఆనందాచారి, దేవేంద్ర, సీతారాం తదితరులు*

తెలుగు భాష, తెలుగు వారు ఉన్నంతకాలం గురజాడ వెంకట అప్పారావు చిరస్మరణీయుడుగా నిలుస్తారని సాహిత్యవేత్త నరహరి అన్నారు. గురజాడ 150వ జయంత్యుత్సవాల సందర్భంగా ఖమ్మంలోని జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో సెప్టెంబర్ 21న ఏర్పాటైన కార్యక్రమంలో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఆయన మాట్లాడుతూ... 'మంచియన్నది మాల అయితే మాల నేనవుతా"నని ఆనాడే గురజాడ ధైర్యంగా ప్రకటించారని అన్నారు. ఆయన రచించిన తొలి తెలుగు నాటకం 'కన్యాశుల్కం'లోని పాత్రలు నేటికీ సజీవంగా నిలిచి ఉన్నాయన్నారు. గురజాడ సాహిత్యంలో ఆనాటి కవుల వర్ణన పద్ధతికి భిన్నంగా.. అవే విషయాలను వాడుక భాషలో పామరులకు సైతం అర్థమయ్యేలా వివరించటం ఆయన రచనల విశిష్టతలని చెప్పారు. 'ఒపీనియన్స్ ఛేంజ్ చేసేవాడే పొలిటీషియన్' వంటి పలు రకాల డైలాగులు నేటికీ సజీవంగా నిలిచాయని అన్నారు. జిల్లా విద్యాశాఖాధికారి చింతరెడ్డి వెంకటరెడ్డి మాట్లాడుతూ.. కుల, మత, ఆర్థికపరమైన విచక్షణ అసమానతలు సమాజాభివృద్ధికి ఆటంకాలనే విషయాన్ని గురజాడ ఆనాడే చక్కగా వివరించి, దార్శనికుడిగా నిలిచారని అన్నారు. జన విజ్ఞాన వేదిక (జేవీవీ) రాష్ట్ర ఉపాధ్యక్షుడు ఆలస్యం నాగేశ్వరరావు, సాహితీ స్రవంతి అధ్యక్షుడు ఆనందాచారి అధ్యక్షులుగా వ్యవహరించిన ఈ సభలో కవి సీతారాం, 'ఫెమా' కన్వీనర్ ముప్వా శ్రీనివాసరావు, జేవీవీ నాయకులు ఎం సూర్యనారాయణ, వీరభద్ర రావు, ఎం సత్యనారాయణ, వి.వి. మోహన్, టి. రాఘవయ్య, వి. ఉపేందర్, వి. సునంద – వంజాకు లక్ష్మీనారాయణ, ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్షుడు దేవేంద్ర, వివిధ రంగాల ప్రముఖులు రవిమారుత్, రమణారావు తదితరులు పాల్గొన్నారు. వివిధ పోటీలలో విజేతలైన విద్యార్థులకు బహుమతులను అతిథులు ప్రధానం చేశారు. 'కన్యాశుల్కం' నాటకంలోని సన్నివేశాలను న్యూఇరా (ఖమ్మం) పాఠశాల విద్యార్థులు చక్కగా ప్రదర్శించారు. గురజాడ అప్పారావు జయంతి సందర్భంగా జన విజ్ఞాన వేదిక, సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో శుక్రవారం ఖమ్మంలో ప్రదర్శన జరిగింది. దీనిని పెవిలియన్ గ్రౌండ్‌లో ఖమ్మం మున్సిపల్ కమిషనర్ శ్రీనివాసరావు ప్రారంభించారు. తొలుత, 150 మంది విద్యార్థులు 'దేశమును ప్రేమించుమన్నా' గీతాన్ని ఆలపించారు. ఈ కార్యక్రమంలో జడ్‌పీఎస్ఎస్ వెలుగుమట్ల, ఖమ్మంలోని హార్వెస్ట్, న్యూవిజన్, శ్రీ చైతన్య, న్యూఇరా, రిక్కాబజార్, సంచరీ, నిర్మల్ హృదయ్, కెవీఎం, అరవింద, గౌతమి తదితర పాఠశాలల విద్యార్థులు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు.

# ఆంధ్ర సాహిత్యంలో గురజాడతో స్త్రీల పర్వం మొదలైంది

ఆంధ్ర సాహిత్యంలో గురజాడ వెంకట అప్పారావు రచనలతోనే స్త్రీల పర్వం మొదలైందని వక్తలు పేర్కొన్నారు. స్త్రీలకు బానిసతనం నుండి విముక్తి కల్గించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పొందాలన్న స్ఫూర్తిని రగిల్చే లక్ష్యంతో గురజాడ రచనలు సాగాయన్నారు. నాటకం,



**సెప్టెంబర్ 21న నంద్యాల సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో నవభారత్ స్కూల్‌లో గురజాడ వెంకట అప్పారావు 150వ జయంతి సభ**

కవిత్వం, కథలు అనే ప్రక్రియల్లో ఆయన రచనల్లో వస్తువు ఒక్కటేనని పాశ్చాత్య నాగరికత వ్యామోహం, బాల్యవివాహాలు, వితంతు వివాహాల సమస్యలను, వేశ్యవ్యవస్థ నిర్మూలన, కుల మత సాంప్రదాయాలు, విద్యావ్యవస్థ, మూఢ ఆచారాలు, అవినీతి అనే అంశాలపై రచనలు సాగించి సమాజాన్ని జాగృతం చేసిన మహోన్నత రచయిత గురజాడన్నారు. దేశభక్తిని ప్రభోదిస్తూ దేశమంటే మట్టికాదు మనుషులని, మనుషులకు తిండి ఉండాలని తిండి కలిగితే కండ కలదోయ్ కండ కలవాడే మనిషోయ్ అని మనిషికి అర్థాన్ని చెప్పిన సంస్కర్తగా పేర్కొన్నారు. సొంత లాభం కొంత మానుకొని పొరుగువానికి సహాయపడమని ఒట్టిమాటలు కట్టిపెట్టి గట్టి మేలు తలపెట్టవోయ్ అంటూ అతి సాధారణ పదాలతో సమాజ మార్పుకు మంచి సందేశాన్ని ఇచ్చిన సంఘ సంస్కర్త అని కొనియాడారు. సెప్టెంబర్ 21న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో నంద్యాలలోని నవభారత్ స్కూల్‌లో ఎం. శ్రీనివాసమూర్తి అధ్యక్షతన గురజాడ వెంకట అప్పారావు 150వ జయంతి సభ నిర్వహించడం జరిగింది. సభకు ముఖ్య అతిథిగా రామకృష్ణా విద్యాసంస్థల అధినేత డా.జి.రామకృష్ణారెడ్డి హాజరయ్యారు. సభ ప్రారంభంలో గురజాడ చిత్రపటానికి పూలమాలలు వేసి నివాళులర్పించారు. అనంతరం గురజాడ రచించిన దేశమును ప్రేమించమన్న గేయ ఆలాపనతో సభా కార్యక్రమాలను ప్రారంభించడం జరిగింది. ప్రధాన వక్తలుగా సాహితీ స్రవంతి నాయకులు కళామురళి, కల్లూరి ఆనందరావు, కార్యదర్శి మాదాల శ్రీనివాసులు, నవభారత్ స్కూల్ కరస్పాండెంట్ నవభారత్ హుసేన్, ప్రైవేట్ స్కూల్ అసోసియేషన్ డివిజన్ అధ్యక్షులు దస్తగిరి, ఆవాజ్ జిల్లా అధ్యక్షులు ఎండి ముర్తుజా, డివిజన్ కార్యదర్శి సమద్, భగత్‌సింగ్ లైబ్రరీ వ్యవస్థాపక చైర్మన్ బి.శంకరయ్యలు పాల్గొని ప్రసంగించారు. కార్యక్రమంలో ప్రైవేట్ స్కూల్ కరస్పాండెంట్ ప్రకాష్, రవీంద్రనాథ్, ఖాజాహుసేన్, ప్రసాద్ పాండే, యుటిఎఫ్ నంద్యాల కార్యదర్శి కృష్ణమూర్తి, నవభారత్ స్కూల్ హెచ్‌ఎం ఇస్మాయిల్‌పీర్, ఉపాధ్యాయులు, విద్యార్థిని, విద్యార్థులు, సాహితీ వేత్తలు తదితరులు పాల్గొన్నారు.

**మాదాల శ్రీనివాసులు**

# కథలకు ఆహ్వానం

ప్రపంచీకరణ నేపథ్యంలో సమాచార సాంకేతిక విప్లవం కారణంగా తక్కువ వ్యయంతో ప్రాంతీయ భాషల్లో 24 గం॥ల టీవీ ప్రసారాలు అందుబాటులోకి వచ్చాకా, గత రెండు దశాబ్దాలుగా తెలుగు సమాజంలో ఎన్నో పోకడలు సంభవించాయి. మానవ సంబంధాలు అనూహ్యంగా మారాయి. సీరియళ్ళు, సినిమా ఆధారిత కార్యక్రమాలు, వార్తలు, చర్చలు, రియాలిటీ షోలు, ప్రకటనలు ఇవన్నీ మన ఆలోచనా సరళిని, జీవన విలువల్ని, వేషభాషల్ని, ఆహార విహారాలని, నిద్రా ఆరోగ్యాలను, విరామ సమయాన్ని, ఉత్పత్తి సంబంధాల్ని, కళాభిరుచుల్ని తీవ్రంగా ప్రభావితం చేశాయి. వస్తు వ్యామోహం, లాలసత, స్పందనారాహిత్యం, సున్నితత్వం కోల్పోవడం పెరిగాయనే విమర్శ ఉంది. చానెళ్ల వాణిజ్య వ్యూహాలు, రాజకీయ ప్రయోజనాలు వీటన్నిటిని శాసిస్తున్నప్పటికీ విభిన్న అభిప్రాయాలకు, పలువాదాలకు, సమాజంలోని వివిధ వర్గాల జీవన వైవిధ్యానికి, వేర్వేరు మాండలికాలకు, టీవీ వేదికనేర్పరచింది.

ఈ ధోరణుల్ని ప్రతిఫలించిన కథల్ని సేకరించి ఒక సంకలనం తేవాలని మేం సంకల్పించాం. 1991 నుంచి ఇప్పటివరకు తెలుగు సమాజం మీద టీవీ ప్రభావాన్ని ప్రతిఫలించిన కథల్ని / వాటి వివరాలని ఎ.కె. ప్రభాకర్, బి-205, సోలంకీస్ గుల్‌మోహర్ అపార్ట్‌మెంట్, బ్రాహ్మణవాడ, బేగంపేట్, హైదరాబాద్ - 500016. (మొబైల్ నం : 9676676028. ఈమెయిల్ : drakprabhakar@gmail.comకు పంపవలసిందిగా కోరుతున్నాము.

**- నాగసూరి వేణుగోపాల్, - ఎ.కె. ప్రభాకర్**
**(సంపాదకులు)**




**కవయిత్రి డా. సి. భవానీదేవి తెలుగు కవిత్వానికి హిందీ అనువాద సంపుటి "అక్షర్ మేరా అస్తిత్వ్"ను ఆగష్టు 27న హైదరాబాద్‌లో ఆం.ప్ర. హిందీ ఏకాడమీలో డా. సి. నారాయణరెడ్డి ఆవిష్కరించిన దృశ్యం. చిత్రంలో ఎడమ నుంచి పేరిశెట్టి శ్రీనివాస్, దక్షిణ భారత హిందీ ప్రచార సభ, హైదరాబాద్ అధ్యక్షులు డా. రిషభ్‌దేవ్‌శర్మ మూలకవయిత్రి, ఆవిష్కర్త, అనువాద కవయిత్రి శ్రీమతి ఆర్. శాంతసుందరి, ఆచార్య ఎన్.గోపి, ద.భా. హిం.ప్ర. సభ లెక్చరర్ డా. జి. నీరజ ఉన్నారు.**

# ఆదోనిలో సాహిత్య కార్యక్రమాలు

కర్నూలు జిల్లా ఆదోని పట్టణంలో సాహిత్య కార్యక్రమాలు సాహితీ స్రవంతి ఆదోని డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో ప్రతి నెలా చేయడం వల్ల పట్టణంలో సాహితీ వాతావరణం ఏర్పడింది. క్రమం తప్పకుండా చేయడంలో సాహితీ స్రవంతి ముందంజలో ఉంది.

**ఆగష్టు 29 :** తెలుగు భాషాదినోత్సవ వేడుకలను సుమారు వెయ్యి మంది విద్యార్థులతో పట్టణంలో తెలుగు తల్లి గీతాలను ఆలపిస్తూ ర్యాలీని ఆదోని 1వ పట్టణ సర్కిల్ ఇన్‌స్పెక్టర్ బివి రమణ ప్రారంభించారు. డివిజన్ అధ్యక్షులు ఆవుల బసప్ప ఆధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో సిఐ మాట్లాడుతూ తెలుగు అంతరించిపోయే ప్రమాదం ఉందని యూనెస్కో నివేదికలు చెబుతున్నాయని, ఈ నేపథ్యంలో రాష్ట్ర వ్యాప్తంగా భాషా ఉద్యమాలు చేయడం వల్ల మన మాతృభాషను కాపాడుకునే వారమవుతామన్నారు. ఆంగ్ల పరిజ్ఞానం అవసరమైనప్పటికీ, విలువలు అలవడేది ఒక్క మాతృభాషలోనే నని అన్నారు. శ్రీకృష్ణదేవరాయ పాఠశాల కరస్పాండెంట్ ఉశేనప్ప మాట్లాడుతూ ప్రస్తుత కార్పోరేటు విద్యాసంస్థలు వెలుస్తున్న ఈ రోజుల్లో తెలుగు మాధ్యమ ఉన్నత పాఠశాలను పట్టణంలో నెలకొల్పి మాతృభాషపై మమకారం పెంచుకునేలా కృషిచేస్తున్నామన్నారు. పట్టణంలో వెలసిన ఏకైక ప్రయివేటు తెలుగు మాధ్యమ పాఠశాల తమదేనని అన్నారు. జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాల రాజీవ్‌నగర్ ప్రధానోపాధ్యాయులు రంగన్న మాట్లాడుతూ తెలుగుభాషా పరిరక్షణకు ప్రతి ఒక్కరు నడుంబిగించాలని ఉత్తర ప్రత్యుత్తరాలు, జీవోలు తెలుగులో వెలువడేలా ప్రభుత్వంపై వత్తిడి తీసుకురావాలన్నారు. ప్రజాశక్తి ఆదోని డివిజన్ స్టాఫ్ రిపోర్టర్ రామదాసు మాట్లాడుతూ రాష్ట్రంలో అధికార భాషా సంఘం మొక్కుబడిగా ఉందని భాషాభివృద్ధికి తీసుకున్న చర్యలు శూన్యమన్నారు. తెలుగు భాష పటిష్టంగా అమలుకు ప్రభుత్వం చర్యలు తీసుకోడం లేదని శాసనసభలో అరవైశాతం మంది ఎమ్మెల్యేలు ఆంగ్లంలో మాట్లాడటం సిగ్గు చేటన్నారు. ప్రభుత్వం తెలుగుభాషాభివృద్ధికి ప్రత్యేక మంత్రిత్వశాఖను ఏర్పాటు చేయాలన్నారు.



ఆదోనిలో తెలుగుభాషా ర్యాలీని ప్రారంభిస్తున్న సర్కిల్ ఇన్‌స్పెక్టర్ బి.వి రమణ

ర్యాలీ కృష్ణదేవరాయపాఠశాల నుండి పట్టణంలోని కొత్తబస్టాండ్, ఎమ్మిగనూర్ సర్కిల్, టూటౌన్, భీమాస్ సర్కిల్, శ్రీనివాసభవన్ మీదుగా పురవీధులగుండా మూడు గంటలపాటు సాగింది. ఈ కార్యక్రమంలో జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగారమోహన్ డివిజన్ నాయకులు నల్లారెడ్డి,




జాషువా జయంతిని పురస్కరించుకుని ఫొటోకు పూలమాలలు వేస్తున్న ఆదోని సాహితీ స్రవంతి కమిటీ సభ్యులు

నరసింహులు, భాస్కర్ పాల్గొని ర్యాలీని పర్యవేక్షించారు.

**సెప్టెంబర్ 5 :** గుర్రం జాషువా జీవితం – వ్యక్తిత్వం అనే అంశంపై చర్చావేదిక నిర్వహించడం జరిగింది. డివిజన్ అధ్యక్షులు ఆవుల బసప్ప అధ్యతన జరిగిన ఈ కార్యక్రమంలో ఆదోని ఆర్ట్సుకళాశాల తెలుగు శాఖాధిపతి డా. సంజన్న ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగించారు. జాషువా రచనల్లో సామాన్యుడి జీవితం ప్రతిబింబిస్తుందని మానవీయ అంశాలు కనిపిస్తాయన్నారు. గబ్బిలం, ఫిరదౌసి, ముంతాజ్‌మహల్, క్రీస్తు చరిత్ర రచనలు నేటి యువతరానికి అవసరమన్నారు. తెలుగు సాహిత్యంలో అరుదైన సాహిత్యసృజన చేసిన మహాకవి జాషువా అని అన్నారు. అణగారిన ప్రజల బాధలే కాకుండా దళిత తాత్విక దృక్పథాన్ని ప్రపంచానికి చాటిన మహనీయుడు జాషువా అని అభివర్ణించారు. జాషువా జీవితంలో అనేక కోణాలు దేశభక్తి, మానవత్వంతో ముడిపడి ఉన్నాయన్నారు. ఈ చర్చలో పాల్గొన్న డా. హరికిషన్ మాట్లాడుతూ జాషువా సాహిత్యాన్ని ప్రభుత్వం ప్రజల్లోకి తీసుకెళ్లాలని, ఆ ప్రయత్నం చేయడంలో విఫలమైందని అన్నారు. రాష్ట్ర ప్రభుత్వం కవుల వర్థంతులు జయంతులు అధికారికంగా చేయాలని యుటిఎఫ్ డివిజన్ నాయకులు హనుమంతు అన్నారు. చర్చలో వివిధ సంఘాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న నాయకులు రుద్రముని, భాస్కర్, నల్లారెడ్డి, సక్కరిభాస్కర్ లు పాల్గొని ప్రసంగించారు. అంతకు ముందు జాషువా చిత్రపటానికి పూలమాల వేసి చర్చ ప్రారంభించారు.

**గురజాడ జయంతి :**

గురజాడ దేశభక్తి విప్లవాత్మకమైనదని, అది మనుస్మృతిలోంచి పుట్టలేదని ఫ్రెంచి విప్లవం అందించిన స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే సూత్రాలలోంచి పుట్టిందని, అందుకే అతని దేశభక్తికి అంతర్జాతీయ నేపథ్యముందని జనవిజ్ఞానవేదిక రాష్ట్రకార్యదర్శి గోపాలకృష్ణయ్య, సాహితీస్రవంతి జిల్లాప్రధాన కార్యదర్శి కెంగారమోహన్, ఆర్ట్సుకళాశాల తెలుగుశాఖాధిపతి డా. సంజన్నలు అన్నారు. సెప్టెంబర్ 21న సాహితీస్రవంతి, జనవిజ్ఞానవేదిక సంయుక్త ఆధ్వర్యంలో శ్రీకృష్ణదేవరాయ ఉన్నతపాఠశాల ఆవరణంలో గురజాడ



సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఆదోనీలో గురజాడ జయంతి

అప్పారావు 150 జయంతి వేడుకలను చిత్రపటానికి పూలమాలవేసి ప్రారంభించారు. పాఠశాల కరస్పాండెంట్ హుసేనప్ప ఆధ్యక్షత వహించిన ఈ సభలో వారు మాట్లాడుతూ దేశాన్ని ప్రేమించడమంటే దేశంలోని మనిషిని ప్రేమించడమేనని, గురజాడ దృష్టిలో మనిషిని మనిషిని నమ్మేవాడు, మనిషిని గౌరవించేవాడు నిజమైన దేశభక్తుడని అన్నారు. మనిషి చేసిన రాయి, రప్పకు మహిమ ఉన్నదని మొక్కి సాటి మనిషిని రాయికన్నా హీనంగా చూసే భక్తిని గురజాడ ఆమోదించరని అన్నారు. గురజాడ మహిళాభ్యుదయానికి చేసిన సేవ అనిర్వచనీయమని సాంఘిక దురాచారాలపై ఆయన కలం చేసిన పోరు, అక్షరవిన్యాసం, తెలుగు సాహిత్యం బతికున్నంత కాలం శాశ్వతంగా ఉంటుందన్నారు. గురజాడ దేశభక్తికి మనిషి పునాది అని, మనిషి మానవశ్రమ, దాని ఉత్పత్తి మానవసంబంధాలు ఆయన దేశభక్తిలోని కీలక అంశాలన్నారు. సాహితీ స్రవంతి డివిజన్ అధ్యక్షులు ఆవుల బసప్ప మాట్లాడుతూ సామాజిక చైతన్యమే గురజాడ చిరునామా అని సంఘాన్ని ప్రగతి పథంలో నడిపిన ధీశాలి గురజాడ అన్నారు. ఎల్ఐసి యూనియన్ నాయకులు కిష్టప్ప మాట్లాడుతూ మనిషిని మనిషిగా చూసే సమాజం ఆవిర్భవించాలని కలలు కన్న సాహితీవేత్త గురజాడ అని అభివర్ణించారు. ఎపి రెసిడెన్షియల్ పాఠశాల ఉపాధ్యాయులు అష్టావధాని రమాకాంత్ మాట్లాడుతూ మహాకవి శ్రీశ్రీ దృష్టిలో గురజాడ, తిక్కన, వేమనలు కవిత్రయమని అన్నారు. పాఠశాల విద్యార్థులు, ఉపాధ్యాయులు, వక్తలు కలసి గురజాడ దేశభక్తి గేయాన్ని ఆలపించారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి డివిజన్ నాయకులు నల్లారెడ్డి, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

– కెంగార మోహన్

## గజపతి నగరం - సాహితీ స్రవంతి

గజపతి నగరం సాహితీ స్రవంతి రెండవ కార్యక్రమం స్థానిక హర్షవర్ధన స్కూల్‌లో ఆగష్టు 17వ తేదీ సాయంత్రం 5 నుండి 9 వరకు జరిగింది. ఈ కార్యక్రమానికి గంటేడ గౌరునాయుడు హాజరయ్యారు. పాయల మురళీకృష్ణ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ పాల్గొన్నారు. గౌరునాయుడు మాట్లాడుతూ ప్రతీ రచయిత, కవి తాను రాసిన మొదటి పదివేల పేజీలు తనవి కావని భావించాలని నిబద్ధతతో సాహిత్యాన్ని సృజించాలని, అధ్యయనానికి ముఖ్య ప్రాధాన్యత నివ్వాలని క్రొత్తగా రాస్తున్న కవి మిత్రులందరికీ విలువైన సూచనలిచ్చారు. పాయల, 'జాషువా' పద్యాన్ని రాగ యుక్తంగా చదివి వినిపించారు. చీకటి దివాకర్ సాహితీ స్రవంతి, గజపతినగరంలో ఏర్పాటు చేయడానికి కారణాలు వివరిస్తూ సహకరిస్తున్న మిత్రులకు ధన్యవాదాలు తెలిపారు. కవి మిత్రులు కవితలు చదివి వినిపించారు. గౌరవనాయుడు చివర్లో వాటిని సమీక్షించారు. రమణమూర్తి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది. గజపతినగరం సాహితీ స్రవంతి మూడవ కార్యక్రమం స్థానిక శాఖా గ్రంథాలయంలో 'తెలుగు భాష' అనే అంశంపై సెప్టెంబర్ 10 సాయంత్రం నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమానికి, కన్వీనర్ చీకటి దివాకర్, కవులు సిరికి స్వామినాయుడు, మానాపురం రాజాచంద్రశేఖర్‌లు హాజరయ్యారు. వాసు అధ్యక్షతన పాయల మురళీకృష్ణ ఆధ్వర్యంలో కవి సమ్మేళనం జరిగింది. తొలుత పాయల తెలుగుభాష గొప్పదనంపై తన స్వీయ సీసపద్యాన్ని చదివి వినిపించారు. అనంతరం సిరికి స్వామినాయుడు ఛిద్రమైపోతున్న మానవతా విలువలు, తెలుగుభాష నేటి పిల్లలకు ఎలా దూరమైపోతుందో వివరిస్తూ ఒక కవితను చదివి వినిపించారు మానాపురం చంద్రశేఖర్ తనకవితను వినిపించారు. రమణమూర్తి తెలుగు భాషపై తన కవితను చదివి వినిపించారు. ఈ కార్యక్రమంలో తవ్వా అనంతరావు, కొండేటి శ్రీనివాస రామారావు, గంద్రేటిశ్రీను, డి.జి.ఎస్. శ్రీనివాసరావు, మంగపతి, కీల్లారి పద్మజ, చెళ్ళపిళ్ళ శ్యామల, పైడి నాయుడు, వెంక రామారావు మొదలైనవారు మాట, పాట, పద్యం, కవిత మొదలగు అంశాలు తెలుగు భాష అంశంగా వివరించారు. చీకటి దివాకర్ సభలో అడిగిన ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ థర్మల్ ప్రాజెక్టులను, సెజ్‌లను కవులు ఎందుకు వ్యతిరేకించవలసి వస్తుందో కూలంకుషంగా వివరించారు. చివర్లో చీకటి చంద్రిక పాట పాటగా, అధ్యక్షులు వాసు తన స్వీయ కవితను వినిపించారు. సిరికి స్వామినాయుడు కవితల్నీ పాటల్నీ సమీక్షించారు. వచ్చే కార్యక్రమం అక్టోబర్ 10గా నిర్ణయించడం జరిగింది. వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

– పాయల మురళీకృష్ణ

## ఆశారాజు ఎ.ఎస్. జగన్నాథ శర్మలకు విమలశాంతి పురస్కారాలు

2012 సంవత్సరానికి గాను విమలాశాంతి పురస్కారాలను ట్రస్ట్ ఛైర్మన్ డా. శాంతినారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. ట్రస్ట్ ఆహ్వానం మేరకు 56 మంది కవితా సంపుటాలను పంపించారని తెలిపారు. వాటిలో ఆశారాజు కవితా సంపుటి 'ఇప్పుడు'ను శాంతి రజనీకాంత్ స్మారక కవితా పురస్కారానికి ఎంపిక చేశామని, న్యాయ నిర్ణేతలుగా కె. శివారెడ్డి, దర్భశయనం శ్రీనివాసాచార్య, మల్లెల నరసింహమూర్తి వ్యవహరించారని తెలిపారు. ఈ సంవత్సరం నుండి విమలాశాంతి సాహిత్య సేవా పురస్కారాన్ని అందిస్తున్నట్లు, దానిని మొదటగా ఎ.ఎస్ జగన్నాథశర్మకు ఈ పురస్కారాన్ని అందిస్తున్నట్లు తెలిపారు. అక్టోబర్‌లో హైదరాబాద్‌లో జరగబోయే కార్యక్రమంలో ఈ పురస్కారాలను అందజేస్తామని ఆ ప్రకటనలో తెలిపారు.



ఆగష్టు 27న "చెట్టుకి విత్తనం చేపకి సముద్రం పిట్టకి ఆకాశం భాషకి మాండలికం" పుస్తకావిష్కరణలో కొండ్రెడ్డి, ద్వా.నా.శాస్త్రి. ఎల్.కె. కృష్ణమూర్తి, దేవి, కవి రచయిత వై. శ్రీరాములు, మండలి బుద్ధప్రసాద్, సామల రమేష్‌బాబు, బైసదేవస్.




జూలై 1న కరీంనగర్‌లో దాస్యం సేనాధిపతి రచించిన 'శబ్దలయ' కవితా సంపుటి ఆవిష్కరణ సభలో నేటినిజం పత్రిక సంపాదకులు బైస దేవదాస్, రచయిత దాస్యం సేనాధిపతి, ఆవిష్కర్త నటుడు, కవి కె. రంగనాథ్, డా॥ సి. రమేశ్, మాడిశెట్టి గోపాల్ తదితరులు.



ఆగష్టు 21న హైదరాబాద్ రవీంద్రభారతి వేదికపై జరిగిన సభలో ప్రముఖ సాహితీవేత్త డా. ఇందారం కిషన్‌రావుకు వానమామలై జీవిత సాఫల్య పురస్కారాన్ని అందజేస్తున్న మంత్రి డి. శ్రీధర్‌బాబు, డా. కె.వి. రమణాచార్యులు వైద్య నారాయణరావు, బి.రామకృష్ణయ్య, డా. తిరుమల శ్రీనివాసాచార్య తదితరులు ఉన్నారు.



ఆగష్టు 21న హైదరాబాద్ రవీంద్రభారతి వేదికపై అభినవ పోతన శతజయంతి ఉత్సవ సమితి ఆధ్వర్యంలో జరిగిన వానమామలై శతజయంతి ఉత్సవాల సమానోత్సవంలో "వానమామలై శత పద్య పారిజాతాలు" గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న డి. శ్రీధరబాబు. చిత్రంలో తాళ్లపల్లి మురళీధర గౌడు, డా. జె. బాపురెడ్డి, కృతికర్త డా. తిరుమల శ్రీనివాసాచార్య డా. ఎ. భూమయ్య, ఆర్వీ రమణమూర్తి కృతిస్వీకర్త డా. కె.వి. రమణాచార్య, డి. సురేశ్‌కుమార్, డా. సినారె ఉన్నారు.



గుంటూరులో అభ్యుదయ రచయిత సంఘం నిర్వహించిన కొండేపూడి శ్రీనివాసరావు సాహితీ సత్కారాన్ని ప్రముఖ కథ, నవలా రచయిత తల్లావఝ్ఝల పతంజలి శాస్త్రికి అందజేస్తున్న ఎ. క్రాంతిరేఖ. వేదికపై సాహితీ ప్రముఖులు వల్లూరు శివప్రసాద్, పెనుగొండ లక్ష్మీ నారాయణ, డా.కె. రామమోహన్‌రాయ్‌లు.



అక్టోబర్ 16న విజయవాడ ప్రెస్ క్లబ్‌లో జరిగిన 'పరిమిళం' కథా సంపుటి ఆవిష్కరణ సభలో వేదికపై శ్రీయుతులు చలపాక ప్రకాష్, దిట్టకవి శేషాచార్యులు, రచయిత్రి కోపూరి పుష్పాదేవి మాజీ మంత్రి మండలి బుద్ధప్రసాద్, కృ.రీ.సం అధ్యక్షులు జి. సుబ్బారావు, గుమ్మా సాంబశివరావు.

# డా. హరీష్‌కు నివాళి

అమరజీవి డా. కానూరి హరీష్ ఆరవ వర్ధంతి సందర్భంగా స్థానిక బోడేపూడి విజ్ఞాన కేంద్రంలో ఆ సంస్థ డిప్యూటీ జనరల్ మేనేజర్ కందాడై శ్రీనివాసులు అధ్యక్షతన సెప్టెంబరు 22న సంతాపసభ జరిగింది. ఆ సభలో బి.వి.కె. ట్రస్ట్ బోర్డ్ వైస్ చైర్మన్ పోతినేని సుదర్శనరావు ప్రధాన ప్రసంగం చేశారు. జిల్లాలో అనేక వామపక్ష ఉద్యమాలకు, ప్రగతిశీల కార్యక్రమాలకు, హరీష్ కొండంత అండగా వుండేవారని ఆయన తన ప్రసంగంలో పేర్కొన్నారు. మొదట ప్రజల అనారోగ్యాలను పారద్రోలే వైద్యుడిగా ప్రస్థానాన్ని ప్రారంభించిన హరీష్ క్రమక్రమంగా తన సేవలను విస్తృత పరచుకొని సామాజిక రుగ్మతలను పారద్రోలే ఆందోళనలలో భాగస్వామియై, తను మరణించేవరకు ఆ కర్తవ్య దీక్షకు విరామమివ్వలేదని పోతినేని అన్నారు. సంగీతమన్నా, సాహిత్యమన్నా యిష్టపడే హరీష్ నిరంతర అధ్యయనశీలని ఆయన అన్నారు. తన తదనంతరం కొన్ని లక్షల రూపాయల విలువచేసే తన పుస్తకాలను బి.వి.కె. గ్రంథాలయానికి అప్పగించమని వీలునామాలో పేర్కొన్న హరీష్ గొప్ప వితరణశీలియని కొనియాడారు. వారి కుటుంబమిచ్చే ఆర్థిక సహాయంతోనే వారి కుమారుడు కీ.శే. కానూరి



ప్రేమ్‌చంద్ జ్ఞాపకార్థం ఒక హాస్పటల్ నడిపే అవకాశం బి.వి.కె.కు కలిగిందని చెప్పారు. తొలుతగా డా. కె. హరీష్ చిత్రపటానికి పూలమాలవేసి నివాళి అర్పించారు. ఈ కార్యక్రమంలో బి.వి.కె. ట్రస్ట్ సభ్యులు నున్నా నాగేశ్వర రావు, బండారు రవికుమార్, మచ్చా వెంకటేశ్వర్లు, బుగ్గవీటి సరళ, కానూరి హిమబిందు, ఎ.జె.రమేష్, మేనేజింగ్ కమిటీ సభ్యులు గోపాలరావు, ఎం. రామారావు, వై.శ్రీనివాసరావు, లైబ్రేరియన్ కపిల రామ్‌కుమార్, ఎస్.ఎఫ్.ఐ. నాయకులు, బి.వి.కె. విద్యార్థులు ఈ సభలో పాల్గొని డా.కె. హరీష్‌కు నివాళులర్పించారు.

# జాషువా కవిత్వంలో దళిత జీవన దృశ్యాలు



గుర్రం జాషువా కవిత్వంలో దళిత జీవన దృశ్యాలు కళ్లకు కట్టినట్లు కన్పిస్తాయని, తెలుగు సాహితీ ప్రపంచంలో గుర్రం జాషువా ధ్రువతార అని ప్రముఖ కథా రచయిత, డాక్టర్ ఎం హరికిషన్ అన్నారు. సెప్టెంబర్ 14న స్థానిక వింధ్యశ్రీ ఆంగ్ల మాధ్యమ పాఠశాలలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో గుర్రం జాషువా జయంతి ఉత్సవాలు ఆదోనిలో నిర్వహించారు. పాఠశాల ప్రధానోపాధ్యాయులు పిఎస్ నాగేంద్ర అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ సామాజిక సమస్యలపై, దళితుల స్థితిగతులపై జాషువా రచనలు చేశారని అన్నారు. సాహితీ వినీలాకాశంలో గబ్బిలం, ఫిరదౌసి, ముంతాజ్‌మహల్, క్రీస్తు చరిత్ర వంటి రచనలుచేసి కేంద్ర సాహితీ అకాడమి అవార్డు పొందారని అన్నారు. మేఘసందేశం కావ్యం ద్వారా కాళిదాసు తన బాధను సందేశంగా పంపితే దళితుల కష్టాలను, వివక్షను గబ్బిలం ద్వారా సందేశం పంపారన్నారు. అనంతరం సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగార మోహన్ మాట్లాడుతూ సాహిత్యం ద్వారా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన జాషువా శాసన మండలి సభ్యుడిగా ఎదిగారని, నేటి తరానికి జాషువా రచనలు ఎంతో అవసరమన్నారు. రాష్ట్ర ప్రభుత్వం జాషువా రచనలను అన్ని పాఠశాలలకు ఉచితంగా పంపిణీచేసి సాహిత్య వ్యాప్తి చేయాలన్నారు. జాషువా రచనలపై పరిశోధనలను ప్రోత్సహించాలన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి డివిజన్ నాయకులు రామదాసు, వింధ్యశ్రీ డైరెక్టర్ జ్యోతి పాల్గొన్నారు.



**విజయవాడలో క్షేత్రయ్య కళాక్షేత్రంలో రాంకీ కల్చరల్ ఫౌండేషన్,అరవిందఆర్ట్స్,అరసం,విశాలాంధ్ర పబ్లికేషన్, అమరావతి పబ్లికేషన్స్ ఆధ్వర్యంలో జరిగిన తెలుగు గేయ వైభవం కార్యక్రమలో తల్లీ! నిన్నుదలంచి, 'శతాబ్ది' 'నా చిన్నతనంలో', 'గుడుగుడు మంచి' మొదలైన 10 పుస్తకాలను ఆవిష్కరిస్తున్న చాడ వెంకటరెడ్డి, మండలి బుద్ధప్రసాద్, ఎ.ఎన్ జగన్నాథశర్మ, సుద్దాల అశోక్‌తేజ, డా. జంధ్యాల మహతీశంకర్, బి. ఈశ్వరరెడ్డి, డా. పాపినేనిశివశంకర్, ఆకాశవాణి సహాయ సంచారకులు యం. కృష్ణకుమారి, వల్లూరు శివప్రసాద్ చిత్రకారులు వీ.వీ. కొల్లోజు తదితరులు**

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20, **Editor: T. Ravi**


విజయవాడ సాహిత్య కార్యశాలలో భాగంగా జరిగిన కవిత్వ శాలలో ప్రసంగిస్తున్న ఖాదర్ మొహిద్దీన్. కవి సమ్మేళనం నిర్వహించిన శాంతిశ్రీ, చీకటి దివాకర్, ఉమామహేశ్వరి,

ప్రసంగిస్తున్న సీతారాం, వొరప్రసాద్


కన్యాశుల్కం సన్నివేశ ప్రదర్శనలోని దృశ్యాలు


గురజాడ దేశభక్తి గేయం నృత్యరూపకం ప్రదర్శనలోని దృశ్యాలు

గేయాలు ఆలపించిన ప్రజానాట్యమండలి బృందం


సాహిత్య కార్యశాలలో వివిధ పుస్తకాలను ఆవిష్కరించిన దృశ్యాలు. హాజరయిన సభికులు, పుస్తక ప్రదర్శన తిలకిస్తున్న సందర్శకులు



| | పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A 149 |
| పుస్తకం పేరు | లేఖానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kdaveen |
| పేజీలు విడదీసినది | Kdaveen |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |